# భారతి

మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

మార్చి 1964

సంపుటము 41 : సంచిక 3

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మార్చి 1964



---

# చిత్రశాల

శ్రీ ఆర్. ఆర్. ఉప్పుటూరి

అదిమ భాస్కరు డస్త్రాద్రి కరుగువేళ
నతివిశాల వినీలమా యభ్రవీథి
నలముకొను స్వర్ణకిరణాల వెలుగులోన
శిల్పు లెవ్వారుగనలేని శిల్పమలరె.

పొరలు పొరలుగ మబ్బు లంబరతలాన
వింతవన్నెల భవనాల వెలుగు లొలుక
వెలసె గంధర్వపురసౌధ వితతులనగ
కవుల మది వింత భావమ్ము లవతరింప.

ఇంతలో వింత రంగులింతింతతోచు
మబ్బుతెరల విలీనమై యబ్బురముగ
విశ్వరూపమ్ము దాల్చి సంప్రీతివెలయ
కర్మసందేశమందించ గడగుచుండె.

జలములందున సైకతస్థలములందు
నరుణకాంతుల ప్రసరణ ప్రాప్తివలన
నెత్తుపల్లము లొకరూప మెత్తినటుల
వింతగొల్పుచు పృథివి గన్పించుచుండె.

పులుగులు నెలవుల జేరుచు
కలకల నాదముల గూయుగానమ్ములలో
ఇలజీవిత కావ్యము తుది
పలుకు భరతవాక్యములను భావము దోచెన్

మలయ పవనోర్మి మాలికల్ మందరుచిర
నర్తనాంచిత గీతానినాద మొలయ
పరిమళసుమవనావళి బర్యటించి
శైత్యసంసక్తి నదిపైన సాగివీచె.

మలయపవనుండు పాడిన వలపుపాట
వినిన వయ్యారియా యేటి మనసులోన
పులకరింతల తీయని తలపులలర
కిలకిలల నవ్వు వినవచ్చె మలపులందు.

సంజవిరిసిన బంగరు చాయలందు
కులుకు చిన్నెలు సవరించుకొనెడి యేటి
నీట నెగిరెడు చిరుమీల నీటుమీరు
జాడలరయగ మదిపొంగు సంతసమ్ము.

వాయువశమున జలమున వస్తువొకటి
పడినయంతటగుంపులై పరిధిగట్టి
వస్తువును జేరబూను చేపలను జూడ
విశ్వమొక చిత్రశాల యన్పించు మదికి.

సలిల తలమందు మరియాకసమునగూడ
కులుకులాడంగ నైపుణికలదటంచు
చెప్పబూనిన వోయన చిత్రగతుల
పసిడి సంజల చేపలుపైకి నెగురు.

నీటనాడుచు నొకసారి నింగికెగయు
చిలిపి చేపల చేష్టల చెన్నుదన్ని
వాని మేనులు కొంగ్రొత్త వన్నెలీని
వింతశిల్పాల సృష్టి గావించుచుండె.

కల్పనమ్మునగదలిన క్రమభావ
ములను రమణీయ కవితలో తలచి మలచి
లలిత సుందర రూపమ్ము కలుగజేయ
చిత్తమాయత్తమగుచుండె చిత్రగతుల

---

# కలలకథ

శ్రీ ఆదివిష్ణు

బెజవాడ నగరంలో అద్దెకి గదులు దొరకడమనేది గొప్ప సమస్య అని ఈ ఊళ్ళో కాపురముంటున్న వాళ్ళకి తెలుసు. మావాళ్ళకేం తెలుసు ? సొంత ఊళ్ళో స్వర్గంలాటి సొంత యింట్లో కూర్చుని 'అయి బాబోయ్ అంత అద్దె' అని ఆశ్చర్య పోతే వాళ్ళకి నేనేం చెప్పేది ? ఈ ఊరు అలాటిది. ఇక్కడ అద్దెలు అలాటివి. ఆఫీసుకి దగ్గర్లో గది కావాలంటే,_అందునా అన్ని సదుపాయాలూ గలదై ఉండాలంటే అంత అద్దె యివ్వక తప్పుతుందా ?

గది దొరకడమే చాలనుకుంటూన్న నాబోటివాడిని యిటు రాముడూ, అటు ఇల్లుగలావిడా, ఇద్దరూ చిత్రవధ చేయడం ప్రారంభించేరు. ఈ హింస గదిలో చేరిన మొదటి నెల నుంచీ ప్రారంభమైంది.

తెలుగువారు గడపదాటి కానివ్వాళ్ళో ఉద్యోగం చేయ లేడనే నానుడి నాపట్ల అక్షరాలా నిజమని వొప్పుకుంటాను. దానికి తగ్గటు యీ గొడవొకటి నా మనసుని పాడుచేయడానికి.

ఇల్లుగలావిడ నోరు మంచిదికాదని రాముడు నాకు పాఠాలు చెప్పక్కర్లేదు. ఆ మహత్తర విషయం నాకూ తెలుసు. పది గంటల తర్వాత గదిలో లైటు కనుపిస్తే ఆవిడ గొంతు చించుకుని మరీ జగడానికి రావడమనేది రాముడి కొక్కడికే కాదు, నాకూ బాధగానే ఉంటుంది. కానీ—రాముడికి సర్దుకు పోడం చాతకాదు. అదేమంటే—

'నీకు పౌరుషంగానీ, చీమూ నెత్తురుగానీ లేవూ' అవ టాని నామీద విసుక్కునేవాడు. నామీద విసుక్కుంటే ఫర్వా లేదు. ఒక ఊరివాళ్ళం, ఒకే ఊళ్ళో ఉద్యోగం చేస్తున్న వాళ్ళం, పైపెచ్చు రూమ్‌మేట్సు కావడాన వాడిని క్షమించగల హృదయవైశాల్యం నాకు లేకపోలేదు. కానీ ఆవిడెవరు ? (కాళికాదేవి అంటాడు రాముడు). ఆవిడ నోరు పారేసు కుంటే వీడూ నోరుచేసుకోవడమేనా ? రాముడికోపం చూస్తుంటే ఒక్కోనాడు నాకే భయంగా ఉండేది. పొరపాటున ఆవిడమీద చేయి చేసుకుంటే వీడి గతేంగాను?—అనే దిగులూ ఉండేది. నే నెంత వారించినా వినేవాడు కాదు.

జ్ఞాపకానికి నిలిచిన రోజు ! ఇక్కడ ముచ్చటించక తప్పదు. ఆనాడు తలనొప్పిగా ఉండటంచేత ఒకగంట పర్మిషన్ పెట్టి గదికొచ్చి కూర్చున్నాను. ఒళ్ళంతా నొప్పులు—లేచి నించోడానిక్కూడా వోపిక చాలడంలేదు — కొంచెం జ్వరం లాటిది గూడా వచ్చినట్టుంది— ఇలాటి సమయాల్లో నిద్ర బాగా పనిచేస్తుందని ఒకనాటి స్వానుభవంవల్ల తెలుసు కున్నాను. అందుచేత నిద్రకోసం కళ్ళు మూశాను. కానీ ఫలితం దక్కలేదు. నిద్ర రాలేదు. పైగా విసుగ్గా ఉంది. ఓపిక గనక ఉంటే ఆపళాన లేచి లీలామహల్లో సినిమా చూసేద్దును.

అయిదయ్యింది. తలుపు దగ్గర చప్పుడైంది. పడు క్కునే తల తిప్పి ఆవేపు చూశాను. రాముడు హడావిడిగా వచ్చాడు. వచ్చి రావటంతోనే వాడి తాలూకు పెట్టె బేడా సర్దుకున్నాడు. బైట నించున్న జట్కా సాయెబుని పిలిచి అతని సాయంతో వాటిని బండిలో వేయించాడు. ఆనక నాముందు నించుని, చేతులు దులుపుకుంటో అన్నాడు.

''కొత్తగది కుదుర్చుకు వచ్చాను. మీ ఆఫీసుకి 'మరీ' దగ్గర్లో ఉంది. ఇవ్వేళే వస్తున్నామనీ చెప్పాను. రావాల నుంటే రా ! లేదూ— ఈ రాక్షసి అభిమానానికి బలైనా నాకేం అభ్యంతరం లేదు. మంచి రూమ్మేట్లు దొరకరనే అపనమ్మకం నాకు లేదు. ఏదో ఒకమాట తేల్చి చెప్పు తొరగా''.

తల దిమ్మెత్తేలా ఆశ్చర్యపోయాను.

మరేమీ మాటాడలేదు. లేచి నిలబడి బట్టలు మార్చు కున్నాను. రాముడు గర్వంగా నవ్వేడు. వా డెప్పుడూ అలాగే నవ్వుతాడు. నవ్వి అన్నాడు—

''స్నేహితులంటేం—చాలామంది ఉంటారు. కానీ నీలాటి ఆత్మీయుడూ, చెప్పిన మాటని ఆలకించి తగినవిధంగా నడుచు

కునే బుద్ధిమంతుడూ దొరకడం అరుదు. అందుకు గర్వంగా ఉంది నాకు.''

ఆపైన వాడంతట వాడే నా పెట్టే, హోల్డాలూ వగైరా సర్దేడు.

కొత్త రూములో కాలుంచే వేళకి జ్వర తీవ్రత ఎక్కువైంది నాకు. హోల్డాలు పరిచి నడుం వాల్చేను. సామానంతా అద్దంలా శ్రద్ధగా రాము డొక్కడే సర్దేడు. తర్వాత నన్ను పరామర్శించేడు—

''ఏమిటూ షేక్స్పియర్ పోజూ! మార్చేయ్. చూడలేక చస్తున్నాను.''

''నా వంట్లో బాగోలేదోయ్.''

వాడు ఖంగారుపడిన మాట వాస్తవం. నా నొసటిపైన చేయి వేశాడు. ఉలిక్కిపడ్డాడు.

'జ్వరం బాగా ఉంది'' అన్నాడు. నవ్వి ఊరుకున్నాను.

ఆ రాత్రి వాడు నాకు చేసిన పరిచర్యలు తల్చుకుంటే యిప్పటికీ రాముడిమీద జాలివేస్తుంది నాకు. ఏవో మాత్రలు తెచ్చాడు. పాలు తెచ్చాడు, కన్ను మూయకుండా రాత్రంతా నా పక్కనే కూర్చున్నాడు.

వాడికెందు కింత శ్రద్ధ ?

తెల్లవారుతూనే నవ్వుతూ పలుకరించేసరికి వాడి మొహంలో గంపె డానందం ప్రకాశించింది.

''మొత్తానికి హడలకొట్టావు. శుభమాని కొత్త రూములో చేరితే ......''

''అదేం కాదులే! పాత రూంలోనే కొంచెం తలనొప్పిగా ఉంది.'' వాడు చిన్నబుచ్చుకోడం యిష్టంలేదు నాకు.

ఆ ఉదయంగానీ మా రూమూ, పరిసరాలూ చూడటం సంభవించింది కాదు. పైగా ఆరోజు ఆదివారం కావడాన తీరుబడి చిక్కింది.

మూడు అంతస్థుల మేడ తాలూకు మూడో అంతస్థులో చివరి గది మాది. ఇక్కడ మొత్తం నాలుగు గదులున్నాయి. నాలుగింట్లోనూ మాలాటి 'కుర్రజాతే' అద్దెకుంటున్నారు. రెండో అంతస్థులో కొన్ని కాపురాలూ, క్రింది భాగంలో మరికొన్ని కాపురాలతోపాటు ఇల్లుగలవాళ్లూను. మొత్తానికి హిందూదేశానికి స్పెసిమన్‌గా ఉంది ఈ భవనం. రాముడు దీనికో చక్కటి నామకరణమూ చేశాడు. 'జాగ్‌తే రహో' బిల్డింగుట! నవ్వొచ్చింది.

మా పక్క రూముల్లోని జనాభా అందరినీ పరిచయం చేసుకున్నాడు రాముడు. వాళ్లకి నన్నూ పరిచయం చేశాడు. మావాడి కలుపుగోలుతనం కొత్తకాదు నాకు. ఎంత సీమనుంచి వచ్చిన దొరనైనా ఇట్టే ఆకట్టుకోగల గుణం రాముడికున్న అర్హతల్లో మొదటిదీ ముఖ్యమైనదీను.

హోటల్లో భోంచేసి రూమ్‌లో కొచ్చి కూర్చున్న తర్వాత సిగరెట్టు కాలుస్తో అన్నాడు వాడు—

''బిక్కుబిక్కుమంటూ ఏమీ తోచక చచ్చాం ఆ పాత గదిలో. ఇక్కడ చూడు కావలసినంత కాలక్షేపం!''

ఎంత స్నేహితులమైనా అన్నింటిలోనూ ఏకాభిప్రాయం ఉంటుందంటే నే నొప్పుకోను. అందుకే వాడి కామెంటుని పట్టించుకోలేదు.

ఈ 'భవనం' లో కాపురముంటూన్న మనుషులూ వాళ్ల వివరాలూ చాలా చెప్పాడు. గడిచిన యీ కొద్ది గంటల్లో వాడు సేకరించిన యీ వివరాలు ఆశ్చర్యాన్ని కలిగించినా, వాటికి నే నంత ప్రాముఖ్యత ఇవ్వలేదు.

అగ్గిపెట్టెకోసం పక్క రూమాయన రావడంతో రాముడి నోటికి తాళం పడింది. అగ్గిపెట్టె యిచ్చి వచ్చి నతన్ని కూర్చోపెట్టేంవాడు. అతని పేరు ఆనందరావు. గుమాస్తాయే గానీ వాలకం చూస్తుంటే అతని ఉద్యోగం చప్పున చెప్పడం తెగింపే మరి. మావాడికి తగిన నేస్తం. నిజమే.—లేకపోతే నేనంటూ ఒక క్రీచర్ అక్కడ ఉన్నాననే యిది మరిచి కేవలం వాళ్లిద్దరే మాట్లాడుకోడ మేమిటి ?

చాలా విషయాలు మాటాడుకున్నారు. చివరికి హాలీవుడ్ చిత్రాలమీదికి వచ్చింది సంభాషణ. మహానటుల పేర్లూ, వాళ్ల నటనాకౌశలమూ, వాళ్ల జీవిత విశేషాలూ వగైరాలు వాళ్ల సబ్జెక్టు. అక్కడ్నుంచి కేవలం సినిమాల గురించే చెప్పుకున్నారు. మావాడు మహత్తర కళాఖండం గురించి చెబితే ఆనందరావు ఫరెవర్ పిక్చర్సు గురించి ఉద్ఘాటించేడు. ఆ ప్రేక్షక మహాశయుల లోకోత్తరమైన టేస్ట్‌ని అభినందించక తప్పదు.

అకస్మాత్తుగా ఆనందరావు టాపిక్ మార్చేడు. వాళ్ల రూమ్‌మేటు పైన దండయాత్ర ప్రారంభించేడు.

. గుమాస్తాల్లోనూ 'రకాలు' లేకపోలేదుట. రెండొందలు పుచ్చుకునేవాడూ తొంభై రూపాయలు సంపాయించేవాడూ ఇద్దర్నీ కలిపి 'గుమాస్తా' అనడం ఆనందరావుకి మంట. వాళ్ల రూమ్‌మేటు రెండో రకం గుమాస్తాట. నాన్ గ్రాడ్యుయేటు. వచ్చే నాలుగు డబ్బుల్నీ జాగ్రత్తగా చూచి వాడుకోడం, (లేకపోతే చస్తాడా!) అవసరాలు సైతం వాయిదా

వేయడం అతని లక్షణాలట. అతనితో తన స్నేహం—తన ఉత్సాహాన్ని, పరుగులుతీసే తన సరదాలనీ చంపేస్తున్నదిట.

చెప్పద్దూ—ఆనందరావుపట్ల నాకు చిరుకోపం కలిగింది. ఇంత తలతిక్కగా మాటాడే మనుషులమీద నాకు గౌరవముండదు. అతను చెప్పేది శ్రద్ధగా వింటూ రెండో సిగరెట్టుని ఆఫర్‌చేసిన రాముడి మీదనూ కోపం వచ్చింది.

మొదట్నుంచీ—ఒక పద్ధతికి అలవాటుపడిన వాడిని. నా అభిప్రాయాలు కుండ బద్దలు కొట్టినట్టు మొహం ముందు చెప్పగల నేర్పు లేదు నాకు. అది పిరికితనమన్నా నొప్పుకోను.

వాళ్ళ మాటలు పూర్తయిన తర్వాత ఇద్దరూ మాట్నీకి ప్రయాణ మయ్యారు. నేను రాలేకపోతున్నందుకు చాలా చింతించుచున్నట్లు ఆనందరావు స్వయంగా సెలవిచ్చాడు.

ఇద్దరూ సినిమాకి వెళ్ళిన తర్వాత ఆనందరావు రూమ్ మేటుని చూడాలనిపించింది. కానీ ఆ తలుపుకి తాళంవేసి ఉంది.

మర్నాడు ఆఫీసునుంచి వచ్చే వేళకి ఆనందరావు వాళ్ళ గుమ్మం ముందు కుర్చీలో కూర్చుని ఆకాశంలోకి చూస్తున్నాడు వెంకటరెడ్డి !

ఆకాశంలోకి చూస్తోన్న (లేక) రెండు చేతుల్లోనూ తలను దాచుకుని విచారిస్తోన్న .... (లేక) శూన్యంలోకి చూపు నిలిపిన .... ఘట్టాలు చదివినా, చూసినా నవ్వుగా ఉంటుంది. క్షమించాలి. భవదీయుడిని మినహాయించి మాట్లాడటం అన్యాయమే మరి.

వెంకటరెడ్డి గ్రాడ్యుయేటు కాని కుర్రవాడు ! సినిమాలూ, సరదాలూ ఇష్టంలేని యువకుడు ! తొంభై రూపాయలకు ఊడిగంచేస్తున్న ఒకానొక నరుడు ! ఆనందరావు ఆనందాన్ని ఖూనీచేసిన హంతకుడు !

ఎదటివాడు తెలీకమునుపు అతని గురించిన ఆలోచనలు వేరు. పరోక్షంగా తెలిసిన తర్వాత కలిగే అభిప్రాయం వేరూను. ఎంత వద్దనుకుంటూన్నా రెడ్డిపైన ఆనందరావు ఉపన్యాసం గుర్తుకొస్తూనే ఉంది.

నా గది తలుపు తీస్తుండగా రెడ్డి నావైపు చూసేడు. పలుకరింపు చిహ్నంగా చిన్నగా నవ్వేను. అతనూ నవ్వేడు. అతని నవ్వులో 'కళ'' లేదు. కాదంటే అతన్ని మరో కోణం లోంచి చూడటం నాకు చాతకానట్టు చెప్పాలి.

గదిలోకి వెళ్ళాను. బట్టలు మార్చుకొని మళ్ళా బయట కొచ్చాను. ఈమాటు రెడ్డి చూపు మేడంత యెత్తు పెరిగిన బాదంచెట్టుపైన నిలిచివుంది. ఆ ఆకుల మాటున దేన్నో వెతుకుతూ ఆలోచిస్తున్నాడు. నవ్వుకున్నాను మళ్ళా.

అతనేమి ఆలోచిస్తుంట ? గ్రాడ్యుయేటు కాలేకపోయే నేమిటానా ? తనకొచ్చే తొంభై రూపాయలు చాలడం లేదేమానా ? రెండొందల జీతగాళ్ళ జీవిత మెట్లుండునా? — దేన్ని గురించి ఆలోచిస్తున్నాడు ?

బాగుంది వరస. రెడ్డిని చూస్తుంటే నాకూ ఆలోచనలు వచ్చేట్టున్నాయి. నేనూ ఓ కుర్చీ తెచ్చుకుని నా గది ముందు వేసుకుని ఆకాశంలోకి— ఈ ఆలోచన రాగానే ఫకాలున నవ్వేశాను.

రెడ్డి ఉలిక్కిపడి నావైపు చూశాడు. ఆ చూపులో తత్తరపాటు ఉన్నది. అతనలా చూస్తున్నప్పుడు సిగ్గుపడిపోయాను. ఎందుకలా నవ్వేనా అని బాధపడ్డాను.

క్షణాల తర్వాత అతనే పలుకరించేడు.

"మీ దేఊరండీ ?"

గతుక్కుమన్నాను. రెడ్డి చాతుర్యం అర్థమైంది. విశాఖపట్టణం నుంచి వచ్చేరా. అని అడగడం పాత పద్ధతి. అదేగా అతని అభిప్రాయం ? కోపం వచ్చింది కానీ అణచుకుని మా ఊరు పేరు చెప్పాను.

"అదృష్టవంతులు" అన్నాడు రెడ్డి.

"ఎందుకనిట ?"

"చాలా దగ్గర్లో ఉన్నారు."

తలూపాను.

"మీఊరు చెప్పారు కారు." అడిగేను.

అతను చెప్పేడు. కానీ, ఆపేరు నే నెన్నడూ వినలేదు. జాగ్రఫీ చదివినా అంత తొరగా తెలిసే పేరు కాదది. చిత్తూరు జిల్లాలో మారుమూల కుగ్రామం.

ఆరోజుకి అతన్తో మాటాడింది అదేను.

నాకీవిధంగా పరిచయమైన రెడ్డి చాలా కొద్ది రోజుల్లో ఆప్తమిత్రుడైపోయాడు. అతను చాలా అమాయకుడు. అతని ఆలోచనలు చిత్రంగా ఉంటాయి. వినేవాడు రెడ్డిమీద జాలి చూపించగలడు. రెడ్డి కలలుకనే మనిషి. ఆకలల్ని తను భద్రపరచుకోడు. గుండెల్లో దాచుకోడు. ఎదటివాడికి విపులీకరించి చెబితేనేగాని తృప్తి కలగ దతనికి.

రెడ్డిని గమనించి గాని, నా మొహమాటంవల్ల గానీ, నే నతని కలలు వింటూ జాలిచెందేవాడిని. అదే మా రాముడు గానీ, ఆనందరావుగానీ వింటే రెడ్డిని గేలిచేసి ఉండేవా రన్నది నిజం.

ఒక్కోనాడు అనేవాడు రెడ్డి—

"ప్రేమించడం నాకు చాతనవుతుం దంటారా ? అసలు ఆ లక్షణాలు నాలో ఉన్నాయంటారా ?" అని. నవ్వేవాడిని. 'తమ్ముడూ ! ఇదే మరోడిని అడుగుతే వాడు నిన్ను మోసేయగలడు జాగ్రత్త' అని చెప్పేందుకు నా నోరు ఆడేదికాదు.

ఒక్కోనాడు అనవసరంగా బోరు కొట్టేసేవాడు. సొంతఊరుని ప్రేమించని మానవుడు యీ ప్రపంచంలో ఎవడున్నాడు ? కాబట్టి, తరచూ మాఊరు వెళ్లి వస్తుండే వాడిని. అమ్మా నాన్నా—ప్రాణంపెట్టే మిత్రులూ, జ్ఞాపకం లోంచి చెరిగిపోని మా కాలేజీ—నాయరు బడ్డీకొట్టు, సినిమా థియేటర్లూ, బజారు—ఇవన్నీ నాకు చాలా యిష్టమైనవని చెబుతే ఎవడూ ఆశ్చర్యపో నక్కర్లేదు. కానీ—ఆదేమి ఖర్మమో మాఊరి గురించి ఎన్నిమాట్లు చెప్పినా, రెడ్డి మళ్లా కొత్త ఊరు గురించి అడిగినట్టు అడుగుతూండేవాడు. ఒకమాటు, రెండుమాట్లు, పదిమాట్లయినా అతని పద్ధతిలో మార్పు రాలేదు. నేను మాఊరు వెళ్లి వచ్చిన ప్రతీ తడవా 'సముద్రం బాగుంటుందా ? సరుగుడు చెట్లు ఎలా ఉంటాయి? మీకాఊళ్లో బ్రహ్మాండంగా తోస్తుంది కదూ ? ఇలాంటి డిటో ప్రశ్నలు వేస్తూండేవాడు. కొత్తలో అవుతే చెప్ప డానికి నాకూ సరదాగానే ఉండేది గానీ రాను రాను చిర్రెత్తు కొచ్చేది. ఏవిటీ చచ్చు పరామర్శలు ? సముద్రం బాగోక ఎలా ఉంటుంది ? అక్కడ సరుగుడు చెట్లు రోజు రోజుకీ మారు తూంటాయా ? అక్కడికీ రెడ్డిని మాఊరికి ఆహ్వానించేను. కానీ రాలేనన్నాడు. ఆకాడికి యీ విషయసేకర ణెందుకు ?

ఇదీ నా ప్రశ్న. ఒకనాడు తెగించి అడిగేశాను.

"మా ఊర్ని గురించి చెప్పడానికి నాకేం అభ్యంతరంలేదు గానీ, రోజూ అడిగిందే అడగడం చెప్పిందే చెప్పడం నాకేం నచ్చదు. పోనీ మా ఊరు రమ్మంటే రారు. ఏమిటి మీ ఉద్దేశం ?" అని.

అతను ఠంగున జవాబు చెప్పలేదు గానీ కాసేపు మౌనంగా వుండి ఆ తర్వాత కళ్ల నీళ్లు పెట్టుకున్నాడు. అదిరి పడ్డాను. క్షమించమని అడిగి మా రూములోకి వచ్చేశాను.

రెడ్డితో నా స్నేహం రాముడికి నచ్చలేదు. సమయం వచ్చినప్పుడల్లా నాకీ విషయమే హెచ్చరిస్తూ ఉండేవాడు. వాడి సలహాని కొట్టిపారేయడం అలవాటైంది నాకు.

మళ్లా రెండు రోజుల వరకు రెడ్డి నాకు కనుపించ లేదు. కొంచెం బాధగానే ఉన్నది నాకు. ఒకనాడు గాంధి నగరం సెంటర్లో దాదాపు సాయంత్రం ఆరున్నర సమయాన రెడ్డి పాత పుస్తకాల షాపుకు దగ్గర నించున్నాడు. అతని దగ్గరికి వెళ్లేను. పలుకరించేను. కనుపించడం లేదేమని అడి గేను. అతని జవాబు విని ఆశ్చర్యపోయాను. అతనన్న దిది—

"నిజం మాష్టారూ ! నేను మిమ్మల్ని విసిగిస్తున్నాను. చాలా అనవసరమైన విషయా లడిగి మిమ్మల్ని కష్టపెట్టేను. ఇంకా నా పద్ధతి మార్చుకోవాలి. అందుకే బాగా రాత్రి పడేంతవరకూ ఆఫీసులోనే గడిపేస్తున్నాను. కానీ .... అక్కడ గూడా నన్ను అపార్థం చేసుకుంటున్నారు మాస్టారూ ! ఆఫీసులో కూర్చునేది ఆఫీసరు మెప్పు సంపాయించాలని కాదు."

అతని భుజం తట్టి అన్నాను.

"మీరు చాలా మంచివారు రెడ్డీ ! రండి. అలా పార్కులో కూర్చుందాం."

అప్పు డతని మొహంలో నిండిన ఆనందం నాకు బాగా జ్ఞాపకం. పార్కులోకొచ్చి కూర్చున్న తరువాత చెప్పాడు—

"మా ఊరు మీ ఊరంత అందంగా లేకపోయినా నాకూ మాఊరంటే యిష్టమే. కానీ, అది చాలా దూరం. బోల్డు ఛార్జీ లవుతాయి. పైగా మా యిల్లు నరకం. తెలి సినవా ళ్లెవరూ నన్ను పలుకరించరు. అలాంటప్పుడు నేనెలా మాఊరు వెళ్లేది ? వెళ్లినా నాకేం తోస్తుంది ? చెప్పండి మాస్టారు ?"

నేనేమీ జవాబివ్వకపోయినా అతని పరిస్థితి ఊహించ గలను. మళ్లా అతనే అన్నాడు.

"మిమ్మల్ని చూస్తుంటే నాకు ఈర్ష్య. ఎంచక్కా సరదాగా మీ ఊరెళ్లి హాయిగా అక్కడ గడిపి తిరిగొస్తారు. మీరు మీఊరు గురించీ, మీ వాళ్లని గురించీ చెబుతూంటే నాకు ఆనందంగా ఉంటుంది."

పిచ్చిరెడ్డి ! ఎంత పసివాడివయ్యా నువ్వు !

"నేను చాలా దురదృష్టవంతుణ్ని మాస్టారూ ! నాన్న లేడు. అమ్మ ఉంది. మా అమ్మ యిప్పటికీ ఒళ్లు వంచి చాకిరీ చేస్తుంది. ఆ అమ్మకి సుఖంలేదు. పెళ్లికాని చెల్లెలా చదువుకోవాలనే కోరికున్న తమ్ముడూ, చెడిపోయిన అన్నయ్యా, అందరూ అన్నీ సమస్యలే." అన్నయ్య తాగుతాడు. జూదగాడు. వదిన్ని కొడతాడు. అమ్మని డబ్బివ్వమని బాధపెడతాడు. చెప్పండి మాస్టారు ! నే నెలా ఆ యింట్లో ఉండను ?—అది యింటి విషయం. పోతే నా స్నేహితులు. వాళ్లందరూ ప్రయో జకులు. పెళ్లిళ్లు చేసుకున్నారు. చదువుకునే రోజుల్లోనే నన్ను వెధవ ననేవారు. ఇప్పుడు వాళ్లకి నే నెక్కడ కనిపిస్తాను?"

చాలు. రెడ్డి యింకేమీ చెప్పకపోయినా అత నసుభవించే నరకం నే నూహించగలను. అందుకే అతను కలలు కంటున్నాడు. అందుకనే అతను చిత్రమైన మనిషిలా, పిచ్చి మా లోకానికి 'నమూనా' గా కనిపించేడు.

ఆ రాత్రే రెడ్డి ద్వారా మరో విడ్డూరం విన్నాను. అతని రూములోంచి ఒక నెక్లెసు తీసుకొచ్చి చూపించేడు. ఎలా ఉందని అడిగేడు. నిజాని కది చాలా బావుంది.

''దీన్ని మా చెల్లి గురించి కొన్నాను. అతి కష్టం మీద సంపాదించిన యీ ఒక్క వస్తువూ చెల్లి మెళ్లో వేయడానికి నోచుకోలేక పోతున్నాను. ఈ నగ అన్నయ్య కంట బడితే ... వద్దు మాస్టారు. మా యింట్లో వాళ్ళెవరూ సుఖ పడటానికి నోచుకోలేదు. అంతే. అన్నీ అలా జరగాల్సిందే. తప్పదు. నే నిక్కడ రెండు పూటలా భోంచేస్తున్నాను. మీలాటి మంచి స్నేహితుడితో ఖబుర్లు చెబుతూ కాలం గడుపుతున్నాను. నేను .... చాలా విషయాలు మరిచిపోవాలి. స్వార్థమైతే కావచ్చు గానీ మావాళ్ల గురించి నే నసలు బాధ పడకూడదు.''

పడుక్కునే ముందు రెడ్డి మాటలు గుర్తుకొచ్చేయి. ఎదటివారి గురించి తన బ్రతుకుని పాడుచేసుకోడానికి ఎవ్వడూ ఒప్పుకోడు. తనలాంటివాళ్లు ఓపక్కన ఝూమ్మంటూ కాలాన్ని నెట్టేస్తుంటే జీవితమనే యీ పరుగు పందెంలో అవకాశముండి కూడా ఓడిపోడానికి రెడ్డే కాదు—ఎవ్వడూ ఒప్పుకోడు.

* * *

ఒంట్లో బాగుండక వారం రోజుల సెలవుమీద మా ఊరు వెళ్లాను. తిరిగొచ్చిన మొదటిరోజు, ఆఫీసు నుంచి రావడంతోనే రెడ్డికోసం చూశాను. గది తలుపులు తీసి ఉన్నాయి గానీ గదిలో రెడ్డి లేడు. గదిముందు ఉండవలసిన కుర్చీ కూడా లేదు. వారం రోజుల్లోనే రెడ్డి అలవాట్లు మారిపోతాయని నాకేం తెలుసు ?

డాబామీద పిట్టగోడ వారగా కుర్చీలో కూర్చున్న రెడ్డి పిలుపు విని తలెత్తి చూశాను. రెడ్డి మొహం కళకళ లాడుతోంది. అతను టెరిలిన్ షర్టులో హుందాగా ఉన్నాడు. అతని వ్రేళ్ల మధ్య సిగరెట్టు వెలుగుతోంది.

అతని దగ్గరకు వెళ్లేను.

అతను లేచి నిలబడ్డాడు. పిట్టగోడ వారగా నించున్నాడు. ఆ నించోడం ఠీవిగా ఉంది. సిగరెట్టు అందంగా కాల్చుతున్నాడు. మును పెప్పుడో పోగొట్టుకున్న అలంకరణ తాలూకు విశేషాలన్నీ అతన్నిప్పుడు ఆవరించినట్టున్నాయి.

''హౌ అర్‌యూ సార్ !'' అన్నాడు రెడ్డి.

ఆ రకమైన పరామర్శకి కొంచెం బెదిరాను. స్వస్థత చిక్కినట్టు చెప్పేను.

''నిలబడే ఉన్నారు. కూర్చోండి. హేవ్ యువర్ సీట్.''

''పర్వాలేదు. మీరే కూర్చోండి.''

''ఇందాకట్నుంచీ కూర్చునే ఉన్నాను. ఐ లైక్ టు స్టాండ్ ఓన్లీ ! మీరు కూర్చోవాలి.''

రెడ్డికంటే తాగినవాడు నయమనిపించింది. కూర్చోక తప్పిందికాదు. ఈలోగా అతను సిగరెట్టు దమ్ము ఒకటి పీల్చాడు. పొగని ఆకాశంవైపు వదిలి, పెదాలను అందంగా నాలికతో తుడుచుకుంటూ—

''మీతో చాలా విషయాలు మాటాడాలి ! రేదర్ చెప్పుకోవాలి.''

సరిగ్గా నే నూహించిన విధంగానే ఈ మార్పు కేదో కథ ఉన్నదన్నమాట !

అతను చెప్పాడు.

''పది రోజుల క్రితం ఒక అమ్మాయిని చూసేను.'' మాట నాపి నా దగ్గరిగా వచ్చి ''చాలా అందమైన పిల్ల. వెరీ బ్యూటీఫుల్. ఒంటరిగా ఇంకా గడపలేను. నాకు పార్ట్నర్ కావాలి. మా యిద్దరికీ మరెవ్వరితోనూ ప్రమేయం ఉండరాదు. ఎన్నాళ్లనుంచో నాలో మెదులుతున్న యీ కోరికకి పది రోజుల క్రితం ఓ రూపం ఏర్పడింది. రెండు రోజుల క్రితం ఓ నిశ్చయానికి వచ్చాను. ఐ వాంట్ టు మేరీ దట్ గర్ల్.''

ఇన్నాళ్లూ మా రాముడినీ, ఆనందరావునీ చాతకాక ద్వేషించానేమో' రెడ్డిలాటి మనుష్యులేం చేయాలి ? రెడ్డి కేవలం కలలు కనే మనిషే అనుకున్నాను. కార్యసాధనకి నడుం కట్టేంత ధీమా అతనికి లేదనీ అనుకున్నాను.

''లేవండి'' అన్నాడు పొలికేకతో రెడ్డి. లేచేను.

నా మొహంలో చూపు నిలిపి చాలా సీరియస్‌గా చెబుతున్నట్టు—

''మనముందు మేడలో రెండో కిటికీ ఉంది. అంటే నావీపు తిన్నగానన్నమాట. చూశారా. ఆ కిటికీ వూసల్లోంచి చూస్తే మీకో చక్కటి అమ్మాయి కనిపించింది కదూ. ఆ పిల్లే ! ఆమెనే నేను పెళ్లాడబోయేది. సరిగా చూసి మీ సలహా చెప్పండి'' అన్నాడు రెడ్డి.

సభ్యత కాదని తెలిసినా చూడటం జరిగింది. అవ్వే ఆకారం కనిపించగానే తల దించుకున్నాను. అలాటి పరిస్థితిని

రెడ్డి నాకు కలుగజేసినందుకు కొంచెం కోపమూ వచ్చింది. అందికే అన్నాను.

"మిస్టర్ రెడ్డి! ఇవన్నీ మీ సొంత విషయాలు. పైగా నాకీ ప్రేమ విషయాల్లో బొత్తిగా అనుభవంలేదు. నాలాటి వాడి సలహా అడగడం గనీ, నాతో మీ ప్రేమ కథలు చెప్పడం గానీ యిష్టంలేదు నాకు. ప్రేమ మినహా మరేదైనా మాటాడా లనుంటే నన్ను పలుకరించండి. లేదూ—గుడ్‌బై" నాలుగు మాటలూ వడ్డించి డాబా దిగి వచ్చేశాను. అయినా రెడ్డి దిగలేదు.

రెడ్డి వ్యవహారం యిలా తయారయ్యింది. పోతే మా రాముడ్ని గురించి—ఎప్పుడూ నవ్వుతూ పేలుతూ ఉండే నిక్షేపంలాంటి కుర్రాడు బెంగతో చస్తున్నట్టు, సినిమాలూ సరదాలూ మాని రూములో కూర్చుని గోళ్ళు గిల్లుకుంటు న్నాడు. అదేమనడుగుతే సమాధానం రాదు. నన్నేకాదు, అతని జాతిమనిషి ఆనందరావుని గూడా చాలామాట్లు నిరుత్సా హరిచాడు. ఆఫీసూ, గది, ఈ రెంటినీ అంటిపెట్టుకుంటు న్నాడు రాముడు.

ఒకనాడు రూము కొచ్చేసరికి రాముడికీ రెడ్డికీ మధ్య తగాదా తారస్థాయిలో ఉంది. ఇద్దరూ ఒకర్నొకరు ఇంగ్లీషు లోనూ, మధ్య మధ్య తెలుగులోనూ తిట్టుకుంటున్నారు. రాముడు నన్ను చూచి గబగబా మా గదిలోకి వచ్చాడు.

"ఈ గదిని మనం వెంటనే ఖాళీ చెయ్యాలి" అన్నాడు.

బిత్తరపోయాను.

"నీకే చెప్తూంట—ఈ గదిని ఖాళీ చేయాలి. అదీ యిప్పుడే ఈ క్షణమే. మళ్ళా మనం పాత గదిలోకి పోదాం. అన్నీ మాటాడే వచ్చాను. తొరగా తెములు."

నాకు చిర్రెత్తుకొచ్చింది. ఏమిటి వీడి వరస?

"నీకేం మతి పోలేదుగదా రాముడూ? మళ్ళా ఏ మొహం పెట్టుకు పాత గదికి పోతాం? పైగా ఆ యింటా విడ రాక్షసి గూడాను."

"అయినా సరే. నామాట విని వచ్చేయ్."

"నేను రాను. నీ యిష్టం మొచ్చినట్టు తలూపడానికి నేను గంగిరెద్దును గాను."

"అంతేనా?"

"అంతే."

ఆ రాత్రి వాడు నాతో మాటాడలేదు. భోజనానికి వెడుతున్నప్పుడు కూడా పిలువలేదు. ఆరోజు మొదలుకొని నాలుగు రోజులు అదే వరసగా మౌనవ్రతం పాటించేడు రాముడు. రాముడికీ రెడ్డికీ తగాదా ఎందుకు వచ్చిందో? ఏ కారణంవల్ల రాముడు గది మారిపోదామని అంటున్నాడో, అటు రెడ్డినీ గానీ ఇటు రాముడ్నీగాని అడగలేకపోయాను.

ఒకరోజు థియేటర్లో ఆనందరావు ఒక్కడే అగుపిం చాడు. ఇంటర్వెల్లో టీ తాగుతూండగా అతనే పలుకరించేడు. మాటల మధ్యలో రాముడు రెడ్డిల విషయం కదిలింది. అతను బిగ్గరగా నవ్వి మెల్లిగా అన్నాడు.

"వాళ్ళిమధ్య లవ్ ఎఫైర్లో పడ్డారు మాస్టారు! రెడ్డికి ప్రేమించడం తెలీదనీ, అందు కతను తగడనీ మీవాడి అభిప్రాయం. నువ్వేం బోడి సంహా లివ్వక్కర్లేదని రెడ్డి. బలే ఫార్సులెండి."

రెడ్డి వ్యవహారంలో రాము డెందుకు తలదూర్చా లసలు? ఆ రాత్రి పడుక్కునే ముందు అదే అడిగాను రాముడ్ని. అతను వినిపించుకోనట్టు తలని అటువైపు తిప్పు కున్నాడు. కొంచెం బాధపడ్డాను.

"మనం పసిపిల్లలం కాదు రాముడూ! ఇలా ఎన్నా ళ్ళని నాతో పంతం కడతావ్? నే చేసిన తప్పేమి టసలు?"

"ఎవరైనా సరే నా మాట వినకపోతే నాకు కోపం."

"అవతలివాళ్ళూ నీలాటివాళ్ళేనని ఎందు కనుకోవు?"

"అనుకోను."

నవ్వొచ్చింది. నవ్వేశాను.

రాముడు లేచి కూర్చున్నాడు. నావైపు తీక్షణంగా చూస్తూ—

"నీకేం తెలీ దసలు. రెడ్డి ఎంత అల్లరి చేస్తున్నాడో నువ్వేం పట్టించుకోడంలేదు. వాడి వెకిలిచేష్టలు చూస్తుంటే నాకు తల తిరిగిపోతుంది. అందికే నాకీ రూములో ఉండ బుద్ధిపుట్టడంలేదు." అన్నాడు.

రాముడ్ని మొదట్లో అర్థం చేసుకోలేకపోయినందుకు చింతించేను. మళ్ళా ఏమీ మాటాడలేదు.

ఆ ఉదయం రాముడు వాళ్ళ బేంక్ నుంచి ఫోన్ చేశాడు. వాడికి బదిలీ అయిందిట, ఒంగోలు వేశారుట. రాత్రి బండికి వెడుతున్నాట్ట.

పిడుగుపడిన ట్టయింది నాకు. ఏడుపు వచ్చింది.

ఒక గంట పర్మిషన్ తీసుకుని పెందరాళ్లే రూము కొచ్చేను, పుట్టెడు దిగులు కడుపులో పెట్టుకుని. రూము దగ్గర అంతమంది జనాన్ని చూసేసరికి భయం కలిగింది. విషయం తెలిసి విస్తుపోయాను. రెడ్డి రాసిన ప్రేమలేఖని పట్టుకుని నడివీధిలో అతని పరువు తీసేస్తున్నారు జనం.

అతను తలొంచుకు నిలబడి ఉన్నాడు. నన్ను చూచీ చూడనట్టు నటించేడు. ఎవరో ముసలాయన రెడ్డినీ, అతని వ్యక్తిత్వాన్నీ కడిగిపారేస్తున్నాడు పదుగురిలోనూ.

గదిలోకి వచ్చి తలుపులు వేసుకున్నాను. ఒక గంట తర్వాత వాతావరణం చల్లబడ్డది కాబోలు. వీధిలో మాటలు తగ్గేయి. కిటికీలోంచి కిందికి చూశాను. రెడ్డి ఒక్కడూ నడుచుకుంటో వెళ్లిపోతున్నాడు. ఎందుకో అతనిమీద జాలి కలిగింది.

పనిమనిషి తలుపు తడితే తలుపు తీశాను. ఆమె చాలా చెప్పింది. రెడ్డి ప్రేమించిన పిల్ల మొన్నీమధ్యనే వాళ్ల చిన్నాన్న గారింటికి వచ్చిందిట. పెళ్లయిన రెండో నెలలో ఆమెకి వైధవ్యం ప్రాప్తించిందిట. ఆ పెళ్లి గూడా ప్రేమించి చేసుకున్నదిట. మనసు కుదుటబరచుకునేందుకు సొంతఊరు వదిలి చిన్నాన్నగారింటికి వచ్చిందిట.

రెడ్డి మొదటి ప్రేమ యిలా తగులడినందుకు, నలుగుర్లోనూ అతను నగుబాటుపాలైనందుకు ఓపక్క కోపమూ మరోపక్క జాలీ కలిగాయి.

రాత్రి ఏడు గంటలకు రాము డొచ్చాడు. - పెట్టే బేడా సర్దుకున్నాడు. వాడివెంట స్టేషనుకి వెళ్లేను. స్టేషను దగ్గర పడుతుందనగా అన్నాను.

"నీ కిలా అకస్మాత్తుగా ట్రాన్స్ఫ రవడం నాకు విచారంగా ఉంది రాముడూ!"

"ఈ బదిలీకి ఒక కారణం నువ్వే!" అన్నాడు.

ఉలిక్కిపడ్డాను.

"అవును. పాత రూములో చేరితే నాకు ఒంగోలు ప్రయాణం ఉండేది కాదు. పాత రూముకి రానన్నావ్. ఒంగోలుకి ట్రాన్స్ఫర్ కోరాను."

"కాదు. నువ్వేదో దాస్తున్నావ్. దీన్లో నాదేం తప్పు లేదు. రూము మారడంలేదనే చిన్న కారణాన్ని ఆధారం చేసుకుని ఊరొదిలి వెళ్లిపోయేంత పిచ్చివాడవు కాదు నువ్వు" అన్నాను.

"నువ్వో కారణ మన్నానే గాని కేవలం నువ్వే అవ లేదు. రెండో కారణం అదిగో ఆ పిల్ల. రెడ్డి ప్రియురాలు."

అర్థంకాలేదు నాకు.

"పెళ్లిచూపుల్లో ఆమెను చూసేను. నన్ను చేసుకోడాని కిష్టపడలే దామె. మొహం ముందే ఆమాట అన్నది. నన్ను అవమాన పరచింది."

"ఇప్పు డామె విధవట. తెలుసా ?"

"తెలుసు. అందుకే ఆమెను రోజూ చూడలేక చస్తూండేది. ఆమెను చూస్తే నాకు కోపం, జాలి, దయాను. రెడ్డి ఆమెను ప్రేమించాడు. అతను ఫూల్. అవతల వాడిని అర్థం చేసుకునేందుకు ప్రయత్నించ డసలు." అన్నాడు రాముడు ఉద్రేకంగా. వాడి కనుకొలకుల్లో నీళ్లా నిలిచాయి.

స్టేషన్ చేరుకున్నాం. రైలొచ్చింది. రాము డెక్కాడు. చివరిమాటగా అన్నాడు—

"బెజవాడలో మన చివ్రరోజులు చేదుగా గడిచేయి. మరిచిపో. వెనకటి మన తియ్యటి స్నేహాన్నే గుర్తుపెట్టుకో. నీలాటి మంచి స్నేహితుడ్ని వదిలి దూరంగా పోతున్నానంటే నాకు సరదా కాదు. నా మనసూ అలాటిది కాదు. నీ మాట వినివుంటే, ఆ పాత గదిలోనే ఉంటే, ఆమె నాకు కనిపించేదీ కాదు, రెడ్డి నాకు తెలిసేవాడూ కాదు, నేను ఒంగోలూ వెళ్లేవాడిని కాదు. పోనీలే .... అయ్యిందేదో అయ్యింది. నన్ను క్షమించు."

రైలు కదిలింది. చెయ్యూపుతూ నిలబడ్డాను.

స్టేషన్నుంచి వస్తూ దార్లో భోజనం ముగించి మరీ రూము కొచ్చాను. రెడ్డి గది తలుపులు బార్లా తెరిచి ఉన్నాయి. ఆనందరావు రెడ్డి నేదో అంటున్నాడు. గుమ్మం దగ్గరికి వెళ్లాను. ఆనందరావు నన్ను చూచి నిలబడ్డాడు. రెడ్డి హోల్డాలుమీద బోర్లా పడుక్కున్నాడు. ఆనందరావు అన్నాడు.

"రెడ్డి తాగొచ్చేడు. నా కేవిటో భయంగా ఉంది. నే నింకా భోజనం చేయలేదు. నాకేం తోచకుండా ఉంది. మీ రిక్కడ కూర్చోండి. భోంచేసి యిప్పుడే వస్తాను."

నా జవాబైనా వినకుండా ఆనందరావు వెళ్లిపోయాడు.

అయిదు నిముషాలపాటు గుమ్మం దగ్గరే నుంచున్నాను.

మతి ఉన్న మనిషి తాగుతే అలవా టంటారు. బెదిరిపోయిన మనిషి తాగుతే అతని పిరికితనానికి చక్కటి మందంటారు. ఏమైనా తాగేవాళ్లని ఫూల్సని చాలామంది అంటారు. రెడ్డి తాగాడు. మరోప్పుడైతే అసహ్యించుకునేవాడినే.

అతని దగ్గరిసా వెళ్లాను. అతన్ని తట్టాను. రెడ్డి నావైపు చూసేడు. మరు క్షణమే ఘొల్లున ఏడ్చేశాడు. నా రెండు చేతులూ పుచ్చుకున్నాడు.

"క్షమించండి మాస్టారూ! తాగేను. మీతో మాటాడటానికి అర్హత లేదు .... ప్రేమించడం చాతకాదు నాకు ..... గుండెల్ని కోసే అవమానం పొందేను .... చివరికి .... చెల్లెలు కోసం కొన్న నగని కూడా తెగనమ్మి .... నా స్వార్థానికీ, నా సరదాలకీ .......

అతని మాటల్ని అతని దుఃఖం మింగేసింది. పసిపిల్లవాడిలా, గుండె లవిసేలా డుస్తున్నాడు. ఆ ఏడుపుకి అంతం లేదు.

జీవితంలో మొదటిసారిగా—తాగుబోతుమీద జాలి కలిగింది.

* * *

ఉదయం పనిమనిషి చెప్పింది—రెడ్డి ప్రియురాలూ, వాళ్ల చిన్నాన్నగారూ ఆ యిల్లు ఖాళీచేశారుట.

ఆనందరావు చెప్పాడు—తనకో చీటీ రాసి ఆ అర్ధరాత్రే ఎక్కడికో వెళ్లిపోయాడుట రెడ్డి !

నా గుండెల్లో బరువు నిలిచింది. - అప్పటికప్పుడే పాత గది కుదుర్చుకునేందుకు 'రాక్షసమ్మ'గా రింటికి బయలుదేరేను.

# శ్రీమదాంధ్రభారత కృతిపతిత్వము

శ్రీ పాటిబండ మాధవశర్మ

1963 అక్టోబరు నెల భారతియందు శ్రీ వై. సీతా రామస్వామిగారు తమ లేఖయందు సూచించిన యంశము నన్నయ్యగారి భారతకర్తృత్వమును సంశయాస్పదము గావించు నంతటి బలముకలది కాదని భావించుచున్నాను.

వసంత తిలక :

వీరావతార ! సుకవిస్తుత ! నిత్య ధర్మ
ప్రారంభ ! శిష్టపరిపాలన సక్త ! రాజా
నారాయణాఖ్య ! కరుణారసపూర్ణ ! వీర
శ్రీరమ్య ! రాజ కులశేఖర ! విష్ణుమూర్తి !

ఆది. —240.

ఇందలి "రాజా నారాయణాఖ్య" యను భాగము 'రాజా' 'నారాయణాఖ్య' యను తీరున రెండు సంబోధనలుగా గ్రహింప దగినదని శ్రీవా రభిప్రాయపడిరి. "రాజా నారాయణాఖ్య!" యనునది ఒక్క సంబుద్ధియే. "రాజా నారాయణ' యను సంబుద్ధి నన్నయగారి యాశ్వాసాంత పద్యములందు మరి రెండుచోట్ల కూడ ఉండినట్లు శ్రీవారే చూపియున్నారు. వానియందలి 'జ' కారము హ్రస్వము. ఎర్రన్న 'రాజనారాయణ' యనక ఒక చోట "నృపనారాయణ" (అరణ్య. —1) యని ప్రయోగించెను. 'రాజా పరమేశ్వర', 'రాజనారాయణ' మున్నగు బిరుదములందు పరమేశ్వర, నారాయణ పదములు ప్రధానమైనవి. రాజ శబ్దమునకుఁ బర్యాయపదము లుపయోగింపవచ్చును గాని పరమేశ్వర, నారాయణ పదములకుఁ బర్యాయ పదముల నుపయోగింపరాదు. అనఁగా రాజనారాయణ యనుటకు రాజవిష్ణు, రాజవైకుంఠ మున్నగువానిని రాజ పరమేశ్వర యనుటకు రాజ పరమశంకర, రాజ పరమశివ యను వానిని పర్యాయములుగ స్వీకరించుట బిరుదముల విషయమున సంప్రదాయము కాదని తోఁచును.

రాజరాజును 'రాజా' యని సంబోధించుటయు, 'రాజ నారాయణ' బిరుదమును 'రాజా నారాయణ' యని దీర్ఘ జకారముతోఁ బ్రయోగించుట నన్నయ్యగారు చేసిన పనులు కావని చెప్పవలసి యున్నది.

పాదాంతస్థ లఘువునకుఁ బాక్షిక గురుత్వము తెలుగు ఛందస్సంప్రదాయ మంగీకరింపలేదు. కాని సంస్కృతమునందు దానిని పింగళముని మొదలుకొని ఛాందసికు లందరు నంగీకరించిరి. కాని క్రమముగ దాని ప్రయోగమును సంకుచిత తరము గావించిరి.

'గంతే' యని పింగళ ముని (1—10) నిత్యత్వభ్రాంతి గొల్పఁగా, 'అంత్యంచ లఘు క్వచిత్' (నా. శా. XIV—90) అని భరతముని వైకల్పికత్వమును స్ఫుటము గావించెను.

"యత్పాదాంతే లఘోరపి గురుభావ ఉక్తః తత్సర్వత్ర ద్వితీయ చతుర్థపాద విషయం. ప్రథమ తృతీయపాద విషయంతు వసంత తిలకాదే రేవ (సా. ద. VII) అని విశ్వనాథుడు క్వాచిత్కమును గూడ ద్వితీయ చతుర్థ పాదాంతములకే పరిమితము చేసెను.

అచ్చముగాఁ దెలుఁగు ఛందము లనఁదగిన సీసము, గీతము ఆటవెలది, ద్విపద, తరువోజ, మధ్యాక్కర మున్నగునవి స్ఫూర్య గణాంత పాదములు. అనఁగా నికరముగా లఘ్వంత పాదములు. వీని యంతమందలి లఘువునకు గురుత్వ మెన్నడును సంభవింపదు. ఉత్సాహము, కందము మున్నగు మాత్రాగణచ్ఛందములందు పాదాంతమున లఘువుంచి దానిని గురువుగా గణించుట కవకాశ మున్నది. కాని, తెలుగుకవు లెవ్వరు నట్టి పని చేసిన జాడ యగపడదు. అయినను పాదాంతములందే కాక వలసిన యెల్లచోటులందును హ్రస్వమును దీర్ఘీకరించుకొని తాలమును (అనఁగా మాత్రాసంఖ్యను) సరిపెట్టుకొను నాచా

రము తెలుఁగునఁ జిరకాలము నుండియు ప్రచరితమై యున్నది. అక్షరచ్ఛందములందు దాని యవసరము తెలుఁగు వారికిఁగలుగలేదు. దానికిఁ గారణము దేశీయములయిన యక్షర చ్ఛందములు (సీసాదులు) నియతముగ లఘ్వంతములై యుండుటయే యని భావింపఁదగి యున్నది.

ప్రసక్తమైన వసంత తిలకము యొక్క ద్వితీయ పాదాంతమునందలి 'జా' వర్ణము దీర్ఘము కాదనియు, హ్రస్వమే యనియు నాకుఁ దోచుచున్నది. నన్నయ్యగారికిఁ బూర్వము తెలుఁగున ఛందశ్శాస్త్రము లున్నట్లు కనఁబడదు. మల్లియరేచనయు నన్నయకు సమకాలికుఁడో, అర్వాచీనుఁడో యనఁదగినవాఁడే. సంస్కృత మర్యాద ననుసరించి నన్నయ గారు ఈ వసంత తిలకా ద్వితీయ పాదాంతమున హ్రస్వ జకారమును బ్రయోగించెనని నేను భావించుచున్నాను. అనంతర కవులందు గానరాని విలక్షణ ప్రయోగములు—ఛందో వ్యాకరణ సంబంధులు—పెక్కు నన్నయ్యగారి రచనయందు గలవు. అట్టి వానిలో నిది యొకటి యనుకొన్నచో భారత కర్తృత్వము సంశయగ్రస్తము కావలసినంతటి ప్రమాదము తటస్థింప దనుకొందును. నన్నయాదులు చేసిన పెక్కు విలక్షణ ప్రయోగములను అప్పకవిని బ్రమాణీకరించుకొని పరిష్కర్తలు దిద్ది వైచినారు. ఇది యట్టి వానిలోఁ జేరఁదగినదియే. నన్నయ్యగారు చేయని ఛందోభంగమునుండి యాయనను గాపాడదలచి పరిష్కర్తలు ఆయనను రాజరాజ బిరుద భంగ దోషమునకుఁ బాల్పరచి యుండిరి. అది యంతటితో నాగక ఆయన భారత కర్తృత్వమునే భగ్నముచేయు స్థితికి వచ్చినది. ఇది యంతయు మిక్కిలి శోచనీయమైన స్థితి.

వీరావతార ! సుకవిస్తుత ! నిత్య ధర్మ
ప్రారంభ ! శిష్ట జనపాలన సక్త ! రాజ
నారాయణాఖ్య ! కరుణారసపూర్ణ ! వీర
శ్రీ రమ్య ! రాజకులశేఖర ! విష్ణుమూర్తి !

ఇది నన్నయ్యగారి పాఠ మనఁదగి యున్నది. ఆయన యనంతరము పుట్టిన ఛందస్సంప్రదాయములను బట్టుకొని ఆయన ఛందములను దిద్దబూనుట సాహస మనుకొందును. నన్నయ్యగారి ప్రయోగములను సమగ్రముగాఁ బరిశీలింపని యప్పకవిని, చిన్నయసూరిని బ్రమాణీకరించి యాంధ్రమహాకవికి ద్రోహము తలపెట్టవద్దని యాంధ్ర మహాజనులకు విన్నవించుకొనుచున్నాఁడను.



# "రాజావళి" చరిత్ర మరికొన్ని విశేషములు

శ్రీ శ్రీనివాసపురం నరసింహాచార్యులు

**1964** వ సం. జనవరి నెల "భారతి" పత్రికాముఖమున "రాజావళి చరిత్ర ఈనాటిది కాదు" అను శీర్షిక క్రింద ఆ గ్రంథమును గురించి అప్పటికి నాకు దెలిసియుండిన విషయములు కొన్నింటిని వ్రాసి, వాని యాధారమున కాల నిర్ణయమునకు గడంగి యా గ్రంథ మిప్పటికి డెబ్బదియైదు సంవత్సరములకు పూర్వమే ప్రచారములో నుండియుండె ననెడి భావమును పాఠకలోకమునకు వ్యక్తపఱచి యుంటిని.

తర్వాత ఏ తద్గ్రంథమును గూర్చిన విశేషాంశము లేవేనియు దెలిసికొను తలంపున కొంత పరిశోధనము సేయగా కృషి ఫలితముగ బ్రహ్మశ్రీ పరాంకుశం కృష్ణమాచార్య పండితులవారి పుస్తక భాండాగారమునందలి యొకానొక సంకలన గ్రంథమునందు, విక్రమ శకము 1939 సం. మార్గశిర శుక్లపక్షమున ఉదయపుర సంస్థానమునకు రాజధానియైన చిత్తూరు (చితోడ్) నగరము నుండి వెలువడిన 19, 20 సంఖ్యలు గల 'హరిశ్చంద్ర చంద్రిక' 'మోహన చంద్రిక' అను పాక్షిక పత్రికలలోని విషయములని ఏ అజ్ఞాత జిజ్ఞాసువో చాలాకాలము క్రిందట వ్రాసి యుంచుకొనిన సంగతులు కొన్ని ఈ 'రాజావళి' కి సంబంధించినవి కన్పట్టినవి. ఏ తత్పత్రికా సంపాదకు లవి తాము తమ మిత్రుల ద్వారా లభ్యమైనట్టియు, వి. శ. 1787 (క్రీ. శ. 1677) సం. న వ్రాయబడినట్టిదియు నగు నొక ప్రాచీన గ్రంథమునుండి యుద్ధరించి ప్రకటించినట్లును తెలిపియుండిరనియు నందే యున్నది.

ఆ సంకలన గ్రంథమునందీ విషయములు 'ఆర్యావర్త దేశీయ రాజ వంశావళి' అను శీర్షిక క్రింద వ్రాయబడి యున్నవి.

1963 సం. అక్టోబరు 'భారతి' పత్రికలో రాజావళి లోనివని ప్రకటింపబడిన యుదాహరణ, పట్టికలోని రాజుల పేళ్లకును ఈ సంకలన గ్రంథమునందున్న వానికిని, అయ్యది కాంగ్రిభాషలో నుండుటచేతనేమో కొంత వ్యత్యయముగ నుండి, స్పష్టముగ స్ఫురింపకుండుటయే గాక, కొన్ని యెడల వారి పరిపాలనా వ్యవధియందు గూడ ఇంచుక భేద ముండి యున్నను మొత్తముమీద నీ రెండింటిలోని విషయములకును చాలవరకు సామ్యములు కన్పట్టుచున్నవి. కావున పరిశీలనా దృష్టితో దిలకించినచో 'రాజావళి' గ్రంథ మీ కారణములవలన నేను జనవరి 64 'భారతి' లో తెలియజేసినట్లు ఇప్పటికి 76 సం. లకు పూర్వముగాక నేటికి 286 సం. లకు పూర్వమే ప్రసిద్ధిలో నున్నట్లు క్రీ. శ. 1883 నాటివగు 'హరిశ్చంద్ర చంద్రిక'—మోహన చంద్రిక' లలోని వ్రాతల మూలమున దెలియవచ్చుచున్నది గదా ?

ఈ పై కారణముల నన్నింటిని తర్కించినచో 'రాజావళి' యనెడి యీ గ్రంథముయొక్క నామము 'ఆర్యావర్త దేశీయ రాజ వంశావళి' యను దాని హ్రస్వ రూపమా ? యను సందియము వొడమచున్నది. దీనియందు 1963 అక్టోబరు భారతి సంచికలో నా పేర్ వార్తగా ప్రకటింపబడినట్లు 10 వంశములలోని రాజులు 171 మంది 4834 సం. 3 మా. 11 రోజులు గాక, 14 వంశములలోని 177 గురు రాజులు 5699 సం. 2 మా. 21 రోజులు పరిపాలనము సాగించినట్లు విభిన్నముగ వ్రాయబడి యున్నది. అంతేగాక యీ సంకలన గ్రంథమునందు ఈ విషయములు తేటతెనుగున సం. మా. రో. వారీగా 14 వ దగు ముసల్మానుల విషయము దక్క తక్కిన 13 వంశముల గూర్చి వేర్వేర పేర్కొనబడి యుండుటచే ముఖ్యముగ మన తెలుగువారికిని వలయు చారిత్రక విషయ జిజ్ఞాసువులైన యావద్భారత వాసులకును ఈ విషయమున సంశయాపనయమున కొకవేళ యుపకరింపగలదను ఆశతో అందలి రాజవంశముల నామమ్ము

లను ఆయా వ్యక్తుల పరిపాలనా వ్యవధిని గురించిన వివరములలో మొదటిదగు పాండవ వంశ ప్రభువుల పరంపరను మాత్రము పూర్తిగా వ్రాసి తక్కిన వంశావళి యొక్క వివరములు విస్తరభీతిచే సంగ్రహముగ నుదాహరించుచుంటిని.

శ్రీమద్యుధిష్ఠిర చక్రవర్తి మొదలు శ్రీ యశపాల మహారాజు తుదిగా గల 124 మంది రాజులు (మహమ్మదీయ వంశ పాలకులు గాక) 4945 సం. 1 నెల 9 రోజుల పర్యంతము ఇంద్రప్రస్థము రాజధానిగా పరిపాలనము గావించిన వివరములని వ్రాయబడిన వానిలో పాండవ వంశమును గురించి వ్రాయునెడ ధర్మరాజు మొదలుగా గల రాజుల యొక్క పరిపాలనా సమయము వేర్వేరని క్రింది విధముగా నే జూచిన ఆ సంకలన గ్రంథమునందు వ్రాయబడి యున్నది.

| భాగవతములోని రాజుల పేర్లు | క్రమ సంఖ్య | రాజావళిలోని రాజుల పేర్లు | పరిపాలనము చేసిన కాలము. సం. | మా. | రో. |
|---|---|---|---|---|---|
| యుధిష్ఠిరుడు | 1 | యుధిష్ఠిరుడు | 63 | 8 | 25 |
| పరీక్షిత్తు | 2 | పరీక్షిత్తు | 60 | 0 | 0 |
| జనమేజయుడు | 3 | జనమేజయుడు | 84 | 7 | 23 |
| శతానీకుడు (1) | 4 | అశ్వమేధుడు | 82 | 8 | 22 |
| సహస్రానీకుడు | 5 | రామరాజు (2) | 88 | 2 | 8 |
| అశ్వమేధజుడు | 6 | చత్రమలుడు | 81 | 11 | 27 |
| అసీమకృష్ణుడు | 7 | చిత్రరథుడు | 75 | 3 | 18 |
| నిచకుడు | 8 | దుష్టశైల్యుడు | 75 | 10 | 24 |
| ఉష్ణుడు | 9 | ఉగ్రసేనుడు | 78 | 7 | 21 |
| చిత్రరథుడు | 10 | శూరసేనుడు | 78 | 7 | 21 |
| శుచిరథుడు | 11 | భువనపతి | 69 | 5 | 5 |
| వృష్ణిమంతుడు | 12 | రణజీతుడు | 65 | 10 | 4 |
| సుషేణుడు | 13 | ఋక్షకుడు | 64 | 7 | 4 |
| సుపీతుడు | 14 | సుఖదేవుడు | 62 | 0 | 24 |
| నృచక్షువు | 15 | నరహరిదేవుడు | 51 | 10 | 2 |
| సుఖానిలుడు | 16 | సూచీరథుడు | 42 | 11 | 2 |
| పరిప్లవుడు | 17 | శూరసేనుడు (2) | 58 | 10 | 8 |
| మేధావి | 18 | పర్వతసేనుడు | 55 | 8 | 10 |
| సునయుడు | 19 | మేధావి | 52 | 10 | 10 |
| నృపంజయుడు | 20 | సోనాచీరుడు | 50 | 8 | 21 |
| దూర్వుడు | 21 | భీమదేవుడు | 47 | 9 | 20 |
| నిమి | 22 | నృహరిదేవుడు | 45 | 11 | 23 |
| బృహద్రథుడు | 23 | పూర్ణమలుడు | 44 | 8 | 7 |
| సుదాసుడు | 24 | కరదలి | 44 | 10 | 8 |
| శతానీకుడు (2) | 25 | అలమ్మిక | 50 | 11 | 8 |
| దుర్దమనుడు | 26 | ఉదయపాలుడు | 38 | 9 | 0 |
| విహీనరుడు | 27 | దువనమలుడు | 40 | 10 | 26 |
| దండపాణి | 28 | దమాత | 32 | 0 | 0 |
| మితుడు | 29 | భీమపాలుడు | 58 | 5 | 8 |
| క్షేమకుడు | 30 | క్షేమకుడు | 48 | 11 | 21 |
| బ్రహ్మక్షత్రుడు | | | | | |
| | | | 1797 | 11 | 10 |

# "రాజావళి" చరిత్ర; మరికొన్ని విశేషములు

బ్రహ్మక్షత్రుడు పాండవ వంశములో తుదివాడు "ఇతడు నిర్వంశుడై దేవర్షి సత్కృతుండై కలియుగంబు నందు జనం గలవాడు" అని భాగవతమున నవమస్కంధము:— ఈ రెండు పట్టికలను పోల్చి చూడగా శ్రీమద్భాగవతము నందలి రాజుల పట్టికలోని సంఖ్యతో తప్ప నందలి పేర్ల యెడ యెడనెడ నేకీభవింపక భేదంబుగా గనుపట్టుచున్నది. నవంబరు 63 భారతి సంచికలో శ్రీ హస్నాబాద నాగలింగ శివ యోగిగారు జూపిన "అత్రి మొదలు బ్రహ్మక్షత్రుని వఱకు గల" పేర్లలో గూడ గొన్ని వ్యత్యయములు గానవచ్చెడిని. గావున విజ్ఞులు క్రమబద్ధమైన దానిని నిర్ణయించి పాఠకలోకమున కెఱింగింతురుగాక! ఇక ప్రస్తుతాంశమునకు వత్తము.

యుధిష్ఠిర మహారాజు మొదలు క్షేమకుని వఱకు గల పాండవ వంశములోని రాజులు 30 మంది 1797 సం. లు 11 మాసములు 10 రోజులు ఇంద్రప్రస్థపురము రాజధానిగా రాజ్యమేలిరి.

పాండవ వంశములో తుదివాడగు క్షేమకునకు మంత్రిగా నుండిన విశ్రవు డతని జంపి తాను రాజ్యాధిపతి యయ్యెను. ఇతనితో నీతని వంశస్థులు 14 మంది రాజులు 500 సం. లు 7 మాసములు 17 దినములు రాజ్యమేలిరి.

ఈ విశ్రవ వంశములోని కడపటి రాజైన వీరసాల సేనుని మంత్రియగు వీరమహు డతనిని జంపి రాజ్యపాలకు డయ్యెను. వీనితో నితని వంశమువారు 16 గురు రాజులు 445 సం. లు 5 మా. 3 రోజులు పరిపాలన మొనరించిరి.

నాల్గవది యగు ఈ వీరమహ వంశములో కడపటి రాజై మగధదేశమును పరిపాలించుచుండిన ఆదిత్యకేతువు అను వానిని ప్రయాగ నేలుచుండిన ధంధరుడు మారణ మొనరించి రాజ్య మాక్రమించెను. ఈతని సంతతిలోనివారు తొమ్మండుగుర్ రాజులు 374 సం. 11 మా. 26 రోజులు పాలించిరి.

ఈ దంధరుని వంశములో కడపటి రాజగు రాజపాలుని అతని సామంతుడగు మహాపాలు డంతమొందించి, 14 సం. లు రాజ్యమేలెను. వీని తరువాత నితని వంశస్థు లెవ్వరును రాజులు కాలేదు.

అవంతీ రాజ్యాధీశుడగు విక్రమాదిత్యు డీ మహాపాలుని రాజ్యము మీదికి దండు వెడలి, యతనిని జంపి 93 సంవత్సర ములు రాజ్యమేలెను.. ఈ విషయమున నింతకంటె వివర ములు లేవు.

శాలివాహనుని సామంతుడుగా నుండిన పైఠణపు సముద్రపాలుడు విక్రమాదిత్యుని జంపి, తాను రాజ్యమునకు వచ్చెను. ఇతనితో నీ సంతతివారు 16 మంది రాజులు 372 సం. 4 నెలలు 27 రోజులు రాజ్యమేలిరి.

సముద్రపాలుని వంశములో తుది రాజగు విక్రమ పాలుడు పశ్చిమ దేశాధిపతియగు మల్లూకచంద్రచోహారుని మీదికి దాడి వెడలి యుద్ధమున నిహతు డయ్యెను. ఆ కారణ మున నింద్రప్రస్థమునకు మల్లూఖచంద్రుడు పాలకు డయ్యెను. ఈతని సంతతివారు పదుగురు రాజులు 191 సం. 23 రోజులు రాజ్యపాలనము జేసిరి.

మల్లూఖచంద్రుని వంశములో కడపటిరాణి యయిన పద్మావతి సంతానములేక గతించగా, ఆమె మంత్రులందరు లసి యాలోచించి, హరిప్రేమయోగి యను వానిని సింహా సనముపై కూర్చుండబెట్టి తాము రాజ్యము నేలుచుండిరి. అతనితో నా సంతతివారు నలువురు రాజులు 50 సం. 21 దినములు ప్రభుత్వము సాగించిరి.

హరిప్రేముని వంశములో నంతిమరాజు మహా బాహుడు తపోనియతుడై యరణ్యములకు వెళ్లెను. ఈ వృత్తాంత మెఱింగిన వంగదేశపురాజు అధిసేనుడు ఇంద్ర ప్రస్థమునకు వచ్చి రాజ్యపీఠము నాక్రమించెను. ఇతనితో నీతని వంశమువారు పన్నిద్దరు రాజులు 151 సం. లు 11 నె. 11 రోజులు పరిపాలన మొనరించిరి.

ఈ అధిసేనుని వంశములో తుది వాడగు దామోదర సేనుడు తన సామంతులను పీడించుచుండిన కతమున వారిలో నొకడగు దీపసింహుడు సైన్యములను గూర్చుకొని యుద్ధ ములో నాతనిని జంపి రాజ్యపాలకు డయ్యెను. ఈతనితో నీ సంతతి వారు ఆరుగురు రాజులు 107 సం. లు 6 మా. 22 దిన ములు ఏలిరి.

ఈ దీపసింహుని వంశములో కడపటి రాజగు, జీవన సింహుడు తన సైన్యము నంతయు నేదియో కారణమున ఉత్తర దేశములకు బంపియుండెను. విరాటదేశపు రాజుగా నుండిన పృథ్వీరాజచౌహాణుడీ వార్త నెఱింగి యాతని మీదికి దాడి వెడలి యుద్ధమున నాతని జంపివైచి ఇంద్రప్రస్థ రాజ్యము నాక్రమించెను. ఈతనితో నీ వంశపురాజులు ఐదు గురు 86 సం. లు 24 రోజులు పాలించిరి. పృథ్వీరాజుపై సుల్తాను షహాబుద్దీను గోరీ అనేక పర్యాయములుదాడి గావించి యాతనిచే యోటుబడి తిరిగిపోయి, తుదకు 1249 వ విక్రమ సంవత్సరము (క్రీ. శ. 1192) న నంతః కలహముల కారణ ముగ పృథ్వీరాజును జయించి, బంధించి యంధునిగా జేసి తన దేశమునకు గొనిపోయినట్లు కొన్ని ఇతిహాసములలో వ్రాయబడి యున్నది.

ఈ పృథ్వీరాజు వంశములో కడపటి రాజగు యశపాలునిపై గజినీ మహమ్మదు దండయాత్ర సల్పి యాతనిని ప్రయాగ కోటలో చెఱబెట్టి తాను ఇంద్రప్రస్థపురము నాక్రమించి రాజ్యమేలెను.

ఈ షహబుద్దీన్ గోరీతో నీతని వంశమువారు 53 మంది రాజులు 754 సం. 1 నెల 11 రోజులు రాజ్యము చేసిరి. దీని వివర మనేక ఇతిహాస గ్రంథములయందు గాన వచ్చును గాన ఇట వ్రాయలేదు.'' అని వ్రాయబడి యున్నది.

ఆ సంకలన గ్రంథమున తర్వాత కొన్ని పుటలు నష్టమై యున్నందువలన నీ విషయమున నింతకంటెన్న వివరములు లభింపలేదు. అదృష్టవశమున నున్నంతవరకు సమగ్రముగా నున్నందుకు సంతోషము.

కొద్దిగనో, గొప్పగనో మన ప్రాచీన చరిత్రను దెలియ జేసెడి అష్టాదశ పురాణములలో పెక్కింటియందలి రాజవంశముల పట్టికలలో వాయు, మత్స్య, విష్ణుపురాణములలోనివి మాత్రము నించుమించుగ ఒండొంట సరిపోలి నమ్మదగి యున్నవనియు, నొక్కొకచో మొదటి రెంటికన్నను మూడవదానిలోని విషయములంత విశ్వసనీయములుగావనియు, భాగవత, బ్రహ్మాండపురాణములలోని రాజసంతతిలోని పేళ్లు తారుమాఱుగా పొనరించబడి, సత్యదూరములుగా నున్నవనియు గ్హాడ కొందఱు పండిత ప్రకాండుల యభిప్రాయము.

పై విషయములన్నియు తూచి చూచి నిర్ణయించవలసిన చరిత్రలు, కావున ఈ పని పరిశోధనా ప్రవీణులకు వదలి యీ వ్యాసమునకు భరతవాక్యము బలుకుచున్నాను.



# తేజో రేఖలు

## శ్రీ సంజీవదేవ్

పరిచితంకాని దాని ద్వారా పరిచితమైన దాన్ని వర్ణించి చూపటం వృథా. అందుకు విరుద్ధంగా పరిచితంకాని దాన్ని పరిచితమైన దాని ద్వారా వర్ణించటం సముచితం. అజ్ఞాతం ఎప్పుడూ జ్ఞాత సాదృశ్యం ద్వారా తెలియబడాలనుంటుంది. ఇంద్రియగ్రాహ్యం ద్వారా అతీంద్రియత గ్రహించబడాలి. మూర్తం ద్వారా అమూర్తం.

* * * *

స్థలంలో మనం వెనక్కు పోగలం గాని కాలంలో వెనక్కు పోజాలం. మన స్మృతులలో మాత్రమే మనం కాలంలో వెనక్కు పోగలం, కాని స్థలంలో మాత్రం శరీరంతో కూడ వెనక్కు పోగలం. స్థలంలో మనం పోగలం వెనక్కు, పోగలం మధ్యకు, పోగలం ముందుకు. కాని, కాలంలో మాత్రం మనం మధ్యకూ, ముందుకూ మాత్రమే పోగలం. మధ్య అనేది వర్తమానాన్నీ, ముందు అనేది భవిష్యత్తునూ సూచిస్తవి కనుక. అందుకని మనం కాలంలో వెనక్కు పోజాలం, వెనక అనేది భూతకాలం కనుక.

స్థలం స్థితిశీలం (పైకి మాత్రమే, అసలు లోతుకు పోతే ఈ విశ్వ సృష్టిలో ఏదీ స్థితిశీలం కాదు, అంతా గతిశీలమే) కాలం గతిశీలం. స్థలం దృశ్యమానం, కాలం శ్రవ్యమానం. కనుక రూపం స్థలాత్మకం, నాదం కాలాత్మకం. స్థలం మూర్తం, కాలం అమూర్తం. స్థలం భావం (Being) కాలం భవం (Becoming)

* * * *

శరత్ ఎంతో ఆనందమయ కాలం; పైన పారదర్శకంగా వెలుగుతూన్న నీల గగనం, క్రింద స్ఫటిక స్వచ్ఛమైన నీల జలమూ, వాటి మధ్య హేమధవళమైన తెల్లపూలు పైన నీలంలోనీ, క్రింది నీలంలోనీ ఏకత్వపు విసుగుదలను తొలగిస్తవి. ఎగురుతూన్నట్టీ, ఎగురుతూండనట్టీ కొంగల తెల్లదనం తెల్లపూల తెల్లదనాన్ని ప్రస్ఫుటం చేస్తూంది. ప్రత్యేకించి రసమయ, చిన్మయ సాధనలో ఆసక్తి కలవాళ్ళకు శరత్ నిజంగా అద్భుతమైన ప్రేరణాత్మక ఋతువు. చిన్మయమైన శారద ప్రభాతాలూ, తన్మయమైన శారద సంధ్యలూ నిజంగా సురబాలలు కూడ ఆనందించే విచిత్ర దృశ్యాలు!

* * * *

అన్ని కళల కంటే జీవితం మహోన్నతమైనట్టీ, లలితతమమైనట్టీ కళ, సందేహంలేదు. అయినా, ఇతర సృజనాత్మక కళలు లేనప్పుడు జీవితం తన స్వంత కళను ఆనందించ జాలదు. వర్ణం, నాదం, ఛందం, గతి మొదలైన వాటి లయ అనే దర్పణంలో కాని జీవితం తన స్వంత కళలోని మాధుర్యాన్ని అనుభూతి చెందజాలదు.

* * * *

జీన్‌పాల్ సార్త్రే తన స్వంత ఎగ్జిస్టెంషలిస్టు ధోరణిలో అంటాడు "ఏది ఉన్నదో అది లేదు" (etre - neant) అని. ఇది అద్వైత సిద్ధాంతంలాగా, జపానీయుల జన్ సిద్ధాంతంలాగా, నాగార్జునుని తర్కంలాగా బహు విచిత్రంగా ధ్వనిస్తుంది.

* * * *

జీవితం కళను సజీవ పరుస్తుంది. కళ జీవితాన్ని ఆనందపరుస్తుంది. జీవితం వ్యక్తపరుస్తుంది. కళ గుప్త పరుస్తుంది. ఈవిధంగా కళ బహిర్గతం కంటే అంతర్గతమే అధికం.

* * * *

ప్రయాణం ప్రేరణలేని వాళ్లకు ప్రేరణ నిస్తుంది. జడునిలో ఉద్రేకాన్ని కలిగిస్తుంది ప్రయాణం. ప్రయాణం మందమతిలో నవజీవన సుధను పోస్తుంది. జ్ఞానోదయానికి ప్రయాణం ఒక జయప్రద మార్గం. విద్య తన పరిపూర్తను అందకొంటుంది ప్రయాణంలో.

ఒక ప్రయాణపు గమ్యస్థానం ఆనందానికీ, శాంతికీ నిలయమై, అక్కడి నివాసులు మానవత్వంలోని మంచితనాని

కంతకూ సజీవమూర్తులై ఉంటే, ఇక అటువంటి ప్రయాణము నిరుపమేయం అవుతుంది.

*　　*　　*　　*

పదం వస్తువు కాదు. వస్తువుయొక్క శబ్దచిహ్నం మాత్రమే పదం. పదం నామం, వస్తువు రూపం. 'పుష్పం' అనే పదం నిజంగా పుష్పం కాదు, అది కేవలం పుష్పానికి శబ్దచిహ్నం మాత్రమే. 'పుష్పం' అనే పదానికి వాస్తవ పుష్పానికున్న రంగు కాని సుగంధం కాని లేదు. అయినప్పటికీ "పుష్పం' అనే పదం మనలో సృష్టిస్తుంది వాస్తవ పుష్పం లోని రంగూ సుగంధాల సంవేదనలను. ఈవిధంగా చూస్తే వాస్తవ వస్తువుకూ, దాని చిహ్నానికీ మధ్య ఎక్కువ ప్రభేధం లేదేమో అనిపిస్తుంది.

పదం ఛాయ అనీ, వస్తువు వాస్తవ పదార్థమనీ వాడుక. పుష్పం అసలు పదార్థం అనీ, 'పుష్పం' అనే పదం దాని ఛాయ అనీ. కానీ పదమే వాస్తవ పదార్థమేమో, పుష్పమే దాని ఛాయ యేమో, ఎవ రెరుగు ! నిజంగా ఇది గుర్రాన్ని బండి లాగుతుం దన్నట్లుంటుంది !! ఒక వస్తువు యొక్క పదం ఆ వస్తువు కంటే ఎక్కువ చిరస్థాయిగా ఉంటుంది. రూపం నశిస్తుంది, నామం నిలుస్తుంది. పుష్పం నశిస్తుంది కాని 'పుష్పం' అనే పేరు నశించదు. కనుక ఒక వస్తువుకంటే ఆ వస్తువును సూచించే చిహ్నమే ఎక్కువ శాశ్వతం. పదార్థాని కంటే దాని ఛాయయే ఎక్కువ చిరస్థాయి !

నామం రూపం కాదు, పదం తాను సూచిస్తూన్న వస్తువూ కాదు. 'పుష్పం' అనే పదాన్ని ఉచ్చరించినంత మాత్రాన వాస్తవ పుష్పాన్ని కలిగిఉండటం కాజాలదు. మానవ జాతికి ఇది మేలూ, కీడూ రెండూ కూడ. మనకు ఇష్టమైన వస్తువు పేరును ఉచ్చరించటంతో ఆ పేరు వెంటనే వస్తువుగా మారితే అది మనకు మేలు. అయితే ఇది అయిష్టమైన వస్తువు విషయంలో మాత్రం వర్తించిందా అంటే మాత్రం మనకు కీడే !

'ఆరోగ్యం', 'జీవనం' అనే పదాలను మనం ఉచ్చరించినప్పుడు అవి ప్రత్యక్ష మవటం మేలు. కాని, 'వ్యాధి', 'మరణం' అనే పదాలను ఉచ్చరించినప్పుడు అవి ప్రత్యక్ష మవటం మాత్రం ఎంతో కీడు ! కాని అదృష్టవశాత్తు పదం అనేది కేవలం వస్తువుయొక్క చిహ్నంగా ఉండటం మాత్రమే జరుగుతూంది, ఆ వస్తువుగా ఉండటం మాత్రం జరగటం లేదు!

*　　*　　*

మన అంతరంగ జీవితం ఎల్లప్పుడూ బహిరంగ జీవితపు ప్రభావం నుంచి వేరై ఉండజాలదు. మనం ఎన్ని ప్రయత్నించినా అది బహిరంగ ప్రభావాలకు తరచుగా లొంగే ఉంటుంది. కాని, దాన్ని బహిరంగ ప్రభావాల నుంచి ఎప్పటికీ వేరుగా ఉంచటానికి అవకాశాలు లున్నవి.

*　　*　　*　　*

తెలుసుకోటాని కంటే అనుభూతి చెందటం జీవితంతో ఎక్కువ సన్నిహితమై ఉంటుంది. తెలుసుకోటం భోగట్టా, అనుభూతి చెందటం ప్రేరణ. తెలుసుకోటం జ్ఞానం అనుభూతి చెందటం అనుభవం, ఈ రెండూ కలిసి ప్రజ్ఞానాన్ని తయారుచేస్తవి.

మానసం ఆనందంగా కాని విచారంగా కాని లేనప్పుడు అది ఒక తటస్థావస్థలో ఉంటుంది. దీన్నే మనోమాంద్యం అనొచ్చు. ఇటువంటి మాంద్యాని కంటె విచారం ఎంతో నయం. నిజానికి విచారాని కంటే ఆనందం ఎంతో మంచిదే. అయినా, ఒక తాత్వికుడు అంటాడు, "పవిత్రమైన దుఃఖం ఆనందాని కంటే శ్రేష్ఠమయింది" అని.

వర్తమానకాలం ఇతర కాలాలైన భూత భవిష్యత్‌ల కంటే చాలా ఉత్కృష్టమైన సజీవకాలం. అయితే, అంత మాత్రాన భూతకాలం మరణించీ లేదు, భవిష్యత్ ఆవిర్భవించకుండానూ లేదు. వాస్తవానికి వర్తమానం అనేదే లేదు. వర్తమానం అనేది వర్తమానంగా నిలవలేని ఒక అస్థిరత. అది ప్రతి క్షణమూ భూతకాలంలోకి మారుతూంటుంది. దాని ప్రతి క్షణమూ భవిష్యత్‌లోని విచిత్రమైన తెరల వెనుక దాగిఉంటుంది. వర్తమానకాలం నిన్నటి రోజున భవిష్యత్ కాలంలో లెక్క, రేపటి రోజున భూతకాలంలో లెక్క. అది నేడు మాత్రమే, నేడు కూడ గడుస్తూన్న క్షణంలో మాత్రమే వర్తమానం:

# ప్రకృతి నవ్వింది

"ఆరెస్సింగ్"

దుర్మార్గుని మనసులాగుంది రోదసి. నవమి చంద్రుడింకా పొడసూపలేదు. రాత్రి రెండో జాము దాటింది.

"ఇవ్వాళ వీ డంతేవిటో చూడాల్సిందే. డ్రైవరు వెధవ, లారీ ఆపకండా దూసుకుపోతాడా ! వీడి తలబిరుసుతన మేవిటో యివ్వాళ తేలిపోవాల్సిందే." కొబ్బరి మోసుతో తమ్మిలేటి వంతెన కమ్మీలకు ఏనుగు మెలిక వేస్తూ కోపంగా అనుకుంటున్నాడు, చౌకీదారు కిష్టయ్య.

బ్రిటీషువారి హయాంలో, రేషనింగ్ అమల్లో ఉన్న రోజుల్లో, అన్ని పట్టణాల ఔట్‌పోస్టుల దగ్గర ప్రతి రాస్తాకూ ఒక చౌకీదారును ప్రభుత్వం నియమించేది. అతగాడు, వచ్చే పోయే యేవిధమైన వాహనాలను గానీ, మనుష్యులను గానీ తనిఖీ చెయ్యడానికి అధికారం గలవాడు. ఏ ప్రదేశాన్నుండీ గానీ మరో చోటికి, ప్రభుత్వంవారి అనుమతి పత్రము లేనిదే, ధాన్యము, అపరాలు మొదలుగా గల ఆహార పదార్థాలు తీసుకువెళ్ళడం చట్టరీత్యా శిక్షార్హం.

కిష్టయ్య ఏలూరుకు ఈశాన్యదిశ నున్న ఔట్‌పోస్టులో చౌకీదారు. వస్తుతః మంచివాడు. నిజాయితీని చర్యల ద్వారా నిరూపించడమే ధ్యేయంగా గలవాడు. అయినా అతడు జీవితంలో అనుకున్నదేమీ సాధించలేకపోగా, అపహాస్యపు పాలవడానికి కారణం అతనిలో కొంచెం లౌక్యం లోపించడమే కావచ్చు.

సత్యాన్ని పరిశోధించడంలో తమ జీవితాల్నే అర్పించారు మహాత్ములు. తత్పర్యవసానంగా యేర్పడిన బుజు రేఖమీద జీవితాన్ని సూటిగా నడిపించాలంటే మనిషికి ఎంతో నేర్పు, ఓర్పు అవసరం. సమాజంలో అనుక్షణం తలెత్తే అసూయ ద్వేషాల ఆటుపోటులను నిభాయించుకునే సంరంభంలో, ఆవేశాలకు లోనై అసలు జీవిత దృక్పథాలనే విస్మరించక, నిండుగా నిలబడగలిగే ధీశక్తి, మనిషిలో నిద్రాణంగా ఉండి, అదను దొరికిందే తడవుగా విజృంభించే పాశవిక శక్తుల్ని జోకొట్టగల సమర్థత, సత్యనిరతి—సమపాళ్ళలో నిబిడీకృతమైయున్న కార్యదక్షుడు మాత్రమే తన లక్ష్యం గురి చెదరకుండా పయనించగల్గుతాడేమో !

కిష్టయ్యకు చాలా కోపంగా ఉంది. మూడు సంవత్సరాలుగా అతడు చౌకీదారుగా ఉంటున్నాడు, కానీ యిలాంటి మొండితనం అతని కెప్పుడూ అనుభవంలోకి రాలేదు. మూడు రోజులుగా ప్రయత్నిస్తున్నా డ్రైవరు లారీని ఆపడంలేదు. అందుకే కిష్టయ్య మొండితనాన్ని మొండిగానే జయించాలనే సంకల్పంతో తమ్మిలేటి వంతెనకు అడ్డంగా తాకు కట్టాడు. లారీ, తమ్మిలేరు మీదుగానే వెళ్ళాలి.

లారీ నిండుగానే వెడుతుంది రోజూ. అంటే ఏదో మోసుకుని వెడుతున్నట్టే. బ్లాక్‌మార్కెట్‌దారుడెవడో యీపని చేయిస్తున్నాడని, కిష్టయ్య అనుమానం. అనుమానం వచ్చిన దాదిగా కిష్టయ్య హృదయం కుతకుతలాడుతోంది. కరువు దేశం నలుమూలలా విలయతాండవం చేస్తోంది. పేదవాడికి నూకగింజలు దొరకడం గూడా దుష్కరమైపోయింది. పాపం, రెక్కలాధారంగా బ్రతికే వాళ్ళంతా డొక్కలు మాడి, గంజినీళ్ళకోసం గిజగిజ లాడుతూ ఒక జిల్లా నుండి మరొక జిల్లాకు రైలుబండ్లమీద వచ్చి, నూకా, నుచ్చూ కొనుక్కు పోతున్నారు. వాళ్ళ పరిస్థితి అంతటి దైన్యానికీ, హైన్యానికీ దిగజారడానికి మూలకారణం యీ నల్లబజారు వర్తకులేనని కిష్టయ్య దృఢమైన విశ్వాసం. అందుకే వాళ్ళంటే అతనికి కడుపుమంట. బియ్యపుమూటలు పట్టుకెళ్ళే వాళ్ళను కిష్టయ్య చూచీ చూడనట్టు వదిలేయడంపరిపాటి.

తలకు టర్కీతువ్వాలు చుట్టుకున్నాడు. కిష్టయ్య రివటగాలి వీస్తుంటే. పంచె ఎగగట్టాడు. వంతెనకు దిగువ ఉన్న తన పోస్టులోనికి వెళ్ళాడు. టార్చిలైటు చేత్తో పట్టుకున్నాడు. లారీకోసం ఎదురుతెన్నులు చూస్తూ అటూ యిటూ తిరుగుతున్నాడు.

తమ్మిలేరు ఒక్క ఎండుకుపోయి యిసుకమేటలు వేసింది. అక్కడక్కడ నీరు గోతుల్లో మిగిలింది, యిగిరిపోతున్న ఆశాలేశంలా. తమ్మిలేటి వంతెనకు ఫర్లాంగు దూరంలో రైలు బ్రిడ్జి ఉంది. మరో ఫర్లాంగు దూరంలో తమ్మిలేరు కృష్ణా కాలువలో లీనమౌతుంది. ఆ సంగమ స్థలంలో మరో వంతెన తమ్మిలేరుపై కట్టబడింది. దానికి, నీటి ఉధృతాన్ని అరికట్టడం కోసం తలుపులు బిగించబడి ఉంటయ్. తమ్మిలేరు ఆ తలుపులగుండా పోయి పోయి కొల్లేటి సరస్సులో కలిసిపోతుంది. కిష్టయ్య రహదారి వంతెన మీదినుండి పారజూస్తున్నాడు. కిష్ణా కాలువలో పడవ నిలబడి ఉంది. పడవలో దీపం మినుకు మినుకు మంటోంది. కృష్ణా నీటి మట్టం తగ్గింది. ఏలూరు తూర్పు లాకు వద్ద పడవలు ఆగడం తప్పనిసరి. లాకు కృష్ణా కాలువను, గోదావరి కాలువను కలిపే పవిత్ర సంగమం కూడా. ఏకాదశి స్నానాలకు జనం ఇసుకవేస్తే రాలకండా వస్తారు. పడవల్లో కూడా ధాన్యం దొంగతనంగా చేరవేస్తుంటారు. కిష్టయ్య పడవవాళ్లను బెదరవేస్తుంటాడు—

రైలుకూత వినబడింది.

గబగబా అంగలు వేసుకుంటూ పోస్టు దగ్గరకొచ్చాడు కిష్టయ్య. అక్కడకు మూడు ఫర్లాంగుల దూరంలో జి. ఎన్. టి. రోడ్డు కడ్డంగా రైలుగేటుంది. బండి వెళ్లిపోతే గేటు తీస్తారు. బండ్లొస్తయ్. లారీ రావచ్చు.

డబడబమని గోల చేసుకుంటూ రైలు కదిలిపోయింది. ఆత్రంగా చూస్తున్నాడు కిష్టయ్య లారీకోసం. లారీ రాలేదు. హృదయావేగం నీరసించింది. చౌకీపోస్టు వసారాలో ఈత చాపమీద చతికిలబడ్డాడు కిష్టయ్య. దీర్ఘంగా నిశ్వసించాడు. పైకప్పు పెంకుల్లో నుంచి 'కీచు' మంటూ వచ్చి, అటూ యిటూ తచ్చాడి, కిటికీగుండా బయటికి పోయింది గబ్బిలం.

అంతా కలిసి చౌకీపోస్టు ఒక గది వసారా మాత్రమే. హరికేను లాంతరు మసగ్గా వెలుగుతోంది. గదినిండా ఎండుగడ్డి పరకలు చెదురు మదురుగా పడిఉన్నయ్. కిటికీవైపు బల్లవాల్చిన గడ్డి ఒత్తుగా పరచబడి దానిమీద తాటాకుల చాప, దానిపైన పాత పరుపు, మాసిన దిండు, దుప్పటి—దుమ్ము కొట్టుకుని ఉన్నయ్. లాంతరుకు సమీపంలో, పరుపుకు తలగడవైపు తెలుగు పత్రిక ఉంది. ప్రక్కనే ఎర్రట్ట పుస్తకం మీద 'తారకామృతసారం' అన్న అక్షరాలు పెద్ద సైజులో కనబడుతున్నయ్. తెల్ల కాగితాల పుస్తకం ఒకటి తెరవబడింది. ఒక పేజీలో అక్షరాలు గజిబిజిగా, గొలుసుకట్టులో కనబడుతున్నయ్. కిష్టయ్య ఏవో పాటలు గిలుకుతూ ఉంటాడు.. పగలు తీరుబడిగా ఉన్నప్పుడు తారకామృతసారంలోని తత్త్వాలు ఆలపిస్తూ, అర్థాన్ని వివరిస్తూ ఉంటాడు అక్కడ చేరే చర్మకారులకు. గది మూల వ్రాసుకునేందుకు అనువుగా ఏటవాలుగా చెయ్యబడిన చెక్క పెట్టె ఉంది. దానిమీద పింగాణి సిరాబుడ్డి, అందులో కలం మూగగా ఉన్నై. కిష్టయ్య ఆ పెట్టె ఎత్తుంచుకుని రాస్తుంటాడు. పెట్టెమీద వచ్చే పొయ్యే వాహనాల పేర్లను, నంబర్లను నమోదు చేసుకునే ఖద్దరు రంగు కాగితాల డైరీ ఉంది. పర్మిట్లు కలిగిన బండ్లను వాటి తాలూకు రశీదులను నమోదు చేసుకునే రిజిస్టరు కూడా అక్కడే ఉంది. పెట్టె మీద కలం ఉంచుకునే గాడిలో కుంకుమరంగు పిడి వేయబడిన 'చక్కరగుత్తి' ఉంది. దాన్ని బియ్యం తోడే గొట్టం అని కూడా వ్యవహరిస్తారు. ఉక్కు రేకును 'కిళ్లీ' వలె మొనదేరేటట్టు మడిస్తే, మధ్య గుల్లగా గాడి ఏర్పడుతుంది. దాన్ని పిడికి అమర్చి నిండు బస్తాకు గుచ్చి వెనక్కు తీస్తే బస్తాలో ఉన్న పదార్థ మేదైనా, చక్కరగుత్తి గాడిలోనికి వచ్చేస్తుంది హాయిగా. గోడకు లాఠీకర్ర వ్రేలాడుతోంది. లాఠీ చివరనున్న కన్నంలో నుండి దూరి కట్టబడిన సన్నని వారుముక్క ఆధారంగా. కిష్టయ్య ఏదైనా బండి మధ్య బస్తాల్లో ఏముందో తెలుసుకోవాలంటే, చక్కరగుత్తిని లాఠీకి కట్టి, బండి మధ్యలో పొడిచి, వెనక్కు లాగి చూసి సందేహ నివృత్తి చేసుకుంటాడు. గోడనున్న మరో మేకు నుండి, దీర్ఘ చతురస్రంగా ఉన్న ఊదారంగు గుడ్డ పటకా కొసల ఆధారంగా వ్రేలాడుతోంది. దాన్ని 'బాడ్జి' అంటారు. దానికి నాలుగు వైపులా తెల్ల కుట్లు, వాటి మధ్య 'సి. హెచ్' అన్న ఇంగ్లీషు అక్షరాలు తెల్ల గుడ్డతో కుట్టబడినవి. 'బాడ్జి' దండకు కట్టుకుంటాడు కిష్టయ్య. గదికి మరోవైపు పాత రాలీ సైకిలు స్టాండువేసి ఉంది.

ఏదో తత్త్వం కూనిరాగంలో గొణుగుతూ ఆగిపోయాడు. ప్రక్క యింటిలో నుంచి నవ్వులు వినబడుతున్నయ్.

"సాయిబుగాడిగిలిస్తున్నాడు దూదేకులదాంతో" విసుక్కున్నాడు కిష్టయ్య.

పోస్టుకు సమీపంలో తోళ్లషాపు పాకటుంది. అందులో పనిచేసే చర్మకారులు అక్కడే నాలుగు గుడిసె లేసుకున్నారు. వాళ్లకు చుట్ట, బీడీ, సోడా అమ్ముతాడు సాయిబు రెహ్మాన్.

వాడి జీవితంతో పోల్చుకున్నాడు తన జీవితాన్ని కిష్టయ్య.

# ప్రకృతి నవ్వింది

'రెహ్మానుకు బాదరబందీ ఉన్నట్టు ఎప్పుడూ కనిపించడు. పిల్లలు లేరు. అనువుగా దొరికిన ఆడదాన్నల్లా తీసుకొస్తాడు. నెలా రెండు నెల లుంచుకుంటాడు. అటుపై దానికి విసుగెత్తడమో, వీడికి మోహం మొత్తడమో జరుగుతుంది. తరువాత రెహ్మాన్ కొత్త మోహాన్ని తెచ్చుకుంటాడు. వాడు కూడా కిష్టయ్యకు ఏదో ఉపదేశించబోతాడు.

కిష్టయ్యకు నలుగురి పిల్లల పోషణ జరగాలి. భార్య మంచిది. సంసారం సరిదిద్దుకుని ఉన్నదాంతో సర్దుకుపోతుంటుంది. పెద్దకొడుకు రిజర్వు కానిస్టేబులు పనిచేస్తూ చచ్చిపోయాడు. పాపం ! కిష్టయ్యకు పెద్దబ్బాయంటే పంచప్రాణాలూను. వాడు పోవడంతో జీవితంమీద ఆశ సడలిపోయింది కిష్టయ్యకు. రెండో కొడుకు వట్టి మేదకుడు. తలిదండ్రులతో చెప్పకుండా పారిపోయి, మిలిటరీలో జేరి, యుద్ధంలో భయానక దృశ్యాల్ని, లెక్కకు మిక్కిలిగా ఉన్న శవాల్ని చూచి బెంబేలుపడి యింటికి పారిపొయ్యొచ్చాడు. వాడి పిరికితనాన్ని, అప్రయోజకత్వాన్ని తిట్టిపోశాడు కిష్టయ్య. వాడిని గూడా తనే యీడ్చుకురావాలి. పెద్దకొడుకు ధైర్యం గలవాడు, అలవిమాలిన దొంగలకేసు ఒక్కడే ప్రాణాల్ని ఖాతరు చెయ్యకుండా పట్టుకున్నందుకు హెడ్ కానిస్టేబుల్‌గా ప్రమోషను వచ్చే సమయంలో విషజ్వరం అతన్ని పొట్టన బెట్టుకుంది— అదీ పెళ్లయిన నాలుగో నెలలోనే.

జీవితం కిష్టయ్యను దగాచేసి, అతని జీవనాడుల్ని కృంగదీసింది. పెద్దపిల్ల పెళ్లీడు కొచ్చింది. చిన్నపిల్ల, కడసారి వాడు చదువుకుంటున్నారు. భార్యకు ఉబ్బసం వస్తూంటుంది. సంవత్సరానికి రెండు నెలలు ఆస్పత్రిలోనే గడుపుతుంది.

అన్ని సుఖాలూ అతనికి దూరమైనా, నిజాయితీకి మాత్రం దూరంకాలేదు కిష్టయ్య.

జీవితంలో ఒక్కొక్క అనుభవం ఒక్కొక్క పాఠం నేర్పి, తమ దారిన తాము పోతూనే ఉన్నై.

లోయర్‌గ్రేడు పంతులుగా జీవితం ప్రారంభించాడు కిష్టయ్య. అతని అన్న వెంకన్నకు చదువంటే సయించదు గానీ, మంచి వ్యవహారికుడు, పలుకుబడి గల లౌకికుడు. చుట్టుపట్ల గ్రామాదుల్లో తెలివితేటలకు పేరెన్నికగన్నవాడు. అతడు చెప్పింది వేదాక్షరం కిష్టయ్యకు. "వెధవ పంతులుద్యోగం, మానెయ్‌రా, యవసాయం జేద్దాం' అన్నాడు వెంకన్న తమ్ముడి పంతులు దర్జా చూడలేక.

కిష్టయ్య రాజీనామా పడేశాడు.

కిష్టయ్యది దృఢమైన, కండలు తిరిగిన కాయం. అతడు బుగులు మీసాలతో ఉరిమిచూస్తే, యెదుటివాడిలో జంకు తాలూకు ఛాయలు స్పష్టంగా కనబడేవి. వ్యవసాయం కలిసిరాకపోగా, వెంకన్న మూలంగా ఊళ్లో తగాదాలు పెరిగి, కక్షలు, కార్పణ్యాలు పెచ్చు పెరిగినయ్. కులద్వేషాలు సంద్య చేసుకున్నయ్. వెంకన్నను అక్కసుతో కొట్టారు. కిష్టయ్య కోపంతో రుద్రుడే అయ్యాడు. ఊరు ఊరంతా గజగజ లాడించి శత్రుపక్షంవారి నందరినీ ఒక్కడే తరిమి తరిమి కొట్టాడు. అన్నంటే అమితమైన అభిమానం.

పచ్చగా బ్రతికిన కుటుంబం. కోర్టుల చుట్టూ తిరిగి తిరిగి, కిష్టయ్య ఆస్తి కర్పూరంలా కరిగిపోయింది. ఇక్కడ కూడా జీవితం అతన్ని చిన్నచూపే చూసింది. వెంకన్న తన పొలం కొంత మిగుల్చుకుని కిష్టయ్యను నిరాధారుణ్ని చేశాడు. అప్పటినుండీ కిష్టయ్య తన స్వయం శక్తిమీద ఆధారపడి జీవితాన్ని వెళ్లదీయవలసొచ్చింది. భార్య యిప్పటికీ గోల బెడుతూనే ఉంటుంది. కిష్టయ్య తన ఖర్మను నిందించుకుంటాడు తప్ప ఎవ్వరినీ ఏమీ అనడు. ఒకవిధంగా, ఆ మంచితనమే అలుసుగా తీసుకుని లోకం అతన్ని వెక్కిరిస్తోందేమో !

'బయ్' మంటూ శబ్దమయ్యింది. రెండు లైట్లు రోడ్డు మలుపునుండి సూటిగా కిష్టయ్య కళ్లల్లో గుచ్చుకున్నయ్. ఆదరాబాదరా లేచి నిలబడ్డాడు కిష్టయ్య రోడ్డు మధ్యగా. కారు రానే వచ్చింది. ఖాళీ బస్సు. డ్రైవరేదో చెప్పి ముందుకు తోలుకుపోయాడు.

విసుగ్గా మళ్లీ చతికిలబడ్డాడు కిష్టయ్య. రెహ్మాన్ ఉంపుడుగత్తె ఏదో తురకంలో మాట్లాడుతూ నవ్వుతోంది.

'నవ్వుతూ, తుళ్లుతూ సెలయేరులా బ్రతుకుతూ పోవాలంటే, మంచి చెడ్డల ఊసెత్తకుండా నిత్యవినీతుల జోలికి పోకుండా, మమతలూ, బంధాల ప్రసక్తి లేకుండా తిని, త్రాగి, నవ్వుతూ నాలుగు కాలాలు బ్రతకాలి కామోసు' పిచ్చిగా ఆలోచించుకుంటున్నాడు కిష్టయ్య.

మొన్న రెహ్మాన్‌గాడు నవ్వాడు. గడ్డి బండిలో ధాన్యం దాచుకుని. దాటేస్తున్నాడు ప్రక్కవూరి రైతు. ఐదు బస్తాల ధాన్యం. కిష్టయ్యకు రావలసినంత కోపం రానే వచ్చింది. రైతు యాభైరూపాయ లిస్తానని బతిమాలుకున్నాడు. లంచం అనేసరికి కిష్టయ్య ఉగ్రుడయ్యాడు. రైతుమీద రిపోర్టు రాయబోయే సమయంలో శనిలా వచ్చాడు సూపర్‌వైజరు. చౌకీదార్లను తనిఖీ చేసేందుకు అతగాడు వస్తూంటాడు. దొంగ ధాన్యం తతంగం చూశాడు, రైతు లౌక్య మెరిగిన వాడు. సూపర్‌వైజరును చాటుకు తీసుకువెళ్లాడు. మర

క్షణంలో "ఇదుగో కిష్టయ్యా! ఏదో పాపం, పేదరైతు, చాలా మంచోడులా గున్నాడు, ఇవాళ్టికి వదిలెయ్. ఏమన్నా వస్తే నే జూసుకుంటా' అని సమాధానం కోసం ఎదురుచూడకుండా రైతును సాగనంపాడు. సూపర్‌వైజరు—డబ్బులు పిక్కించుకున్నాడు మరి. అంతకుముందే రెహ్మాన్ కిష్టయ్యకు చెప్పి చూచాడు 'తృణమో—పణమో' వచ్చింది రాబట్టుకొమ్మని. ఆత్మవంచన చేసుపోకోవడం కిష్టయ్య జన్మలో జరగని పని. ససేమిరా అన్నాడు. ఇప్పుడు తన పై ఉద్యోగే ఆపని చేశాడు. కిష్టయ్య తన అసహాయతను నిందించుకున్నాడే తప్ప, 'కాళ్ల దగ్గర కొచ్చిన డబ్బును కాదన్నుకున్నా నేమో' అన్న భావం అతనికి ఏ కోశానా కలుగలేదు. అయితే రెహ్మాన్ నవ్వింది మాత్రం 'సిరిరా మోకాలొడ్డే' కిష్టయ్యను చూసి.

ఎదురుగా ఉన్న తాటితోపులో పుంజీభవించిన చీకటితో పెనగులాడుతోంది మసక వెన్నెల.

చీకటి శబ్దం చేస్తున్నట్లు 'రయ్' మంటూ దూసుక్పొస్తోంది లారీ. చప్పున నిలబడ్డాడు కిష్టయ్య. లారీ యొక్క వేగం, ధ్వని యినుమడిస్తున్నయ్. లైట్లు మెరపులాగా ఆకస్మికంగా వెలిగి ఒక్కసారిగా ఆరిపోయినయ్. కిష్టయ్య కళ్లు జిగ్గుమన్నయ్. కళ్ల బైర్లు కమ్మి చీకటిచుక్కల్ని చూస్తున్నయ్. కన్ను మూసి తెరిచేలోగా 'రంయ్' మంటూ అతన్ని దూసుకుపోయింది లారీ! 'అమ్మా!' అంటూ కంకర రోడ్డు ప్రక్కన పడ్డాడు కిష్టయ్య. తల దిమ్మెక్కింది. చెయ్యి తిమ్మిరెక్కింది. చేతిలో టార్చి వెలిగింది. లారీ నంబరు గొణిగింది గొంతు. "ఎమ్. డి. డబ్ల్యు. 204". "ఫట్" మన్న శబ్దం వినబడింది. మరు క్షణంలో లారీ కనుచూపుమేరలో ఉంది—

కిష్టయ్య భారంగా లేచాడు. సైకిలు తీసుకున్నాడు. చేతి నరాలు పీకుతున్నయ్. ఓపికనంతా కూడదీసుకుని సైకిలు మీద, లారీని వెంబడించాడు.

టౌన్‌లోనికి చొచ్చుకుపోయింది లారీ. ఒక సందు మలుపులో ఆగిపోయింది. కిష్టయ్య లారీని చేరుకున్నాడు, డ్రైవరు లేడు. ఎవ్వరూ లేరు. లారీ అంతా పరీక్షించాడు. లారీ నిండుగా బియ్యపు బస్తాలు. పళ్లు పటపట నూరాడు. తన పథకం నెరవేరబోతున్నందుకు సంతోషంగా, గర్వంగా కూడా ఉంది కిష్టయ్యకు. తన పట్టుదలకు తనే ఆశ్చర్యపోతూ లోలోన మురుస్తున్నాడు. వెంటనే రేషనింగు ఆఫీసరుకు ఫోనిద్దా మనుకుంటున్నాడు.

తెల్లని దుస్తుల్లో ఒక ఆకారం ప్రవేశించింది. టార్చి వేశాడు కిష్టయ్య. వ్యక్తిని పరకాయించి చూచాడు. ఆశ్చర్యపడలేదు. అర్థం చేసుకున్నాడు. ఆగంతకుడు పేరుమోసిన మిల్లు యజమాని. లేని నవ్వు తెచ్చిపెట్టుకుని "చౌకీదారుగారూ! మమ్మల్ని పట్టిస్తే మీకేం ఒరుగుతుంది. నామాట విని యీ ఐదొంద లుంచండి'. రూపాయల కట్టలు చేతిలో పెట్టబోతూ 'మమ్మల్ని ఒదిలెయ్యండి ఎందుకు యిరుకున బెడతారు' బతి మాలే ధోరణిలో అంటున్నాడు గ్లాస్కో దుస్తుల్లోని మిల్లు యజమాని.

కిష్టయ్య అగ్నికీలలా భగ్గుమన్నాడు. మిల్లు యజమానిని కసిరికొట్టాడు. వెంట్రుకవాసిలో తన ప్రాణం పోయేది. అలాంటి ఘాతుకాలు చేసేవాళ్లని సహించగూడదని నోరు చేసుకోబోతుంటే చల్లగా జారుకున్నాడు మిల్లు యజమాని. అనుభవజ్ఞుడు మరి!

మరునటిరోజు. సాయంత్ర మయ్యింది. వెలుగురేఖల్ని తరిమి కొడుతున్నయ్ సంధ్య చీకట్లు.

సూపర్‌వైజ రొచ్చాడు. "కిష్టయ్యా! భలే ధైర్యం గలోడివోయ్. నిన్ను మెచ్చుకుంటూ గవర్నమెంటు సర్టిఫికెట్టిచ్చింది బియ్యపులారీని పట్టుకున్నందుకు ఇంద' అన్నాడు కిష్టయ్యకు టైప్ చేసిన కాగితం అందిస్తూ.

"లారీ డ్రైవర్ను, ఓనర్ని యేంచేశారండీ ?" ఆత్రంగా అడిగాడు కిష్టయ్య సర్టిఫికెట్టందుకుంటూ, ఇన్నాళ్లకు తన సంకల్పాన్ని నెరవేర్చుకో గలిగానని.

"ఆ ....! ఏంచేస్తారోయ్ ? ఇద్దరికీ కలిపి మూడొందలు జరిమానా వేశారు. మనలో మనమాట, ఆ మిల్లు ఓనరుకు ఆ జరిమానా ఒక లెఖ్ఖా. ఎక్కడా అనకు, మన ఆఫీసరుకు వెయ్యి ముట్టినయ్'—

కిష్టయ్య చేతిలో కాగితం రెపరెప లాడింది.

---

# ఒక్క ప్రశ్న

శ్రీ నాగభైరవ కోటీశ్వరరావు

అదేపాట
అదేమాట
పూట పూట పాడకు—
నోటనోట ఆడకు—
పదేపదే అదేఅదే
పాచిపళ్ల దాసరిదే!
నీ విచ్చే సారాయము పాతదే!
నా కొచ్చె కైపువట్టి రోతదే!

కథా పాత
వ్యథా పాత
చుట్టూ జోరీగమోత
పుట్టే, యీ నాటి రాత
వదలిపెట్ట వెందుచేత
మొదలుపెట్టు కొత్తగీత

కొత్తచోట
పత్తితోట
నాటించానంటివే!
చాటించిన బంటువే!
కొత్తపత్తి దెచ్చిగూడ
పాతగుడ్డ నేసెదవా?
ఊహ పాతదేగాని
ఉచ్చారణ కొత్తదా........?

నేను పాఠకుణ్ణి
నీకు స్నేహితుణ్ణి

పాతంటే రోత లేదు
కొత్తంటే మోజువుంది
కాని, నీ కొత్తదనం?
కలిగించే వెచ్చదనం...?
జీవితాన్ని హైపర్ బోల్ చేసే
భావనమే నా కండ్లకు బూచి;
నీ విచ్చే సిమిలి మెటఫర్లు
బండలవలె నా గుండెల దొర్లు;
కొత్తదనం మంచిదే
మందికి జీర్ణించితే—

పంచడాని కెంచిన నీ మార్గం
పఠితలకది చొరజాలనిదుర్గం—

నా కోసం అంకితమని చెప్పిన నీ కవిత
నా కర్థం కాకుంటే ఏమిటి నీ నవిత ?





చిత్రం : "విశ్రాంతిగా పడుకున్న నగ్న స్త్రీ"

చిత్రకారుడు : పాబ్లో పికాసో.

# డన్ అంతర్జాతీయ చిత్రకళాప్రదర్శనము

●

శ్రీ ఎస్. వి. రామారావు

లండన్‌లో ఈమధ్య పెద్ద పెద్ద కళా ప్రదర్శనలు వెలుస్తున్నవి. నిరుడు కురిసిన విపరీతమైన మంచు ఈ సంవత్సరం గూడ కురుస్తుందేమోనని భయంతో ఎదురు చూచిన లండన్ తేరుకున్నది. సరే, హాయిగా బ్రతుకవచ్చులే ఏ భయం లేకుండా అనేసరికి ఎక్కడలేని బ్రహ్మాండమైన కళా ప్రదర్శనలతో క్రిక్కిరిసిపోయింది, ఈ సంవత్సరం. ఇక లండన్‌కు విశ్రాంతి ఏది ? అంతే మరి ఎంత చెట్టుకు అంత గాలి అన్నట్టు !

ఇప్పుడు 'గోయా' కళాప్రదర్శన ఇంతవరకు ప్రపంచంలో ఎన్నడూ, ఎక్కడ జరుగనంత గొప్పది జరుగుతున్నది. ఇప్పుడే ముగిసింది డన్ అంతర్జాతీయ ప్రదర్శన. మొన్ననే 'కెనడా దేశపు చిత్రకళ' అని భారీ ప్రదర్శన ప్రారంభం అయింది. ఇంకా కొత్తవాటికి మళ్లీ అప్పుడే సన్నాహాలు జరుగుతున్నవి. ఇలా ఎడతెరపి లేకుండా 'బిజీ'లో పడవలసిందే లండన్ కళాభిలాషులు అందుకే ఒక్కొక్కసారి విసుగెత్తి ఈ ప్రదర్శనలు మనల్ని వదలవు గనుక మనమే వీటిని, లండన్‌ను వదిలి ఎక్కడికైనా పోయి హాయిగా గాలి పీల్చుదా" మని గాబోలు వారాంతా పండుగ పబ్బపు సెలవు రోజులలో దూరంగా ప్రశాంతంగా ఉన్న చిన్ని చిన్ని బీడీలకు గ్రామాలకు పోతారు holiday tours అనే పేరుతో.

ఇక్కడ ఉన్న లండనర్స్‌కు విసుగేమో గాని నాలాంటి విదేశీయులకు మాత్రం గాదు. ఎన్నాళ్ళుంటాం గనుక

యొక్కడ. అందుకని ఉన్నన్నాళ్లు ఈలాంటి సదవకాశాలు చాలా రావాలని ఆశిస్తాం.

సర్ జేమ్స్ డన్ ఫౌండేషన్‌వారి ఆధ్వర్యాన జరిగిన డన్ అంతర్జాతీయ చిత్ర కళాప్రదర్శనాన్ని ఆర్ట్స్ కౌన్సిల్‌వారు ఏర్పాటు చేశారు టేట్ గ్యాలరీలో. మొత్తం 101 చిత్రాలు వందమంది చిత్రకారులవి (బ్రతికిఉన్న వారివి) ప్రదర్శించారు. అందరు ప్రపంచ కళారంగంలో ఆరితేరిన హేమా హేమీలు. ఎవర 100 మంది గొప్ప ప్రపంచంలో అని సమస్య వస్తే ఆర్ట్స్ కౌన్సిల్ వారు "మన మెందుకు నిర్ణయించాలి, లేనిపోని చిక్కుల్లో పడతాం, తీరా ఒకరిని వదలి ఒకరిని తీసుకొంటే" అని సర్ కెన్నత్‌క్లర్క్, సర్ ఆంథోని బ్లంట్, గొర్డన్ వాష్‌బర్న్, గేబ్రియల్ వైట్, డేవిడ్ కారిట్, న్యూయార్క్‌లోని మ్యూజియమ్ ఆఫ్ మోడరన్ ఆర్ట్‌లోని ఆల్ఫ్రెడ్ బార్‌లపై ఈ భారం ఉంచారు. అక్కడితో చిక్కు తీరింది. ఉన్న ప్రదర్శనలో 6 బహుమతులు డా. 5000. ఒక్కొక్కటి యిచ్చారు ఆరు చిత్రాలకు. ఇస్తూ "ఎన్నో బహుమతులు అంతర్జాతీయ కళా ప్రదర్శనలో ఇప్పటికే పొందిన హేమా హేమీలకు మరల ఈ బహుమతులు యిచ్చే కంటే అంతటి నిపుణులు, గొప్పవారై ఉండి గూడా వారికి తగిన గౌరవం లభించని యితర చిత్రకారులకు ఈ బహుమతులు ఇస్తున్నాం" అన్నారు. ఇకనేం సాగింది గాలి దుమారం. బహుమతులు పొందినవారు ఇవాన్ ఆల్‌బ్రయిట్, అలెక్సకోల్ విల్లే, సామ్ ఫ్రాన్సిస్, ఇన్నియో మార్లొట్టి, కెంజో వొకాడా, పావలో వలార్జ్. నేను ఇంతవరకు అసలు వీరి పేర్లు వినలేదు. అలాగే చాలమంది గూడ వినలేదని తలుస్తాను. లండన్‌లో కొంతమంది కళా విమర్శకులు ఈ బహుమతులు పొందినవారిని బట్టుకొని వారి చిత్రాలు, వారి అనుభవాలు వారిని ఎవరు పికాసోతోను, జాన్‌మిర్‌తోను, డాలితోనూ పోల్చేరని దులిపేసారు. నిజానికి ఇందులో సందేహంలేదు. వీరి చిత్రాలు గొప్పవే కావచ్చు. కాని, నేటి చాలమంది అమెరికన్ చిత్ర కారులతో గాని ఈ పై చెప్పిన పికాసో లాంటి వారితో గాని పోల్చలేం. అంతర్జాతీయ ప్రదర్శనలలో మాత్రం పికాసో, డాలి లాంటి వారితో పోటీబడడం నిజంగా కొంత కష్టమే. ఏది ఏమైనా చాలమందిని ఈ ప్రదర్శన ఆకర్షించింది. ఇంత భారీఎత్తున, ఇంతటి ముఖ్యమైన ప్రదర్శన 1945 నుండి జరుగలేదట లండన్‌లో, అంటే దీని ప్రాముఖ్యత అవగత మవుతుంది.

చాలమంది ముఖ్యమైన చిత్రకారులు పాల్గొనలేదు, వారికి గ్రూపు ప్రదర్శనలో పాల్గొనడం యిష్టంలేక. ఇది చాల విచారించతగిన విషయం. అయినప్పటికి యీ ప్రదర్శనకు ఎన్నో ప్రసిద్ధ గేలరీలు, చిత్రకారులు, రాయబార కార్యాలయాలు తోడ్పడినవి చిత్రాలు సేకరించటంలో. ఇది ఎంతో కష్టతరమైన పని. క్యాటలాగుకు పీఠిక వ్రాస్తూ ఎమ్. బెవర్ బ్రూక్ "నేను ప్రదర్శన ఇంకా మరికొన్ని రూపమయ చిత్రాలు ఉంటే బాగుంటుందని తలచాను. మంచికో చెడుకో గాని మనం 'ఆబ్‌స్ట్రాక్సనిజమ్' లో నివసిస్తున్నాము, అదీగాక మా ఉద్దేశ్యం ప్రస్తుతపు క్లిష్టతరమైన చిత్రకళా రంగాన్ని సూటిగా ఉన్నది ఉన్నట్లు చూపాలని." అందుకే గాబోల్సు వెతికి వెతికి మారుమూలల ఉన్న రూపమయ చిత్రకారులవి తెచ్చి ప్రదర్శనలో యిమిడ్చి ఒక బహుమతి గూడ యిచ్చారు ఒక చెత్త చిత్రానికి.

ఈ ప్రదర్శన విశేషంగా ప్రజల్ని ఆకర్షించడంలో విశేషంలేదు. చాలమంది చిత్రకారులు పదేపదే వచ్చారు. ఎంతో చక్కగా ఏర్పాటు చేసారు లైటింగు. లేకపోతే చిత్రాలపై లైటు వెలుతురు పడి మెఱుస్తాయి చిత్రాలు వెండిలాగ. ఈ విషయంలో చాల జాగ్రత్త తీసుకొన్నారు టేట్ గ్యాలరివారు. ఎంతోమంది ప్రముఖ చిత్రకారుల చిత్రాలున్న ఈ ప్రదర్శనలోని ముఖ్యమైన చిత్రాల గురించి వ్రాస్తాను.

ప్రదర్శనలో చాలమందిని ఆకర్షించిన చిత్రం పికాసో "విశ్రాంతిగా పడుకున్న నగ్న స్త్రీ" చాల పెద్ద చిత్రం 76" × 110". దీన్ని 1959 లో చిత్రించాడు. పికాసో ఒక పెద్ద సుందర భవంతిని మౌంట్ సెంట్ విక్టోరియా వద్ద కొన్నాడు. ఈ భవంతి కొండకు ఉత్తరపు భాగాన కొండ మీదనే దాదాపు ఉన్నది. ఈ పర్వతము చిత్రకారులకు, కళాభిలాషులకు అందరికి సుపరిచితమే. ఈ పర్వతాన్నే పదేపదే చిత్రించాడు సిజాన్ ఎన్నో చిత్రాలలో. పర్వతాన్ని చుట్టూ ఉన్న పెద్ద పెద్ద కొమ్మల చెట్లన్నీ పదేపదే చిత్రించాడు. పికాసో 1959 లో ఈ ఇంటిని కొనగానే తాను గూడ ఈ పర్వతాన్ని చిత్రించాలని అభిలాష పడ్డాడట. పర్వతాన్ని పర్వతంలా మరల చిత్రించి సిజాన్‌తో పోటీపడ దల్చుకోలేదట. ఈ కొండ పికాసోకి పడుకున్న వయ్యారపు నగ్నస్త్రీగా కనిపించింది. కొండలోని లోయలు, ఎత్తు పల్లాలు ఆయన స్త్రీతో పోల్చుకున్నాడు. దాని రూపమే యీ చిత్రం. ఎంతో ఆహ్లాదకరముగా ఉన్న లేత నీలి ఆకాశంలో ముదురు ఆకు పచ్చని ఆకుల కొమ్మలు, ముదురు నీలి ఆకుపచ్చని గడ్డిపై అప్పుడే అభ్యంగన స్నానం ముగించిన యీ పృథుఘనస్తన సుందరి విలాస శయనం, తెల్లని బూడిద గులాబిరంగుల విశ్రమంలో నున్న శరీరపు కాంతితో ఆకాశముతో పోటీ పడుతున్నది. ఈవిడ తప్పక యూరప్ వనితయే అన్న

# లండన్ అంతర్జాతీయ చిత్రకళాప్రదర్శనము

ఉండాలి. లేకపోతే ఆ శరీరంలో తెల్లదనం ఉండదు. చిత్రంలో ఉన్న ఈవిడ "ఏమిటో తనను ఇంతమంది ప్రేక్షకులు యిలా ఎగాదిగా చూస్తున్నారు" అని ఆశ్చర్యంతో చూస్తున్నట్లున్నది. ఎంతోమంది ఈ చిత్రం చుట్టూ ఉండి చూడడంలో ఏదో ఒక విధమయిన ఇంద్రజాలం పికాసోలో ఉన్నదని తలుస్తాను. ఈ చిత్రానికి చుట్టుప్రక్కలవి ఎంతో బలమైనవి తప్పితే మిగిలినవి నాశి రకంగా కనిపిస్తాయి. ఈ చిత్రం చూస్తుంటే నాకు రూబెన్స్ చిత్రాలు జ్ఞాపకం వస్తాయి. ఆయన గూడ ఎంతోమంది నగ్న స్త్రీ చిత్రాలు చిత్రించాడు—బలంగా, గుండ్రంగా ఉన్నవారిని మాత్రమే. కాని, వాటిలో చలనం లేదు స్త్రీలు నడుస్తున్నా, పరుగెడుతున్నా. వారి శరీరం చూపించాలి చిత్రాలలోని ప్రత్యేకంగా వేశాడా రూబెన్స్ అని ఒక్కొక్కసారి అనిపిస్తుంది. కాని పికాసో చిత్రాలలో పికాసో ఉండి మనతో మాట్లాడుతున్నట్లుంటుంది. అంటే అంత సజీవంగా ఉంటాయి ఆయన చిత్రాలు. ఆయన వలెనే అంత బలంగాను, గట్టిగాను ఉంటాయి చిత్రాలు. ఒక్కొక్కసారి అనిపిస్తుంది నాకు—పికాసోలోని అంశమే హెన్రీమూర్‌లో గూడ ఉందని. లేకపోతే మూర్ పికాసోలా ప్రకృతిని స్త్రీ రూపంలో పోల్చి అద్భుతాలు ఎలా మలచగలడు తన శిల్పాలలో ? "విశ్రాంతిగా పడుకున్న స్త్రీ" చిత్రంలో పికాసో ఎంత కొద్ది టైములో చిత్రాన్ని పూర్తిచేసింది తెలుస్తుంది. ఎంత వేగమో కుంచె నడక ! తనకు ఏ రంగు ఎక్కడ ఎలా వాడాలో ఎంత క్షుణ్ణంగా, సరిగ్గా ఊహించగలడో తెలుస్తుంది. ఏదో తనకు బాగా అలవాటైన చిత్రాన్ని మరల చిత్రించాడా అన్నంత సులువు అగుపిస్తుంది ఈ చిత్రంలో. ఒకవిధమైన గంభీరత, చేతులు, కాళ్ళు మడచిన తీరులలో క్రొత్తదనం ఉంది. ఈ చిత్రం గ్యాలరి లేరిస్ (పారిస్) వారు యిచ్చారు ప్రదర్శించేందుకు లండన్‌లో.

గమ్మత్తులు చేయడంలో సల్వదార్ డాలి అందెవేసిన చెయ్యి. ఎక్కడ ప్రదర్శించినా ఒక అలజడి తెస్తాడు తన చిత్రంతో. ఒకసారి తన చిత్రాన్ని 'క్రీస్తు'ను బ్రసెల్స్‌లో ప్రదర్శిస్తామంటే (బ్రసెల్స్ అంతర్జాతీయ పారిశ్రామిక ప్రదర్శన) ప్రత్యేకంగా తన చిత్రము మాత్రమే ప్రదర్శించుటకు ఒక క్రొత్త భవంతి కట్టితే గాని, ప్రదర్శించ



చిత్రం: "సూర్యుని రథం"

చిత్రకారుడు: మోహన్ సమాత్.

నన్నాడు. అలాగే కట్టారు. ఆ చిత్రాన్ని స్విట్జర్లండ్ ప్రభుత్వము అనుకుంటాను కొన్నది. పికాసోలాగా ఇతను గూడ స్పెయిన్‌లో పుట్టాడు. ఒక్కొక్కప్పుడు అనుకుంటాను అసలు స్పెయిన్‌లో పుడితేనే చాలు గొప్ప చిత్రకారుడవుతాడని. వెలాజ్ క్విజ్, ఎల్ గ్రీకో, గోయా, జాన్‌మిరోలు గూడ స్పెయిన్ వాళ్ళే. 1929 లో సర్రియలిస్ట్ చిత్రకారులతో చేరి ఎన్నో చిత్రాలు వేశాడు. తరువాత విడిపోయి సహజరూప చిత్రాలు, మతసంబంధమైన చిత్రాలు వేసి పేరు, ధనం విపరీతంగా గడించాడు. తర్వాత అసంబద్ధమైన అసంగతమైన విషయాలను చొప్పిస్తూ తన చిత్రాలతో పెద్ద పెద్ద చిత్రాలను సర్రియలిస్ట్, డాడాయిస్ట్ల మాదిరి చేయ సాగాడు. అతని చిత్రాలు చూస్తే అతని కళానైపుణ్యానికి ఆశ్చర్యం వేస్తుంది. ఎంతో జాగ్రత్తగా రంగులు కలిపి మిశ్రమం చేసిన చిత్రాలు. డచ్ చిత్రకారుడు వెర్‌మీరు చిత్రాలను మరపింపచేస్తాయి. అతను నిజానికి రూప చిత్ర రచనలో రెంబ్రాంట్, రూబెన్స్‌ల తెగకు చెందినవాడు. తన నూత్న భావాలను చొప్పించి ఎంతో సునిశితంగా సహజరూప పద్ధతులలో చేస్తూ గమ్మత్తులను ఇరికిస్తాడు. ఈ ప్రదర్శన లోని తన చిత్రాన్ని క్రింది విధంగా వివరించాడు. "ఒక విధమైన ఊదారంగులో ఉన్నది. దగ్గరగా చూస్తే అబ్‌స్ట్రాక్ట్ చిత్రం. రెండు మీటరుల దూరం నుండి చూస్తే రాఫెయిల్ యొక్క సిస్టయిన్ మెడోనా, పదునైదు మీటరుల దూరం నుండి చూస్తే ఒకటిన్నర మీటరుల దేవతా చెవి." చిన్ని చిన్ని బెజ్జములు గల రేకుపై చెవిని చిత్రించి, మెడొనా చిత్రాన్ని చిత్రించిన కాన్వాస్‌పై దాన్ని ఉంచి చూస్తే ఎలా ఉంటుందో అలా ఉంది. దగ్గరగా చూస్తే రేకు బెజ్జములలో నుండి మెడోనా చిత్రం కన్పిస్తుంది. దూరానికి రేకుపై చిత్రమే కన్పిస్తుంది గాని బెజ్జముల ద్వారా కన్పించే మెడోనా అంతగా అగుపించదు. ఇది అసలు చిత్ర మర్మము. దీన్ని డాలి ఒకే కాన్వాస్‌పై రెండు చిత్రాలు కన్పించేలా చిత్రించడమే విశేష ప్రజ్ఞతో గూడుకున్న పనితనం. చిత్రంపై తెల్లని కాగితాన్ని గ్రుచ్చి దానికి వ్రేలాడ దీసిన దారం, ఆ దారానికి చిన్ని లేబిల్ గూడ చిత్రించాడు. వింతకాలం పట్టిందో చిత్రించడానికి చెప్పలేం.

ఈ చిత్రం ఉన్న గదిలోనే పికాసో చిత్రం గూడ ఉంచారు. ఇక ప్రేక్షకులకు డాలి చిత్రం చూడడం, పికాసో చిత్రం చూడడంతో మెడ నొప్పి పుట్టి ఉంటుంది. ఒక గోడకు డాలి చిత్రం, మరొక గోడకు పికాసో చిత్రం ఉంచారు. ఇక రూములో ఉన్న యితర చిత్రాలు అసలు లేనట్టే ఉన్నాయి.

మార్క్ చాగల్ రష్యాలో జన్మించాడు 1887 లో. ఇప్పుడు వెనిస్ పారిస్‌లలో నివాసం. చాలమంది యితన్ని పికాసో బ్రాక్‌ల తెగకు చేరుస్తారు. ఇతని లోకం అంతా ఊహామయం. గాలిలో ఎగురుతున్న (తేలుతున్న!) మనుష్యులు (పక్షుల ముఖం మనుష్యులా!) తలక్రిందులైన యిండ్లు, పూల కుండీలలో యిరుక్కొని ప్రేమించుకుంటున్న ప్రేమికులు మొదలైనవి చిత్రాలు. బైబిల్ వోల్డ్ టెస్టమెంట్ ఆధారంగా తీసుకొని చాల చిత్రాలు చిత్రిస్తారు. సెయింట్ ఛాపెల్ అన్న తైలవర్ణ చిత్రం విచిత్రంగా ఉంటుంది. మేరీ కన్య అనుకుంటాను, పూలగుత్తిని పట్టుకుని ఉన్నట్లున్న చిత్రాన్ని, ఒక పావురము, మనుష్య ముఖములు గల ఒక నెమలి, గాలిలో ఎగురుతూ, ఒక కాలితో కుంచె, రంగుల చిన్ని పాలెట్‌ను పట్టుకొని ఉంది. తీక్షణంగా పరీక్ష చేస్తున్నట్లున్నది తాను చిత్రించిన మేరీ చిత్రాన్ని. పైన వెన్నెల కురిపిస్తున్న పెద్ద గుండ్రని చంద్రుడు, క్రింద మహాపట్టణం ఉన్నాయి. పెద్ద చర్చి, పట్టణం మధ్యగ ప్రవహిస్తున్న నది ఉన్నాయి—ఏమిటో కథ అర్థంగాదు బహు ముతుక నీలిరంగు ఎఱుపులలో చిత్రం కొట్టవచ్చినట్లు ముందుకు వస్తుంది. పసుపురంగును అక్కడక్కడ చిందించాడు ఇతని చిత్రాలు మన జానపద చిత్రాల రంగులను గుర్తుకు తెస్తాయి. తైలవర్ణంలో చిత్రించినా ఇతని చిత్రం పెద్దకుంచెతోచిత్రించి నీటిరంగుల చిత్రాల మాదిరిగా ఉంది. బహు పల్చని రంగును వాడతాడు. దగ్గరగా నాటిగ చూస్తే కుంచెను గిరికి గిరికి, రాచి రాచి చిత్రించిన మాదిరి ఉంటుంది. ఈమధ్య చాల చర్చిలకు అలంకరణ చేస్తున్నాడు తన చిత్రాలతో. అప్పుడే యివి లండన్ మార్కెట్లలోనికి అమ్మకానికి వచ్చాయి ప్రింటుల రూపంలో.

అమెరికన్ చిత్రకారుడు మారిస్ గ్రేవ్స్ "కొంగ" అన్న చిత్రం నాజూకుగ ఉంది. ఈ చిత్రం ప్రదర్శనలోని చిత్రాలతో కలవక విడిగా ఉంటుంది. దీన్ని ఏ చైనీయులో, ఇండియనో వేసారంటే ఆశ్చర్యంలేదు. నిలబడిఉన్న తెల్లని కొంగ బూడిదరంగు బ్యాక్‌గ్రౌండులో మెడ ఎత్తి చూస్తున్నది దూరంగా. ఏమాత్రపు ఈనాటి యిజముల ప్రభావం లేకుండా ఉన్న చిత్రం. ప్రాక్ దేశపు కళలు, వేదాంతాలంటే చాల యిష్టం. ప్రాక్ దేశపు చిత్రకళలను తన చిత్రాలలో చూపిస్తారు. ఈమధ్యనే అమెరికా వదలి డబ్లిన్ (ఐర్లండ్) వచ్చి ఉంటున్నారు. రాతిల్లోను, లోహములలోను శిల్పాలను చేస్తున్నారు డబ్లిన్‌లోని తన యింట్లో. ఈ 'కొంగ' టెంపెరా పద్ధతిలో చిత్రించిన నీటి రంగుల చిత్రం. మన వారు వేసే చిత్రాలకు దీన్ని పోలిస్తే ఎంతో నాసిరకం. అమెరికాలో ఉన్నవాడు, కే. శే. మార్క్‌టోబిల సహాధ్యాయి

గనుక యితనికి మంచిపేరు వచ్చిందేమో అనే సందేహం కలుగుతుంది.

మరొక బహు రమ్యమైన చిత్రం ఆల్బెర్టోబురీ ది. ఇతను ఇటాలియన్, వైద్య విద్య అభ్యసించాడు. యుద్ధ ఖైదీగా టెక్సాస్ జైల్లో చాలాకాలం ఉన్నాడు బందీయై. ఈ అనుభవం అతని జీవితంలో జీర్ణించుకుపోయింది. ఖైదులో ఉండగానే ప్రారంభించాడు చిత్ర రచన. ఎప్పుడూ ఖరీదైన వస్తువులను, రంగులను వాడడు. బాగా చినిగిపోయిన గుడ్డపేలికలు, పనికిరాని చెక్క ముక్కలు వీటిని తీసుకొని చిత్ర నిర్మాణం చేస్తాడు. తెల్లని ముతుక గుడ్డపై బహు పల్చటి పెదల్పయిన చెక్కలను అతికించాడు, రెండు వరుసలలో ఎగుడు దిగుడుగ. దూరానికి ఏదో చెక్కలతో కట్టిన ఉడిలాగ ఉంటుంది. పైన ఎర్రని రంగును, క్రింద నల్లని రంగును పూశాడు గుడ్డకు. నిజమైన చెక్కలను పేర్చడం వలన శిల్పానికి ఉండే ఒక విధమైన బరువు వచ్చింది. చెక్కలను అమర్చిన తీరు, ఎఱుపు, నలుపు రంగులు దూరం నుండి చూస్తే మనలను ఆకట్టుతాయి. ఆ గదిలో ఉన్న అన్ని చిత్రాలను మించింది ఈ చిత్రం. ఎంతో అందమైన చిత్రం అందరి మన్ననల నందింది.

మరొక ఇటాలియను రెనాటో గుట్సొ యొక్క 'గది లోని స్టిల్ లైఫ్' అన్న చిత్రం చాలమందిని ఆకర్షించింది. ఇతన్ని అందరు 'కమ్యూనిష్టు ఆర్టిస్టు' అంటారు. ఉండేది రోమ్‌లో. ఇతను ఇటాలియన్ కమ్యూనిస్టుపార్టీలోని సెంట్రల్ కమిటీలో మెంబరు. కమ్యూనిస్టుపార్టీ చిత్రకారులకు మంచి అండగా నిలుస్తుంది ఇటలీ. నలుపు, తెలుపు, ఎఱుపు రంగులతో చేసిన ఇతని చిత్రం సైజులో చాల పెద్దది. గదిలో చిందర వందరగ నున్న రంగులు, సీసాలు, బుట్టలు, బల్లపై పడిఉన్న వైన్ బుడ్డులు, కాగితాలు ఎంతో సమంజసంగా ఉన్నాయి. తాను ఏది వేసినా సామాన్య మానవుని' కర్థం అవాలనే తత్వం గల వ్యక్తి—అంటే అచ్చు ఫోటోగ్రాఫులా చిత్రించాలనేవాడు గాదు. టెక్నిక్ చిత్రకారునికి వదిలి, ఏమిటో చిత్రం అన్నది ప్రేక్షకునికి తెలిస్తే చాలని యితని ఉద్దేశ్యం.

ఫోటోగ్రాఫులా అంటే ఒక చిత్రకారుడు ముందుకు వస్తాడు కెనడా నుండి. అలెక్స్ కోల్‌విల్లె అనే అతని చిత్రాలకు, కలరు ఫోటోగ్రాఫులకు తేడా ఉండదు. "సెంట్ జాన్ నది కుక్క, కుర్రవాడు" అన్న యితని చిత్రం ఇంగ్లండు లోని ముసలి రాయల్ ఎకాడమి మెంబర్ల చిత్రాల తెగకు చెందుతుంది. ఎందుకంటే ఈమధ్య రాయల్ ఎకాడమి ప్రదర్శన జరిగింది. అందులో ఉన్నాయి చిత్రాలు—చిత్రాలేమో గాని మద్రాసులోని మూర్ మార్కెట్ జ్ఞప్తికి వచ్చింది. దీన్ని గురించి తర్వాత వ్రాస్తాను. మొన్ననే ప్రారంభమైన 'కెనడియన్ చిత్రకళా ప్రదర్శనలో'' ఇతనివి ఏడెనిమిది చిత్రా లున్నాయి. అవి అన్నీ చూశాక ఇతన్ని ఖచ్చితంగా ఊహించవచ్చు. ఇతను లోగడ వార్ ఆర్టిస్ట్‌గ కెనడియన్ ప్రభుత్వం క్రింద ఉన్నాడు. అప్పుడు నేర్చుకున్నాడేమో అధికారులను ఎలా మెప్పించాలి చిత్రాలతో నని, లేక ఎటువంటి చిత్రాలు ఎనకంటె పై అధికారులకు నచ్చుతాయి అని. నా ఉద్దేశ్యంలో ఇతని చిత్రాలు ఏడెనిమిది చూశాక, ఇతను ముందుగ తాను చిత్రించదలచుకున్నది కలర్ ఫోటోగ్రఫీ తీసి, అది ప్రింటు వేయించి దాన్ని చూచి చిత్రిస్తాడని. ఇతని కంటె అమెరికన్ జాన్ వైట్ నయం కాస్త కాకపోతే కాస్తయినా. ఇతని చిత్రాలు తోటలో పరుగెత్తుతున్న కుక్క." "కుక్కతో ఉన్న బాలుడు". "తోట, కుక్క, నది" లాంటి పేర్లతో చిత్రిస్తాడు. చెత్త చిత్రాంలో ఒకటవ రకం. బహుశః రష్యాలో నైతే ఏ లెనిన్ ప్రైజో వచ్చిఉండేది.




చిత్రం : బజారు

చిత్రకారుడు : స్మూలర్స్ డే.వి.

ఇతను చిత్రకళా రంగాన్ని అతి సామాన్య మనవుని అభిరుచికి దగ్గరగా తీసుకు వచ్చినందుకు, ఉన్నది ఉన్నట్లు చిత్రిస్తాడని గాదు నాకు నచ్చకపోవడం. రూబెన్స్, వెర్‌మీర్, అగష్టస్ జాన్ లాంటివారి చిత్రాలు గూడా ఉన్నవి ఉన్నట్లు చిత్రించే పద్ధతే. అయినా అవి ఎందువల్ల చిరస్థాయిగ నిలచే కళా ఖండాలు ? కెనడాలో ఇంత చవుకరకపు చిత్రకారులు చాలా మంది ఉన్నారు.

అల్బర్టోగియ్ కోమటి "కూర్చున్న స్త్రీ" అన్న చిత్రం చాలా బాగుంది. ఇతను 1901 లో స్విట్జర్లండ్‌లో జన్మించాడు. పారిస్‌లో ఉం డు. ఇతను శిల్ప కళారంగంలో ఒక విప్లవం తెచ్చిన వ్యక్తి. సన్నని బహు బార్రైన, నడచే మనుష్యలను తీగలతో, ప్లాస్టర్‌తో చేసి నూత్నత్వాన్ని తెచ్చాడు శిల్ప కళలో. ఇతని చిత్రాలు గూడ అటువంటివే. స్కెచ్ చేసి నట్లే ఉంటాయి. చిత్రాలు. సన్నని కుంచెతో కూర్చొన్న మనిషిని స్కెచ్ చేస్తాడు. పల్చగ బ్యాంక్‌గ్రౌండుకు రంగు పూస్తాడు అక్కడక్కడ అంతే. చిత్రం చూస్తే పూర్తిచేయకుండ మధ్యలో వదలివేసినదిలా ఉంటుంది. దాదాపు ఒకటి రెండు లేత రంగుల కంటె ఎక్కువ ఉండవు ఏ చిత్రంలో నైనా సరే. ఇతని చిత్రాలు, శిల్పాలు, సన్నని జాజి పువ్వులవలె సునిశితంగాను, ఎంతో రమ్యంగాను ఉంటాయి. ఇతని ప్రభావం యువతరం వారిమీద విపరీతం. నే నున్న glade లో యితను చేసిన స్కెచ్ యొక్క ఫోటోగ్రాఫు ఉంది. అది ఇంటిలో నిలుచున్న మనిషి. కెయాన్ స్కెచ్. ఎంతసేపు చూచినా నివితీరదు. ఇతని రేఖల నడక అద్భుతం.

రుఫెనో తమాయో మెక్సికన్ చిత్రకారుడు. మెక్సికోలో ఉన్న నలుగు రైదుగురు ప్రపంచ ప్రసిద్ధ చిత్రకారులలో యితను ఒకడు. ఇతను మెక్సికో, అమెరికాలలో చాల భవంతులలో ఫ్రెస్కోలు, చిత్రాలు చిత్రించాడు గోడలపై. ముఖ్యంగా మెక్సికన్ జానపద కళను ఆధారంగా తీసుకొని అభివృద్ధిపరచుకున్నాడు తన శైలిని. "నీడలో ఉన్న ఆకారాలు" అని రెండు నిలచున్న ఒక ఆడ, ఒక మగ ఆకారాలున్న చిత్రం. ఇతను ఎరుపు ఇటుకరంగు, నలుపులను అత్యంత ఆహ్లాదంగా మిశ్రమంచేసి చిత్రిస్తాడు. ఏదో విధమైన భయానక సూచనలు అగుపిస్తాయి రంగులలో. అరుస్తున్న నక్కలు, చీమకళ్ల, తలల మనుష్యులు లాంటి చిత్రాలు చూచాక ఇతను భయాన్ని చిత్రాలలో చొప్పించాలని యత్నిస్తున్నట్లు అగుపిస్తుంది నాకు. ఇతను పాలెట్ నైఫ్‌ను కాన్వాస్‌పైన నడిపించడం ఒక అద్భుతం. పాలెట్ నైఫ్‌తో (కుంచెకు బదులుగ) వాడుతూ మిశ్రమం చేసిన రంగులు (కాన్వాస్ పైనే) ఎంతో బాగుంటాయి. ఇతను మెక్సికోలో, అమెరికాలో బహు ప్రచారంలో ఉన్న చిత్రకారుడు ప్రస్తుతం.

ఇక న్యూయార్క్‌లో నివసిస్తున్న మన భారతీయ చిత్రకారులు మోహన్ సమంత్. ఇతను ఇండియాలో ఉండగనే ప్రసిద్ధిలో ఉన్నవాడు. యువకుడు, కాని మన ఎం. ఎఫ్. హుస్సేన్, కె. కె. హెబ్బరు లంత ప్రసిద్ధిగాదు. అంటే మొదటిరకం ఇండియా హేమాహేమీల తరగతిలో లేడన్న మాట ఇండియాలో ఉండగ. రంగులు కాంతివంతంగా ఉండేవి యితని చిత్రాలలో. ఢిల్లీలో చూచాను ఇతనివి చాల చిత్రాలు లోగడ. ఇక్కడ ప్రదర్శింపబడినది "సూర్యుని రథం" అన్న చిత్రం చాలా పెద్ద సైజుది. నిమ్మపండు రంగులో చిత్రించాడు కాన్వాసంతా. చిత్రాన్ని రెండుగ విభజించాడు వెడల్పయిన కుంకుమరంగు బద్దీలవంటి చారలతో. దిమ్మలాగ ఉన్న ఈ దీర్ఘ చతురస్రము క్రింద చక్రాలు ఉన్నాయి లేత ఎరుపు రంగులో. నే ననుకోవడం సూర్యరశ్మిని ముఖ్యంగా ఉద్దేశ్యంలో ఉంచుకొని చిత్రించినదని తలుస్తాను. కాన్వాసుపై సన్నని మెత్తని యిసుక మందంగా పోసి ఆరిన తర్వాత దానిపై నిమ్మపండు పసుపు రంగు వేసాడు. ఒకవిధంగా రిలీఫ్ చిత్రం క్రిందకు వస్తుంది యిది. ప్రదర్శనలో దీన్ని అంతగా ఎవరు పట్టించుకున్నట్లు లేదు. ఈ ప్రదర్శన దేశాలవారిగ ఎన్నిక చేసి ప్రదర్శించినదిగాదు. అయినా మన యిండియన్ చిత్రకారులలోని అవినాష్‌చంద్ర చిత్రంగాని, ఎస్. ఎస్. సూజా చిత్రంగాని ఉంటే చాల బాగుండేది. ఇండియాకు తగిన స్థానం ఉండేది ప్రదర్శనలో. ఏది ఏమయితేనేం భారతీయునిగ నాకు చాల సంతోషము గల్గింది మన భారతీయుని చిత్రం గూడ ప్రదర్శనలో ఉండడం.

ఇక అమెరికన్ చిత్రాల సంగతి. మంచివి ఉన్నాయి వీరివి. ఇరువదవ శతాబ్దంలో ఎంతో ప్రజ్ఞతో ముందుకు పరుగెడుతున్న అమెరికన్ చిత్రకళ ప్రపంచాన్ని విస్తరించింది. "అబ్‌స్ట్రాక్ట్ ఎక్స్‌ప్రెషనిజమ్", "పాప్ ఆర్ట్" అను కసుగొన్న కీర్తి అమెరికాకే దక్కింది. ఈ పాప్ ఆర్ట్ యూరప్ అంతా విజృంభించింది. ముఖ్యంగా యువ చిత్రకారులలో. ఒక క్రొత్తదనంతో ఎప్పుడూ ఊహించని పద్ధతిలో సాగుతున్నది ఈ శైలి. మనం నిత్యం చూచే వస్తువులనే పేర్చి చిత్రాలు చేయడం, కనుపించిన సిగరెట్టు పెట్టు, సినిమా పోస్టర్లు, ఎడ్వర్టయిజ్‌మెంట్సు యిలా ఏది బడితే దానిని తిరిగి చిత్రిస్తారు కాన్వాస్‌పై. అంటే ఈ పద్ధతిలో ఆశ్చర్యానికి, నవ్వుకు ప్రాధాన్యత ఉంది. ఈ చిత్రాలు చిత్రించడానికి చాలకాలం పడుతుంది. ఆకారాన్ని, రంగులను ఉన్న

# ఢన్ అంతర్జాతీయ చిత్రకళా ప్రదర్శనము

ఉన్నట్లు చిత్రించాల్సిన అవసరం చాల ఉంది. ఈ క్రొత్త పాప్ చిత్రకళకు మూల కారకుడు రాబర్ట్ రోషన్‌బర్గ్ అంటారు. ఇతను టెక్సాస్‌లో జన్మించాడు 1925 లో. ఇతని చిత్ర ప్రదర్శన యిప్పుడు మొదటిసారిగ లండన్‌లో జరుగుతున్నది. పేపర్లు, టెలివిజన్ మంచి ప్రచారం యిచ్చాయి. ఇతని చిత్రాలలో విశేషం ఏమంటే చిత్రాన్ని రెండు మూడు విడివిడి చిత్రాలుగ విభజించడం. అలా విభజించి దూర దూరంగా ఉంచి వీటిని త్రాళ్లతోను, గొలుసులతోను కలుపు తాడు. టైలు, చెక్కముక్కలు, లేక నిజమైన అలారం టైంపీస్‌లు, పనిచేస్తున్న యంత్రభాగాలు యిముడుస్తాడు చిత్రంలో. చిత్రంలోనే గడియారం పనిచేస్తుంటుంది. విచిత్రం గదూ ! ఇవి చిత్రాలో, శిల్పాలో చెప్పలేను. కాని, వీటి ప్రభావం చూచేవారిమీద బలంగా ఉంటుంది. ఇంత వరకు మనకు చిత్రమంటే ఒక కాన్వాస్‌పై చిత్రించడము ఆకారాలో, వికారాలో. కాని, ఆ భావాన్ని పూర్తిగా విసర్జించి అక్కడక్కడ ఏర్పరచి పలు చిత్రాల్ని అన్నిటిని కలిపి ఒకే చిత్రంగా ఎందుకు చూడగూడదు. అన్న భావనను తెచ్చిన సాహసి. కాని ఇలా చేసి విజయం సాధించడం చాల కష్టతర మైన విషయం. అతనికి గూడ ఎరుపు, ఆకుపచ్చరంగు లంటే చాల యిష్టం.

ప్రసిద్ధ అమెరికన్ చిత్రకారులు రాబర్ట్ మదర్‌వెల్, మార్క్‌టోచి, బెన్‌షా, లాకి రివర్స్, జేమ్స్ మూక్‌గ్రిల్, జాక్ లెవిన్, విలియమ్ డి కూనింగ్, కితాజ్, ఎల్స్‌వర్త్ కెల్లీ, రాబర్ట్ ఇండియానా, అడాల్ఫ్ గోటిలెబ్, ఎడ్విన్ డికెన్‌సన్ ఇంకా చాలామంది ప్రదర్శించారు. ఇంత మంచి ప్రముఖాతి ప్రముఖుల చిత్రాలు చూడడం ఒక్కచోట మహా భాగ్యం. అందరు ఎవరికి వారు విడిగా తను స్వంత శైలిని సృష్టించు కున్నవారే.

స్టూవర్ట్ డేవిస్ పేరు తెలియనివా రుండరు కళా రంగంలో. 1894 లో ఫిలడెల్ఫియాలో జన్మించాడు డేవిస్. ఇతని చిత్రాలలో అక్షరాలు, అంకెలు ఉంటాయి చిత్రించి. ముఖ్యంగా కానవచ్చేది బలమైన జానపద రంగుల మాదిరి



సెంటు జాన్ నది, కుక్క, కుఱ్ఱవాడు

చిత్రకారుడు : అలెక్స్ కోల్ విల్లే.

ముతుక రంగులు. రెండు మూడు రంగుల కంటె ఎక్కువ వాడడు. అవి అయినా దేనితోను మిశ్రమంచేసి కాదు, వేటికవే ప్రత్యేకంగా చిత్రించబడి ఉంటాయి. చాలా వెడల్పయిన రేఖలతో, ఏదో వాస్తు శాస్త్రజ్ఞుడు బిల్డింగ్ ప్లాను వేసుకునే ముందు బిల్డింగులో కిటికీలు ఎక్కడ ఉండాలి, ద్వారాలు, బీరువాలు ఎక్కడెక్కడ ఉండాలి అని ఊహించి వేసిన చిత్రంలాగ ఉంటుంది. ఇక్కడ ప్రచురించిన చిత్రం 'బజారు'. మనం వీధిలో ఉన్న వివిధ రకాల షాపులు, వాటికుండే ఎడ్వర్‌టైజుమెంట్లు, లైట్లు అన్నీ చూడవచ్చు. ఒక్కొక్కసారి యితని చిత్రాలు, లిపాపేలు వేయడానికిగాని, పెద్ద పెద్ద కిటికీ తెరగుడ్డలకు గాను డిజైనులు యిమ్మని బట్టలమిల్లు అడిగితే వేసాడా యివి అనిపిస్తుంది.

ఆస్కార్ కొకోష్కా ఆస్ట్రియాలో జన్మించాడు. ఇక్కడ అక్కడ ఎక్కడ బడితే అక్కడ యూరప్‌లో నివసించాడు. ఇప్పటి ఆధునిక కళ అంటే అంతగా నచ్చదు ఈయనకు. ఈయన చిత్రాలు గూడ స్కెచ్చస్ లాగ ఉంటాయి. ఇతని చిత్రాలను రెండు మూడు శైలులుగ విభజించవచ్చును. ఈయన చిత్ర ప్రదర్శనం ఇక్కడ జరిగి ఎంతో విజయవంతమైనది. త్వరలో దాన్ని గురించి వ్రాస్తాను. ఇప్పటి ప్రదర్శనలోని చిత్రం "థేమ్స్ నది దృశ్యం." అన్నది. 1959 లో చిత్రించాడు దీన్ని. చాల వేగంతో చిత్రించడం యితని స్వభావం. ఎన్ని రంగు లున్నాయో అన్నిటిని వాడతాడు చిత్రాలకు. స్కెచ్చస్ వేస్తాడు. దాన్ని చెఱుపుతాడు. గుడ్డతో మరల వేస్తాడు, మరొకటి వేస్తాడు. ఇలా చిత్రించిన దానిపై మరల చిత్రించడంవల్ల చూడడానికి సరిగ్గా స్కెచ్ గూడ వెయ్యడంచేత గాదేమిటి అనిపిస్తుంది. ఇది ఇతని శైలి. ఇతని చిత్రాలు నాకు యింప్రషనిస్టు మానే చిత్రకారుని జ్ఞప్తికి తెస్తుంది. ఇతని చిత్రాలలో ఎక్కువగ ప్రకృతి దృశ్యాలకు ప్రాధాన్యత ఉంటుంది. దాదాపు యూరపులో ప్రతి నగరాన్ని చిత్రించా డనుకుంటాను. పోర్ట్రెయిట్స్ వేయడంలో చాల ప్రసిద్ధి. అవిగూడ యిలాగే చిత్రిస్తాడు. ఇతనికి చేతివ్రేళ్ళు వేయడం అంటే యిష్టం బాగా. అందుకనే యితను వేసిన పోర్ట్రెయిట్స్ చూస్తే చిత్రంలోని వ్యక్తి ముఖం కంటె అతని చేతివ్రేళ్ళు వేయడానికి ఎక్కువ శ్రద్ధ తీసుకున్నాడా అనిపిస్తుంది. ఏవో భంగిమలతో ఉన్నట్లు ఉంటాయి. ఆ చిత్రించిన చేతులు, వ్రేళ్ళు గూడ. ఈనాడు ప్రపంచ ప్రసిద్ధ తొమ్మిది పది మంది చిత్రకారులలో ఈయన ఒకడు. ఈతని చిత్రాలు చూస్తూ మనం ఎంత కాలమైనా గడపవచ్చు. చాల సాత్వికుడు మనిషి.

బ్రాక్ మామూలుగ వేసే ఆయన స్టిల్ లైఫ్ చిత్రాన్ని ప్రదర్శించాడు. జాన్ మిరో చిత్రం ఒకటి దేనితో కలువకుండ ప్రదర్శనలో విడిగా ఉంటుంది. ఇతను గూడ స్పెయిన్‌లోనే జన్మించాడు 1893 లో. ఇక్కడ ప్రదర్శించిన చిత్రం ఒక బాలిక. పెద్దపెద్ద గుండ్రని (మన పూరి జగన్నాథుని కండ్లలాంటి) కండ్లతో నిలుచున్నది. ఇతను గూడ ఎక్కువగ నీలం, ఎఱుపు, పసుపు, తెలుపు రంగులను వాడతాడు ముఖ్యంగా చిన్నపిల్లలు గీసే చిత్రాలకు ఇతని చిత్రాలకు అసలు తేడా ఉండదు. ఇతని చిత్రాన్ని చూపి ఇది ఏ 4 వ లేక 5 వ తరగతి పిల్లలు వేసారంటే ఎవరూ నమ్మకుండా ఉండలేరు. అలా కనుపిస్తాయి చూడడానికి. మన గ్రామాలలో కొన్ని గుడిసెల గోడలకు సున్నంతో రకరకాల ముగ్గులు, బొమ్మలు వేయగా చూచాను. ఎక్కువగ నాకు మన ఆంధ్రలో కంటే ఒరిస్సాలో కనుపించాయి యిలాంటి మనుష్యుల బొమ్మలు యిండ్ల గోడలకు. ఇతని రంగులు ఎక్కువగ నల్లని బ్యాకుగ్రౌండులో కనిపిస్తాయి. దీపావళి రోజులలో వెలిగించిన రకరకాల రంగురంగుల ప్రేలిన అవ్వాయి సువ్వాయిలు ఎలాగ కనుపిస్తాయో నల్లని ఆకాశంలో పైకెగిసి అలా ఉంటాయి అతని చిత్రాలు నల్లని బ్యాక్‌గ్రౌండులో. ఈమధ్య చాల లితోగ్రాఫులు తీసాడు. నాకు ఇతని చిత్రాల కంటె లితోగ్రాఫులే బాగుంటాయి. పారిస్‌లోని యునెస్కో బిల్డింగుకు కూడ చిత్రరచన చేశాడు. ఇతని చిత్రాలు ముతుక రంగులలో, దారములాంటి సన్నని గీతలలో పిల్లలు వేసిన ఆకారాల లాంటి చిత్రాలతో మనల్ని చిన్నపిల్లల్ని చేస్తాయి. మరచిపోయిన మన బడిని, ఆనాడు మనం వేసిన బొమ్మల్ని జ్ఞప్తికి తెస్తాంి.

సహజరూప చిత్రాలలో అమెరికన్ ఎడ్విన్ డికిన్‌సన్ చిత్రం ఎంతో అమోఘంగా ఉన్నది నాకు ఇతని చిత్రాల్ని గోయా చిత్రాలతో పోల్చవచ్చునని అనిపిస్తుంది. ఒక గదిలో కూర్చొని వివిధ రకాల సంగీత వాద్యాలను వాయిస్తున్నవారి చిత్రం. పెద్ద చిత్రం. ఇతను వాడిన ఆకు పచ్చని రంగుల తెలుపుల మిశ్రమం అద్భుతం. గోయా ఎంతో ప్రజ్ఞతో టెర్రావర్టా ఆకుపచ్చ రంగును వాడతాడు. మరల ఈనాడు డికిన్‌సన్ వాడగలిగాడు అలాగ. బహు సున్నితమైన రంగుల మిశ్రమంతో, ఒకవైపు నుండి వస్తున్న వెలుతురును చిత్రించాడు. వాద్యాలపై, మనుష్యులపై. ఎంతసేపు చూచినా తనివితీరని ఆనందాన్ని యిస్తుంది. ఇక్కడ ఉన్న రిచర్డ్ డిబెన్‌కర్న్, జేమ్స్ మేక్‌గ్రెల్, ఎడ్వర్డ్ హాపర్ (అమెరికా) లూసిన్‌ఫ్రాయిడ్ (జర్మని) బాల్తస్ (ఫ్రాన్స్) పార్‌డిలావాక్

(బ్రసెల్స్) మొదలగు సహజ రూప చిత్రకారుల చిత్రాల కంటే ఎంతో బాగుంది డికిన్‌సన్ చిత్రం. ఇదొక్కటే సహజరూప చిత్రం. ప్రజ్ఞతో గూడినది. ప్రదర్శన అంతటి లోకి. ఇతను అమెరికాలో చాల ప్రసిద్ధ చిత్రకారుడు. బహుమతి కెనడియన్ చిత్రకారునికి యివ్వడం కంటె యితనికి యిచ్చి వుండవలసింది.

ఇంకా డుబుఫే (ఫ్రాన్సు) మాక్స్ ఎర్నెస్ట్ (జర్మని) సిడ్నీ నొలాన్, ఆర్థర్ బాయిడ్ (ఆస్ట్రేలియా) హెరాల్డ్ టేన్ (కెనడా) కెన్జో ఒకాడా (జపాన్) హాన్స్ హార్టుంగ్ (జర్మని) మొదలగు ప్రసిద్ధ చిత్రకారులు మంచి చిత్రాల్ని ప్రదర్శించారు.

ఇక ఇంగ్లీషు చిత్రకారులలో గ్రహం సదర్‌లాండ్, పెర్రి రిచర్డ్స్, జాన్ పైపర్, విక్టర్ పాస్‌మోర్, లౌరి, పీటర్‌బ్లేక్, ఆలన్ డేవిడ్ ప్రదర్శించారు. అందరు పాతవారే. చూచిన చిత్రాలే దాదాపు అన్ని యిదివరకు. వారి చిత్రాలు మారవు. పేరు వచ్చిన శైలితోనే మరల మరల చిత్రాలను వేస్తూ కాలక్షేపం చేసే చిత్రకారులు అందరు. క్రొత్తదనం ఏమీ లేదు, ఒక ఆలన్ డేవిడ్‌లో తప్ప. ఆలన్ డేవిడ్ స్కాట్లండ్‌లో పుట్టాడు. ఇతని చిత్రాలు చూస్తే మార్క్ చాగల్ చిత్రాలలోని రంగులు కనిపిస్తాయి. అవే ఎఱుపు నీలి రంగులు. ఇతనుగూడ ముతకగ వాడతాడు రంగుల్ని. స్టెయిన్డ్ గ్లాస్ విన్డోస్ కొఱకు వేసిన చిత్రాలా అనిపిస్తాయి. ఒక రూపం ఉండదు. జాన్‌మిరో ఆకారాలు (బండగా) ఆఫ్రికన్ మాస్కుల చారలు యివన్నీ మిళితంచేసి జానపదుల ముతుక రంగులలో వేస్తాడు చిత్రాలు. చూడగనే కొట్టవచ్చినట్లు ఉంటాయి చిత్రాలు. ఇది అసలు వేసే పద్ధతి యితనిది. కాని, ప్రదర్శనలోది మాత్రం విడిగా ఉంది. రకరకాల యంత్ర భాగాలు అన్ని దగ్గర దగ్గరగా కూర్చి చేసిన పెద్ద చిత్రం. మసక చీకటిలో మినుకు మినుకు మంటున్న దీపపు కాంతిలో ఉన్న పాంగ్రిడి షాపులాగ ఉంది చిత్రం. ఎప్పుడూ వాడని బ్రౌన్, నలుపు, క్రిమ్సన్ రంగులు వాడాడు. దీన్ని యిప్పుడు టేటు గాలరి కొన్నది.

ఇంకా వ్రాస్తే చాలమందిని గురించి వ్రాయవచ్చు. ఈ పైనా రందరు పేరున్న చిత్రకారులు అంతకంటే ముఖ్యంగా క్రొత్త క్రొత్త పంథాలను త్రొక్కినవారు. వీరి కృషి వలననే ఎన్నో రకాల క్రొత్త "యిజము" లు కళారంగంలో మరల రావడానికి అవకాశం ఉంది. ఈ ప్రదర్శన మన దేశంలోకి తెచ్చి ప్రదర్శిస్తే బాగుంటుంది. ఇప్పటివరకు ఇండియాలో హేమాహేమీలనుకుంటున్న (వారికి వారే) చిత్రకారులకు కనువిప్పు కల్గుతుంది. యువ చిత్రకారులకు అసలు ఆధునిక చిత్రకళంటే ఏమిటో తెలుస్తుంది. లేకపోతే యింకా పుస్తకాలలో బొమ్మలు చూచి అనుకరించో, అనుసరించో చిత్రాలు వేసే రాత తప్పదేమో. ఇటువంటి ప్రదర్శనలు దేశంలోకి తేవాలని మన కళా ఎకాడమీలు ప్రభుత్వానికి నచ్చచెప్పి వప్పించాలి. లేకపోతే మన ఆధునిక చిత్రకళ, చిత్రకారులు ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉన్నట్లు ఉంటారు.

ఇప్పుడు మన దేశంలో ఫ్రాన్స్ పుణ్యమా అంటూ ఏర్పరచిన చిత్రకళా ప్రదర్శన చాలమందికి కనువిప్పు అయి ఉంటుందని ఆశిస్తాను. ఇంకా ఇంకా ఇతర దేశపు ప్రదర్శనలు మన దేశంలోను, మన దేశపు ప్రదర్శనలు ఇతర దేశాలలోను జరుగుతే చాల మంచిది.



# "లోపడు" సాధువు కానేరదు

శ్రీ వంతరాం రామకృష్ణారావు

శ్రీ రావూరి దొరస్వామిశర్మగారి "లోపడు—అసాధువు కాదు"—అను వ్యాసము గడచిన డిసెంబరు నెల భారతిలో ప్రకటితము. 'లోపడు' అను రూపము మూడు విధములుగా నేర్పడ వచ్చునని శ్రీ శర్మగారు ప్రక్రియలు చెప్పినారు. ఆ ప్రక్రియ లెట్లున్నవో వరుసగా పరికింతము.

(1) లోను + పడు=లోఁబడు—అని ప్రాంతాది సూత్రములచే అగును. లోను + పడు—అనుచో ఆగమశాస్త్ర మనిత్యము కాన, లుప్త శేషమునకు నుగాగమము రాకపోవచ్చును. అప్పుడు లోను + పడు=లోపడు—అగు ననుటలో వింత లేదు.

వింత లేదన్నారు గదా! మీఁదు + కడ = మీకడ—అగునా? ఆగమశాస్త్ర మనిత్యముగదా! మరి యేల కాదు? అసలు లోను + పడు—అన్నది ప్రాంతాది సంధికి లక్ష్యమగునా? ప్రాంతాది సంధి సమాస విషయకమని లక్ష్యములే కాక, సూత్రమునందలి 'సమాసంబునన్' అను ప్రథమ దళమే చెప్పుచున్నది. లోను + పడు—సమాసము కాదు గదా! మరి యీ ప్రక్రియ యెట్లు సరిపడును?

(2) లోపడు—శబ్దపల్లవము. వర్ణలోపాది కార్యములు శబ్దపల్లవములందు కలుగును. అనగా లోను + పడు—అనుచో వర్ణలోపము వచ్చి, లోపడు—అగునన్నమాట.

శబ్దపల్లవములలో వర్ణ లోపాదులు వచ్చుననుట నిజమే. "లోను—మ్రాను వంటిది" అని శ్రీ శర్మగారే సెలవిచ్చినారు. మ్రాను + పడు = మ్రాపడు—అగునా? కాదా? అది మ్రాపడు—కానప్పుడు ఇది 'లోపడు' ఎట్లగును? వర్ణలోపము కలుగవచ్చును గదా! యని 'ను' వర్ణము తీసివేయుటేనా?

అసలు 'లోనుపడు' శబ్దపల్లవ మనుట చిన్నయసూరికి సమ్మతము కాదని తోచును. లోను—మ్రాను వంటిదని శ్రీ శర్మగారే చెప్పినారు. మ్రానుపడు—ఎట్టిదో లోనుపడు—అట్టిదే. మ్రానుపడు—శబ్దపల్లవములలో చేర్చబడలేదు. "పదాంతంబులయి యసంయుక్తంబు లయిన ను—లు—రు—ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు (బాల. ప్రకీర్ణక 16 సూ.) మ్రాన్పడు, మిన్పడు—అని సూరి సూత్రించి యుదాహరించెను. ఇట్లితరత్ర సాధింపబడిన రూపములను శబ్ద పల్లవములనుట సూరికి సమ్మత మనిపింపదు. శబ్దపల్లవముల కిచ్చిన యుదాహృతులలోను వర్ణాంత శబ్దము తోడిది యొక్కటియును లేదు. "శబ్ద పల్లవంబగు పడున కించుక్కు విభాషనగు, నగుచో డాకు లఘు రేఫంబగు' (బాల. క్రియా 83 సూ.) అను సూత్రమొకటి బాలవ్యాకరణమున కలదు. లోనుపడు, లోఁబడు—అనునవి శబ్దపల్లవము లయినచో లోనుపడు + ఇంచు=లోనుపరించు, లోఁబడు + ఇంచు = లోఁబరించు—అను రూపములు పాక్షికముగ నేర్పడవలసి యుండును. ఇట్టి రూపములు లేవు. లోనుపఱుచు, లోఁబఱుచు—అను రూపములు మాత్రమే కలవు. లోనుపడు, లోఁబడు అనునవి శబ్దపల్లవము లన్నచో నీ యనర్థము దుర్వార మగును. కాన సూరి మతమున నివి శబ్దపల్లవములు కావనుట యుక్తమని తోచుచున్నది. శబ్దపల్లవమన్నను 'ను' వర్ణ లోపము చేయరాదని చెప్పియే యున్నాను.

(3) లోకి—అను రూపమును బట్టి 'లో' అను ప్రథమాంతము సిద్ధించును. అప్పుడు లో + పడు = లోపడు—అగును.

'లోకి' అప్రామాణిక రూపము. "ఉన్నది. గంగదాసు మహాకవి ప్రయోగ మున్నది" అను వాక్యమును తలపించు ప్రయోగము లొండు రెండు దీనికి లేకపోలేదు (హంస 3—92, 4—49) 'లోకి' అను అసాధువు ప్రయోగము నాధారముగా చేసికొని సాధించు 'లోపడు' శబ్దము—అసాధువు కాక సాధువెట్లగును? ప్రామాణిక భాష వ్రాయ బద్ధ దీక్ష వహించిన శ్రీ తుమ్మలవారి 'ప్రయోగమును 'లోకి'తో సమర్థింప యత్నించుట మహాపచారము.

'లోపడు' సాధు వనుటకు చెప్పబడిన ప్రక్రియలు సక్రమముగా లేవని సారాంశము. ఇక 'లోఁబడు' రూపమునకు నేను చెప్పిన ప్రక్రియ యెట్లు సక్రమమో మనవి చేసెదను.

'లోఁబడు' అను రూపమునకు చింతామణి వికృతి వివేకముల ననుసరించి నేను నా పూర్వ వ్యాసములో ప్రక్రియ చెప్పియున్నాను. ఆ ప్రక్రియను శ్రీ శర్మగా రిట్లాక్షేపించినారు. "లోను—ఉత్వ లోపముచే ద్రుతాంతము కాఁజాలదు. లోను—మ్రాను వంటిది. మ్రాను + పడు=మ్రాన్పడు — అగును గాని

ప్రూన్పడు, ప్రూంబడు— అని కాదు గదా ? అట్లే లోను + పడు—అను ఉత్వలోపముచే, లోంబడు—అని కాజాలదు.''

లోను—ప్రూను వంటిది కదా ! ప్రూను + పడు = ప్రూన్పడు—అయినది గాని 'ప్రూపడు' కాలేదు గదా ! మరి లోను + పడు=లోన్పడు— కావలెను గాని 'లోపడు' ఎట్లగును? ఇత్యాది విచారణ శ్రీ శర్మగారికి కలుగలేదు !

నన్నయాథర్వణుల మతమున ఆవయవిక నకారము స్వైతము ద్రుతమే 'కపిభల్లస్వైః' ఇత్యాది సూత్రముచే లోను + పడు=లోన్ + పడు—అగును. 'ద్రుతాఖ్యోనః' అను సూత్రముచే 'లోన్' లోని ఆవయవిక నకారము ద్రుతమే. కాన 'లోంబడు' అను రూపము సిద్ధించును. విస్తరమునకు— చూడుడు. చింతామణి—విషయ పరిశోధనము—125 విషయము, వ్యా. సం. సర్వ—విస్తర 44 విషయము. బాల వ్యాకరణ మతమున ఆవయవిక నకారము ద్రుతము కాదు. కాన ప్రకీర్ణక 16 చే ఉత్వము లోపించినచో ద్రుత కార్యములు జరుగవు. లోను + పడు—అనుచో ఉత్వము లోపించె నన్నచో లోన్పడు—కావలసినదే ! లోన్పడు—అను రూపము లేదు గన ఉత్వ లోపము రాదనియు, సూత్రమున బహుళ శబ్ద ముండుట ఇందుకు సాధక మనియు గ్రహింపవలెను. కాగా బాల వ్యాకరణ పక్షమున 'లోనుపడు' అను రూపమే సిద్ధించును. 'లోంబడు' బాల వ్యాకరణ సాధ్యముకాదు. ఆవయవిక నకారము ద్రుతమను చింతామణి మతముననే 'లోంబడు' కుదురుపడును. అందు చేతనే, చింతామణి ననుసరించి ప్రక్రియను చెప్పి యున్నాను.

చింతామణి మతము ననుసరించి చెప్పబడిన 'లోంబడు' ప్రక్రియను బాలవ్యాకరణ మతము ననుసరించి సక్రమముగా కన్పట్టదని శ్రీ శర్మగా రాక్షేపించినారు. ద్రుత విషయమున, చింతామణి బాల వ్యాకరణములకు గల మతభేదము శ్రీ శర్మగారికి ఆకళింపు కాలేదు.

లోంజెయ్యి—మున్నగు ద్రుత కార్యములు కన్పట్టు వర్గ మును లోను + చెయ్యి—అని నిఘంటువులు పదచ్ఛేదముచేసినవి. 'న' వర్ణాంత శబ్దముతో పదచ్ఛేదము చేయునప్పుడు ద్రుత కార్యములు సహేతుకము లగునని నిఘంటువు లిట్లు పదచ్ఛేదము చేసినవి. లోచూపు—మున్నగు వర్ణలోపము మాత్రమే కన్పట్టు వర్గమును లోపల + చూపు—అని పదచ్ఛేదము చేసినవి. ''లోపల + చూపు—అను పదచ్ఛేద పక్షమున మాత్ర మేల ప్రాంతాది సంధి నుగాగమ విధి వర్తింపదో'' అని శ్రీ శర్మగారు సందేహించిరి. ఇట్టివి ప్రాంతాది సంధికి విషయములు కావు. కావుననే నుగాగమ విధికి ప్రసక్తి లేకపోయినది. ఇట్టివి 'సిక్కాలాది' (బాల. సమాస 20) సూత్రమునకును, దాని వివరణమే యగు ప్రౌఢ—సమాస—36వ సూత్రమునకును లక్ష్యములు.

లోంబడు' అనియే హరిశ్చంద్ర నలోపాఖ్యానమున ప్రయుక్తమని సోపపత్తికముగా నిరూపించినను శ్రీ శర్మగారికి అదేమియు పట్టలేదు. ''ఈ రెంటికిని (లోంబడు, లోపడుల రెంటికి) ప్రాసస్థల ఘటిత ప్రయోగము లన్వేషణీయములు' అన్నారు. ఈ వాక్యమునకు తాత్పర్య మేమనుచున్నదో శ్రీ శర్మగారు గుర్తించియే యున్నచో ''లోనుపడు, లోపడు, లోంబడు అను మూడు రూపములు సాధువు లనుటలో విప్రతిపత్తి యుండదని సారాంశము'' అని యెట్లు వ్రాయగలరు ? — లోంబడు, లోపడు లను రెంటికి ప్రయోగము లన్వేషణీయము లైనప్పుడు, రెండింటి సాధుత్వము సందేహాస్పద మగును గాని, రెండును సాధువులని యెట్లు సారాంశము సిద్ధించును ? లేఖన సారాంశ మొకటి, తేలినదన్న సారాంశము వేరొకటి !! ''అదిలో చెప్పినట్లు మన వ్యాకరణములు ప్రయోగములకు కదా'' అని ప్రక్రియల మధ్యలో ప్రకటించిన, పరిజ్ఞాన మొక వంక. ప్రాచీన ప్రామాణిక ప్రయోగము చూపకయే, లోను + పడు= లోపడు—అగు ననుటకు చెప్పిన, అపరిజ్ఞాన మూలకములగు ప్రక్రియలు మఱియొక వంక. శ్రీ శర్మగారివంటి పెద్ద లిట్టి వంకర మార్గముల నవలంబించుట నిజముగా బాధకర మైన విషయము.

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు నవంబరు భారతిలో 'లోంబడు' రూపమును నిర్వహించు ప్రయోగములను మఱి రెండింటిని చూపియున్నారు. కాన శ్రీ శర్మగారు ''వ్యాకరణ శాస్త్రమును బట్టియు, కవుల ప్రయోగములను బట్టియు, 'లోంబడు' అనునదే సాధు రూపమని'' గుర్తింతురు గాక ! 'లోపడు' సాధువు కానేరదని యిప్పటికైనను గ్రహింతురుగాక !!

[ఇంతటితో ఈ చర్చకు స్వస్తి—భా. సం]

# అంతరాంతరం

శ్రీ విహారి - శ్రీ శాలివాహన

శారద చంద్ర చంద్రికలు ధాత్రీ మహాదేవి మేని యందానికి వింత చందం కూరుస్తున్నాయి

గుడిసెలో బహు దగ్గరలో పడుకున్న వారిద్దరూ ప్రక్కకు ఒత్తిగిలేరు. అసంకల్పంగా ఒకరికొకరు ఎదురెదురైనారు.

డొంక కిరువైపుల—పచ్చని పట్టు తివాచీ పరచినట్టున్న ఒకపంటచేను, మసాణివంటి ఒక చౌటి బీడు. వాటి ఉనికిలో వ్యత్యాసం అతిస్వల్పం. ఔన్నత్యంలో అంతరం మాత్రం అనల్పం.

సంబరం పొంగులు వార తలవూపి ఉప్పొంగిపోవలసిన సమయంలో — చలనంలేక అంతస్పంచలనానికి తలవంచి సతమత మవుతున్నది పసిడి పసి హృదయం.

ప్రపంచపు రణగుణ ధ్వనుల్ని లక్ష్యంచేయక ఆదమరచి నిద్రించవలసిన ఆ బుడుతడి చిరుకన్నులు— చింత నిప్పులుగా వేయి మరుత్తులొకట్టై వెలిగినట్లు వెలిగి పోతున్నాయి.

గోవిందు మనస్సు కళ్ళెం లేని గుర్రమైంది.

"తాత తనకీ పేరు పెట్టినప్పుడే పళ్లు నూరేడంట అయ్య. ఊః—. నూరకేం చేస్తాడు? — రోజా గేదెల్ని నరకటానికి కత్తి నూరటంలో మొనగాడు గదా?. తాత చేసింది పెద్ద తప్పని అప్పుడే తనని చంపేస్తానన్నాట్ట.

'ఆడు నా పేణం. ఆణ్ణి చంపాలంటే ముందుగా నన్ను మట్టు పెట్టాలిరా' అని తాత కళ్ళెరిమితే సప్పబడినాడంట— చేతగాని దద్దమ్మ!

తాత మాత్రం తక్కువ తిన్నాడా?—

తనకు సదువుకునే ఈడొచ్చాక 'ఆడికి ఉరుదూ చెప్పిస్తే నే చస్తానని' మోడీకేసిండు. 'ఉరుదూ అంటే ఏంది తాతా'! అంటే, 'అదేరా, మా అయ్యా, అమ్మ మాట్లాడే బాస' అన్నాడు.

ఆ బాసలో తనకి 'మా—బాబా' అని రెండు మాట లొచ్చినందుకే కసురుకుంటాడు తాత. 'నువ్వాళ్ళ మాట్లాడే మాటలు యినిపించుకోకు చిన్నా' అని బుద్ధులు చెప్పి తనకా బాస రాకుండా సేశాడు. ఇదీ అయ్యకు పడలేదు.

అసలిదనేందిలే?— తనంటేనే అయ్యకు కసి. తనను తెలుగు బళ్ళో ఏసినప్పుడూ పెద్ద బాగోతం చేసిండ్రు— అయ్యా, ఆడి మురా.

అయితే ఏం?— తాత తన పంతం గెల్చాడు. లేకపోతే తనిప్పుడెట్టా 'రెండు' సదువుతూ ఉంటాడు. ఆరి దీని యుబ్బ! మళ్ళీ సదువు అనే వచ్చిందే. సదువు అన గొళుదుఃరా 'చదువు' అనాలని ఆ సత్తి మేష్టారు చెప్పారుగా. ఆయనకు 'డు' రాదు. పాపం. డు ఎక్కడొచ్చినా 'ళు' అంటూవుంటాడు. బలే మేష్టార్లే!

సణుగుడు తాత్కాలికంగా సద్దుమణిగి సన్నని చిరు దరహాసరేఖ విరిసింది—గోవిందు అధర పల్లవంమీద. తల క్రింద పెట్టుకున్న కుడిచేయి తిమ్మిరెక్కింది. నెమ్మదిగా తీసి బాగా విదిలించాడు. ఎదురు మంచంమీద గురక పెడుతూ ఉన్న తండ్రివైపు చూచాడు.

"చూడు. ఎంత లావు చేతులో—తుమ్మ మొద్దుల్లాగా. పేణం పోయేటట్టు కొట్టాడు." గోవిందు ముఖం కోపంతో కందగడ్డలా అయింది. చేత్తో వీపు నిమురుకున్నాడు. ఈతబెత్తపు వాతలు చేతికి తగిలేయి. ఏడుపు ముంచుకొచ్చింది. పెదవులు కంపించి కళ్ల నీళ్ళు తిరిగినై.

"పాడు మనిసి. ఆయేల అమ్మనీ యిట్టాగే. ఛా.... ఛా ..... ఇట్టాగా ?—ఇంతకంటే జాస్తిగానే చితకబాడిచిండు. అమ్మ తప్పేం ఉంది. తాగొచ్చి చావ బాదాడు గాని అసలీడి బుద్దే యింత—" అసహ్యంతో చూపులు మరల్చుకున్నాడు.

బయట వీస్తున్న యీదరగాలి తన శాఖను గుడిసెలోకి పంపింది. చలికి అల్లల్లాడిపోయేడు, గోవిందు. జారి

పోయిన పొట్టి లాగూ, పైకి పోయిన చొక్కా సరిచేసుకున్నాడు. కాళ్లు రెండూ ముడుచుకుని, చేతులు పొట్టలో పెట్టుకున్నాడు. వీపు వెనక్కు జరిగి తాతకు కొట్టుకుంది.

'ఏందిరా' అంటూ కదిలేడు ముసలితాత.

'ఏంలేదు తాతా. చలిగా ఉంది.' అని కళ్ళు మూసుకున్నాడు గోవిందు.

---


Statement about ownership and other particulars about newspaper

**BHARATI**

1. Place of Publication .
   6&7, Thambu Chetty St. Madras-1.
2. Periodicity of its publication :
   7th of Every Month
3. Printer's Name :
   Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address: 6&7, Thambu Chetty Street, Madras-1
4. Publisher's Name :
   Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address : (As above)
5. Editor's Name:
   Sri S. Sambhu Prasad
   Nationality Indian
   Address: 29, Chamier's Road, Madras-28.
6. Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one per cent of the total capital.

| NAMES | ADDRESSES |
|---|---|
| 1. Mr S. Sambhu Prasad | 29, Chamier's Road, Madras-28. |
| 2. Mrs. S. Kamakshamma | Do |
| 3. Mr. S. Nageswara Rao | Do |
| 4. Mr. S. Radhakrishna | 6 & 7, Thambu Chetty Street, Madras-1. |

I, S. Radhakrishna, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

S. RADHAKRISHNA,

7-3-64 Signature of Publisher.


పైగుడ్డను నిండుగా కప్పి, గోవిందును కౌగిలించుకున్నాడు తాత.

పులకింపజేసే స్పర్శ !

అనూహ్యమైన ప్రేమాలింగనం!

'ఈడి చేతు లిరగ. గొడ్డును బాదినట్టు బాదినాడే. వాతలు తేలాయి. ఈడి కోపం నాశనం కానూ. నేనుంటే సరికేవాణ్ణి నాయాల్ని' అని గోవిందు వీపును ఆప్యాయంగా నిమిరి మీద చెయ్యి వేసేడు తాత.

తాత సానుభూతి మాటలు గోవిందు హృదయానికి అమృతపు జల్లులై కరగించినై. అతని కనుకొలకుల్లో నిలిచిన బాష్పబిందువులు కొల్ల కొల్లలుగా పెల్లుబికినై—స్నిగ్ధ కపోలాల మీద గా జారి పారినై.

సెకన్లు పెరిగి నిముషా లైనాయి.

ఆ కన్నీటిధారలు చారలు కట్టినై—అతని చెక్కిళ్ల నునుపుకు మాలిన్యాన్ని పులుముతూ.

ఆతని మానస సాగరంలోని తీవ్ర ఘోష తిరిగి విజృంభించింది.

"తాత అన్నట్టు నిజంగానే గొడ్డును కొట్టినట్టు కొట్టిండు. తనెంత సెప్తున్నా యినుకుంటేగా. 'నాకేం తెలవదు బాబా' అని బ్రతిమాలుకున్నా వదల్లేదు. ఆఖరికి భయంతో లగెత్తినా ఎంటబడి కొట్టిండు—మద్దెలో వచ్చినందుకు అమ్మకూ తగిలినై. పాపం ! అమ్మకు నొప్పిగా లేదేమో ? నిద్దరోతోంది."

"లేకపోతే .... .... ..... .....

అలవాటై ఉంటుంది !—అంతే.

అసలీ రబసకంతా నాయాలు ఆ ఖాన్‌గాడు కదూ కారణం. ఆడి పని రేపు చెప్తాలే" గోవిందు పెదవులు బిగిపడినై.

"వాను కోసం ఆ దొరగారింటికి పోదాం. తోడు రారా" అని బతిమాలితే వెళ్ళాడు గానీ లేకబోతే తనకేం పని. వచ్చిన ఎదవ సరిగా తిరిగి రాక, ఎదవ పని చేశాడు. దొంగ నాయాలు!

ఈడు తియ్యకుంటే ఆళ్లింట్లో బల్లమీది గడియారం ఏమైపోద్ది. పెద్దయ్యగారు అప్పుడే ఆడుంచి లోపలికెళ్లారంట. ఆ ఎంటనే తామే గదా ఆడకి పోయింది. ఆడే తీసుంటాడు. ఖాన్‌గాడి దసలు దొంగబుద్దే. బళ్లో ఎన్నెన్ని నూక్కుపోతుంటాడో తనకు తెలీకుంటేగా. కంతిరిగాడు !

'ఆడే తీసుంటాడు మొ్రో. నాకు తెలవదని ఎంత మొత్తుకున్నా యినుకుంటేగా—అయ్య.' 'కాదు. నువ్వే తీసుంటావ్, ఏడ పెట్టావో చెప్పమ' ని రెండు ఈతబెత్తాలు యిరగ్గొట్టాడు.

అంతే. ఏం తెలీనోడికే యీ కాలంలో తన్నులు. ఛా. ఈళ్ల కసలు ఖాన్‌కి మళ్లే దొంగలే కావాలె. నాదే తప్పు."

తాత చేతిని పక్కకు తీసేడు గోవిందు. కదలకుండా పడుకున్నాడు ముసలాయన. గోవిందు పరీక్షగా తాత మొహం లోకి చూసేడు. ఆయన అన్నమాటలు అతని చెవుల్లో మార్మోగిన్నై—"ఈడి కోపం నాశనంకానూ ?"

గోవిందు తండ్రివైపు కోపంగా చూశాడు. "అయ్య కోపానికి అంతులేదు. ఏ యిసయానికైనా అట్టాగే చంపు తాడు, మనుసుల్ని. ఇదివరకోసారి చిన్నోడు 'మరీ యిది' గా ఏడుస్తుంటేనూ అంతే. ఆణ్ణి నాలుగు బాది, తొడ పిసి కిండు. గిలగిల్లాడిపోయేడు వాడు. ఆనక తెలిసింది. ఆడికి కంది రీగ పీకిందని. పాడు అయ్య ! ఇప్పుడు తననూ అంతే. చెయ్యని తప్పుకు ఎన్ని కొట్టిండో—" గోవిందుకు ఉక్రోషం పొంగింది.

కళ్ళు చేరెడు చేసుకుని చూడసాగేడు తండ్రివైపు. అతని మనస్సులో ఎన్నెన్నో ఊహలు కలగాపులగంగా అల్లుకో సాగేయి.

లేచి కూర్చున్నాడు.

"నేనుంటే నరికేవాణ్ణి నాయాల్ని"—తాత పలుకులు చెవుల్లో గింగురు మన్నాయి.

అతని హృదయంలో రగులుతున్న పగ రాజుకుని పావక జ్వాలలై జ్వలించింది.

నేనుంటే నరికేవాణ్ణి నాయాల్ని'—

' . . . నరికేవాణ్ణి నాయాల్ని'—

' .... .... నాయాల్ని'—

గోవిందు పళ్ళు పటపట కొరికాడు. గుప్పిట బిగించి లేచాడు. అతని కోపాగ్నికి సాయంగా ఝంఝామారుతం వీచింది.

ప్రశాంత నిశి—అశాంత మనస్కుడు.

లోకం నిద్రాదేవి ఒడిలో విశ్రాంతి పొందుతున్నది—శోకం, కోపం అతనిలో తారస్థాయి నందుకున్నవి.

తడబడుతున్న అడుగులతో, అల్లల్లాడుతున్న మనస్సుతో గుడిసె మూలకు వెళ్ళాడు.

మృత్యువు ముడుచుకు కూర్చున్నదా మూల !

బలవంతంగా యీవలకు లాగేడు ! భారంగా అతని కళ్ళెదుట నిలబడింది—పొట్టేళ్లను కొట్టే పొట్టి కత్తి !

శక్తిని కూడదీసుకుని రెండు చేతులతో ఎత్తి పట్టు కున్నాడు. మానవత్వంలోని పశుత్వానికి ప్రేరేపణ కలిగింది, విజృంభించి మానవు నొక త్రోపు తోసింది.

గోవిందు తండ్రి మంచం ముందు కొచ్చేడు. కోపారుణితనేత్రాలతో తండ్రిని చూసేడు. కథలలోని రాక్షస రూపం కళ్ళముందు నర్తించింది, గోవిందుకు.

పెదవులు బిగబెట్టి కత్తి నెత్తాడు!

దూరంగా వూర కుక్క గీపెట్టి శోకించింది.

ఫర్లాంగు దూరంలోని రోడ్డుమీద పోతున్న లారీ హారన్ ధ్వని చెవుల్లో గింగురుమన్నది.

ప్రక్కనున్న పక్కమీది తాత ప్రక్కకు తిరిగేడు. దీపపు బుడ్డి గుడ్డి వెలుగులో చచ్చిన బల్లి పిల్లను చీమలు లాక్కుపోతూ, గోవిందు కాలును కుట్టినై.

తల్లి ఒడిలో పడుకున్న పసివాడు కెవ్వుమన్నాడు. తల్లి యీవైపుకి తిరిగి పిల్లడ్ని జోకొట్టసాగింది.

గోవిందు శరీరం చిరుగాలికి వూగే తీగలా ఐంది. అటు యిటు తూలిపోయేడు. చేతిలో కత్తి క్రిందపడి మట్టిలో ముద్దలా కూరుకుపోయింది.

నిలకడ తప్పిన గోవిందు నిట్టాడి తాటి బొందుకు కొట్టుకున్నాడు. మొహం గీరుకుపోయింది. 'మా' అంటూ మూలిగి క్రింద పడ్డాడు.

కళ్ళు తెరచి చూసేసరికి—

తలమీది బొప్పిని అరచేతితో నిమురుతున్న 'అయ్య' వడిలో పడుకుని ఉన్నాడు—గోవిందు.

గంప క్రింది పిల్లకోడి తల్లి రెక్క క్రింద ముడుచు కుంది.

---

# స్పినోజా తత్త్వపరామర్శ

శ్రీ టి. బి. యం. అయ్యవారు

"Minds, nevertheless, are not conquered by arms, but by love and generosity" అని పరస్పర ద్వేషపూరితమైన ప్రపంచమున కొక దివ్య సందేశ మిచ్చిన దార్శనిక శేఖరుడు స్పినోజా. పదునేడవ శతాబ్దిని పాశ్చాత్య దేశముల నెల్లెడల తన తత్త్వ సౌరభము గుబాళింపజేసిన యాతని జీవితమే చాల విశిష్టమైనది. అంతకంటె విశిష్టమైనవి —ఆయన రచనలు. తాను దర్శించిన తత్త్వమును జీవితమునగూడ సర్వ విధముల నాచరించిన తాత్త్వికు డెవరనిన పాశ్చాత్యులలో స్పినోజా యనియే చెప్పవలయును. తనవారు తన్ను బహిష్కరించినను, సమకాలిక సమాజ మంతయు నగ్నివర్షము కురిపించినను తనకు సత్యమని తోచిన దానిని నాతడు చెప్పక విడువలేదు. మూఢ విశ్వాసములను నిశిత హేతువాద ఖడ్గహతిని ఖండింపక మానలేదు. అసలు హేతువాదమే ఈయన చేతిలో పరాకాష్ఠ నందినదని నుడువవచ్చును. ఏలనన నీతడు తన సిద్ధాన్తముల నన్నిటిని క్షేత్రగణిత మర్యాదారూపమున (Geometrical) ప్రవచించెను. ఉన్నత పదవుల నాశింపక నిరాడంబరముగ జీవితమును వెళ్ళబుచ్చి తత్త్వవేత్తల కందరకును దలమానిక మనిపించుకొనెను. పాశ్చాత్య కవి పుంగవులగు, Wordsworth, coleridge, Goethe, walt whitman లను తన రచనలచే ప్రభావితుల గావించెను. వీరినే కాదు, Fitche, Schelling, Hegel, Jacobi, Leibriz. ప్రభృతి మనీషుల రచనలపై గూడ తన ముద్రను వైచెను. ఏవం విధ ధిషణాధురంధరుని తత్త్వమును స్థూలముగా తెలుపుటయే ప్రస్తుత వ్యాస లక్ష్యము.

స్పినోజా తత్త్వమున ముఖ్యముగా వస్తువనియును (Substance), ఆరోపణ యనియును (Attribute) నాకృతి యనియును (mode) మూడు పదములు విశిష్టార్థమున ప్రయుక్తము లయినవి. సౌలభ్యముకొఱకిందు తొలిదాని గుఱించియును మఱిదాని గుఱించియును ప్రథమమున చర్చింతును. ప్రపంచము నందలి ప్రతి వస్తువున కాధారభూతమైన తత్త్వ మొకటి కలదు. దాని వివర్తమే మనము నిత్యమును చూచుచున్న, విచిత్ర వైవిధ్యముతో గూడిన యీ యనంత జగద్వలయము. మన వేదాంతులు సద్వస్తువుగా దేనిని వ్యవహరించిరో స్పినోజా దానినే Substance అని వచించెను. ఉచ్చావచ రూపములతో దృశ్యమానమగుచున్న యీ ప్రపంచ వ్యవహారముల కన్నింటికిని నిదియే మూలము. ఇచ్చట మన మొక విషయమును జ్ఞప్తియం దుంచుకొనవలయును. మన దార్శనికులు కొందఱు కల్పించినట్లు సత్పదవాచ్యుడైన భగవంతునకు స్పినోజా జగత్కర్తృత్వమును గల్పింపలేదు. అస్తి శబ్దమున వ్యవహృత మగుచున్న భగవత్ తత్త్వమే ప్రకృతిగ పరిణమించినది. ప్రకృతికిని, భగవంతునకును నందుచే భేదము లేదు. పదార్థద్వయ మున్నప్పుడే కార్యకారణ సంబంధము పొసగును లేనిచో కుదురదు. ఈ తార్కికమతమే స్పినోజాచే నీ సిద్ధాంతమును లేవదీయించినది. ఈ ప్రకృతిని గూడ నాతడు రెండు విధముల విభజించెను. అందు మొదటిది చైతన్య ప్రకృతి (Natura naturans-nature begetting). జడప్రకృతి (Natura naturata-Nature begotten) రెండవది. చేతనాత్మకమైన సత్పదార్థమే వీనిలో నాద్యము. బాహ్యముగ మనము చూచు గిరి వృక్షాదులతో గూడిన యీ ప్రకృతి ద్వితీయము. ఇందు ప్రథమ ప్రకృతికి మాత్రమే భగవంతునితో నభేదభావము కలదు. అదియే శాశ్వతమైనది. తక్కిన దంతయును నస్థిరమును నస్వతంత్రమును నగుచున్నది. ఈ విషయమునే నాతడు కొన్ని లేఖలలో స్పష్టపరచినాడు. ఈ క్రింది వాక్యములను చూడుడు.

"I take a totally different view of God and Nature from that which the later christians usually entertain, for I hold that God is immanent, and not the extraneous cause of all things, I say, All is in God; all lives and moves in God. And this I maintain with the Apostle Paul, and perhaps with every one of the philosophers of antiquity, although in a way other than theirs. I might even venture to say that my view is the same as that entertained by the Hebews of old, if so much may be inferred from certain traditions, greatly altered or falsified though they be. It is however a complete mistake on the part of those who say that God and Nature. under which last term

they understand a certain mass of corporeal matter are one and the same I had no such intention."

దీనివలన చైతన్య ప్రకృతికిని బరతత్త్వమునకును భేదము లేదను స్పినోజా యభిప్రాయమును తెలిసికొంటిమి. ఇంక మిగిలిన పదముల కర్థ మెఱుంగవలసి యున్నది. అది చాల సులభమైనదే. ఆకృతి (Mode) యన మనకు కన్పించు నానావిధ వస్తువుల రూప విశేషములే. వీని నుపాధు లని మన మనుకొనవచ్చును. వీనికి సత్పదార్థగమ్యుఁడైన భగవంతుఁడే యాధారము. ఆతఁడు లేనిచో వీని కునికియే లేదు. మనము నిత్యజీవితమునఁ గల్పించుకొనిన గుణదోషములు, ధర్మా ధర్మములు— ఇత్యాదు లారోపణ (Attribute) క్రిందకు వచ్చును. త్రికాలాబాధితమైన, సర్వాంతర్యామి యైన భగవంతున కివి ఏమియును లేవు. ఆతఁడు వీని కన్నింటికి నతీతుఁడు. ఈ గుణదోష పృథక్కరణము, వైయక్తికము లైన యభిరుచులవలన, ఇష్టా నిష్టముల వలన నేర్పడినది కాని వేఱుకాదు. చైతన్య ప్రకృతి కభిన్నుఁడైన భగవంతుఁడు పరిమితబుద్ధులమైన మనకు విధేయుఁడై ప్రవర్తింపఁడు. మన మంచి చెడులతో నాతనికిఁ బ్రసక్తి లేదు. ఇవి యన్నియును నాతని ప్రకృతిని తద్ధర్మమును, మనము సరిగా నర్థము చేసికొనజాలమిఁ బుట్టించినవి. దీనిని స్పినోజా తన Ethics అను గ్రంథమున నిట్లు వక్కాణించినాఁడు. :

"Whenever, then, anything in natur[e] seems to us ridiculous, absurd or Evil, it is because we have but a partial knowledge of things, and are in the main ignorant of the order and coherence of nature as a whole, and because we want every thing to be arranged according to the dictates of our own reason. although in fact, what our reason pronounces bad is not bad as regards the laws of our nature taken seperately. As for the terms good and bad they in dicate nothing positive considered in themselves. For one and the same thing can at the same time be good, bad and indifferent - For example music is good to the melancholy, bad to mourners and indifferent to the dead."

ఈ స్పినోజా వాదము మనము కల్పించుకొను సర్వ ద్వంద్వములకును వర్తించును. మనకొఱకే యీ ప్రపంచము సృష్టమైనదను భావమే వీని కసలు హేతువైనది. భగవంతుని సంకల్పమును, నాతని ప్రకృతియొక్క ధర్మములను సమగ్రముగ నర్థము చేసికొనిన నివి యుండనే యుండవు. ఈ ప్రపంచమూరక నొక పిచ్చివాని చేతి రాయివలె విసరి వేయబడినది కాదు. దీని కొక నియతి యున్నది. అది యంతర్దృష్టికి గాని గమ్యము కాదు. ఇది భగవంతుని గుఱించియును, నాతని ప్రకృతిని గుఱించియును స్పినోజా చేసిన సిద్ధాన్తము.

ప్రకృతికిని భగవంతునకును నభేదత్వమును ప్రతిపాదించినట్లే మనశ్శరీరములకును నభేదత్వమును ప్రతిపాదించినాఁడు స్పినోజా. మనస్సును, శరీరమును భిన్నములు కావనియును, రెండును నొకటే యనియును నాతని మతము. స్థూల దృష్టికి వేఱుగా భాసించు నీని వ్యాపారములుఁ గూడ నొకటే యని యాతని వాదము. రెండును నొకటియే యగుటచే నొకదానిపై మఱియొకటి పనిచేయలేదని యాతని యభిప్రాయము. దీని నాతని వాక్యములలోనే చెప్పుట మంచిదని యనుకొందును.

The body cannot determine the mind to think; nor the mind determine the body to remain in motion or at rest or in any other state· The decision of the mind, and the desire and determination of the body are one and the same thing

—Ethics.

మనస్సు గ్రహింపజాలని దేదియును శరీరమునకు సంభవింపదని యాతడు కర్కశ తర్కధోరణిలో నిరూపించెను. ఈ సందర్భమున నాతని వాక్యములు బరిశీలింపుఁడు:

"What ever takes place in the object of the idea that constitutes the human mind must be perceived by the human mind; that is. an idea of that thing is necessarily in the mind. In other words, if the object of the idea that constitutes the human mind must be a body, nothing can take place in that body, without being perceived by the mind."

స్పినోజా దృష్టిలో మానవుని మనస్సునకు స్వతంత్రత లేదు. అనగా తనంతట తా నేదియును సంకల్పింపజాలదు. ఇంకను విశదముగఁ జెప్పవలె ననిన దానికి "Free will" లేదు. ప్రకృతిసిద్ధములైన కొన్ని గుణములు (Instincts) దానిని తత్త వ్యాపారములకు ప్రేరేపించును. స్థూలముగా నొక్క మాటలోఁ జెప్పవలె ననిన ప్రకృతియే దీనిని నియమించును. మనస్సులు స్వతంత్రముగా వర్తింపమి, మానవులును స్వతంత్రులు కారు.

"Men think themselves free, because they are conscious of their volitions and desires, but are ignorant of the causes by which they are led to wish and desire"

మన మొక వస్తువును నది యానంద మొసఁగునని వాంఛించుటలేదు. మనము వాంఛించుటచే నది యానందమును కలిగించుచున్నది. మన యీ వాంఛా వ్యాపారమునకు మనలోని "Instincts" ప్రధాన హేతువులు. ఇవి యెందుల కిట్లు వర్తించునో మన మెఱుంగజాలము. మన మనస్సుల పరాధీనత నిట్లు స్పినోజా ప్రకటించినాఁడు. ఇట్లు స్వతంత్రములైన మనస్సుల వాంఛలకు లోఁగి ప్రవర్తించుట కంటె హేతువాదమున మనము మన మనోభావముల సంయమనము గావించుకొని ప్రవర్తించుట శ్రేయస్కరమని యాతని యభిప్రాయము.

"Our actions, that is to say, those desires which are determined by mains power or reason are always good, the others may be good as well as evil."

ఇంతమాత్రమున స్పినోజా కేవలము హేతువాదమునకే ప్రాధాన్య మొసంగెనని తలంపఁ జెల్లదు. మన ఇంద్రియానుభవముల కంటె మనో వ్యాపారము కంటె నతీతమైన జ్ఞానమొకటి కలదని యాతఁడు చెప్పినాఁడు. అదియే యంతఃస్ఫురణము (Intutive knowledge) లేక యతీంద్రియ జ్ఞానము. దీనివలననే మనకు భగవత్ తత్త్వము గోచరించును. ఈ యెఱుకయే సత్యమైనది. మిగిలిన వన్నియు నయథార్థములు.

All ideas. in so far as they are referred to God are true.

ఈవిధముగ స్పినోజా భగవంతునకు తన తత్త్వమును బట్టము గట్టినను, దురదృష్టవశమున నాతని సమకాలికు లాతనిని నిరీశ్వరవాదిగాఁ బరిగణించి యనేక కష్టములపాలు జేసిరి. ఇది వేఱు విషయము.

స్పినోజా నిశితదృష్టి కేవలము తత్త్వశాస్త్రమునకే పరిమితము కాలేదు. రాజకీయములపై గూడ నాతఁడు తన యభిప్రాయములను ప్రకటించుచు "Tractatus politicus" అను నొక గ్రంథమును వ్రాసెను. అయితే యది పూర్తికాక పూర్వమే యాతఁడు దివంగతుఁ డయ్యెను. ఆ గ్రంథమున నాతడు ప్రజాస్వామిక ప్రభుత్వాశయముల నన్నిటిని వెలిఁబుచ్చెను. ప్రభుత్వ ధ్యేయము తన క్రిందనున్న ప్రతి వ్యక్తిని భయాందోళనల నుండి విముక్తుని గావించి స్వతంత్రునిగా జేయుటయే యని యాతఁడు తలచెను.

"The last end of the State is not to dominate men, nor to restrain them by fear rather, it is so to free each man from fear that he may live and act with full security and without injury to him self or his neighbour. The end of the state, I repeat, is not to make rational beings into brute beasts and machines. It is to enable their bodies and minds to function safely.

ఇన్ని యుదారాశయముల వ్యక్తీకరించినను నాతఁడు ప్రజాస్వామిక ప్రభుత్వమును పరమాదర్శమని భావింపలేదు. Hobbes వలె మత సంస్థలు ప్రభుత్వమున కధీనములై వర్తింపవలె ననెను. ప్రభుత్వమునకు వ్యతిరేకముగ రేగు విప్లవముల నాతడు సమర్థింపలేదు. Hobbes వలె వ్యక్తి స్వాతంత్ర్యమును ప్రభుత్వమునకై పూర్తిగా బలిచేయుమన లేదు. రాజకీయములపై నాతని యభిప్రాయములు కొంతవఱకు పరస్పర విరుద్ధములుగా మనకు తోచును. ఏమైనను పాశ్చాత్య దార్శనికులలో స్పినోజా మఱువునకురాని మహానుభావుఁడు. ఆధునిక తత్త్వవేత్తలలో నగ్రేసరుఁడైన Bertrond Russel ఆయనను గుఱించి వ్రాసిన వాక్యములతో నీ వ్యాసమును ముగించుచున్నాను.

Spinoja is the noblest and most lovable of the great philosophers. Intellectually some others have surpassed him, but ethically he is supreme.

—History of westeren philosophay.


Bibiliography

Will Durant — Story of Philosoophy.

Philosophy of Spinoza Edited by Joseph Ratner.

The philosophy of spinoga by George Stuart Fullerton.

Introduction to Ethics—George Santayana.

Martinean—Study of Spinoza

Bertrand Russel—History of westeren philosophy.




## ఇప్పుడు అందరికీ దొరుకుతుంది

### తాజా, పరిమళమైన, ఉత్తమ టీ

# టాటా-ఫిన్లే టీ

*సాటిలేని టీ!*

టాటా-ఫిన్లే టీ అత్యుత్తమమైన టీ. ప్రపంచములో కెల్ల ప్రఖ్యాత ఉత్పాదకులుగా, ఉత్తమశ్రేణి టీ ఉత్పాదనలో ఫిన్లేవారు గడించిన అనుభవము, విజ్ఞానము జగద్విదితము. అంతేకాదు—ప్రజల అభిరుచుల కనుగుణంగా టీ రకాలను మిశ్రణ (బ్లెండింగ్) చేయుటలో వీరి నైపుణ్యము అద్వితీయము. టాటావారు ప్రజల అనుకూలతను తెలిసికొని విక్రయ వితరణ కార్యక్రమాలను నిర్వహించుటలో అనుభవజ్ఞులు. కలిసి మెలసి టాటా-ఫిన్లే వారు పలురకముల పరిమళమైన, ఉత్తమమైన, తాజా టీని అందించగలరు. ఇందుకొరకు ఈ టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుచున్నారు.

*టాటా-ఫిన్లే టీ త్రాగండి!*
*ఆనందము అందుకోండి!*



ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్సులోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్—సుందరమైన టిన్
లలిత్—బంగారు రంగు ప్యాకెట్
మిలాప్—వెండి రంగు ప్యాకెట్
బహదూర్-నారింజ రంగు ప్యాకెట్
షాన్-నీలి రంగు ప్యాకెట్




BI-TFN-4-TEL

# గుండమ్మ కూతుళ్ల కథ

శ్రీ చక్రపాణి

ప్రజనుల కోరికమీద, రామభద్రయ్యగారు కొడుకుల చేత సత్యనారాయణ వ్రతం, బీదలకు అన్నదానం చేయించ నిశ్చయించుకున్నాడు. ఆ ప్రకారం ఆహ్వాన పత్రాలు అచ్చు వేయించి, బంధుమిత్రులకు పంపటం జరిగింది.

గుండమ్మ కొడుకు ప్రభాకర్ ఆహ్వానం అందుకుని బయలుదేరబోతుండగా గంటయ్య తనకూ ఆహ్వానం వచ్చిందనీ, (రాకపోయినా) 'ఒక్కణ్ణే ఏం పోను' అని ఆలోచిస్తున్నాననీ, 'సరే, మీరు బయలుదేరుతున్నారు గాబట్టి, మీకు తోడు నేనూ వస్తా' నని ప్రభాకర్ పెట్టే, బెడ్డూ తీసుకుని బయలుదేరాడు.

* * * *

రామభద్రయ్యగారి ఇంట్లో గుండమ్మ సత్యనారాయణ వ్రత సన్నాహాలన్నీ నెత్తిన వేసుకుని అల్లుళ్ల దగ్గరనుంచి కూతుళ్ల వరకూ అదుపు చేస్తూ, పనివాళ్లని ఆజ్ఞాపిస్తూ, వెనకటిలాగే పెత్తనం చలాయిస్తూ ఉంది. ఈ పద్ధతి చిన్న కూతురు సరోజకు నచ్చలేదు. "అసలు నువ్వెందు కింత పూసుకుంటావు' తో మొదలుపెట్టి—'సొంత యింట్లో సాగక, పరాయి యింట్లో చెలాయిస్తుంది పెత్తనం' అనే దాకా తల్లిని సూటీ పోటీగా అన్నది. గుండమ్మ చిన్న కూతురు జోలికి ఆట్టే పోకుండా, చూచీ చూడనట్టు వదిలి, పెద్దకూతురు ఇంటికొచ్చిన చుట్ట పక్కాలు మాత్రం తన ప్రాముఖ్యతని గ్రహించే విధంగా ప్రవర్తించి, సత్యనారాయణవ్రతం, అన్నదానం వగైరాలు నిర్విఘ్నంగా నెరవేర్చింది.

* * * *

వచ్చిన చుట్టాలు ఒక్కొక్కళ్లే వెళ్లిపొయ్యారు. గంటయ్య మాత్రం కదలలేదు.

ప్రభాకర్, పద్మ అందరివద్ద సెలవు తీసుకుని ప్రయాణమై, అమ్మదగ్గర కొచ్చి 'అమ్మా ! రా, మనింటికి పోదాం' అని పిలిస్తే గుండమ్మ 'నేను రాను, నా కిక్కడే బాగుంది' అంటుంది. చిన్నకూతురు అందుకుని 'అవును' ఎందు కొస్తుందీ అక్క డెవరున్నారు—చలాయించడానికి పెత్తనం ?' అని వుటుక్కున అన్నది. పెద్దకూతురు లక్ష్మి 'అవేం మాటలే' అని చెల్లెల్ని వారించగా—సరోజ 'నీకు తెలీదు ఊర్కో అక్కా ! ఇంకా మనం చిన్నపిల్లలమనే అనుకుంటూఉంది. మనం ఏమి తినాలో, ఏం కట్టుకోవాలో, అన్నింటికీ ఈమే చెప్పాలి. ఎన్నాళ్లీ నస !' అని కుండ పగలగొట్టినట్టు అనేసింది. దాంతో గుండమ్మ సంగతంతా గ్రహించుకుని, మూటా ముల్లె కట్టుకుని, పెద్ద కూతురు వద్దన్నా వినిపించుకోకుండా కొడుకు కోడలితో బయలుదేరింది. క్రింద లల్లుళ్లకీ, రామభద్రయ్యగారికీ నమస్కారాలు చెప్పి, అల్లుళ్లు ఎంత బతిమాలినా వినకుండా వెళ్లిపోయింది.

తరువాత రామభద్రయ్యగారు అంతా విచారించి సంగతి తెలుసుకున్నాడు. కాని యీ విషయంలో కొడుకులు భార్యల వైపే మొగ్గటం చూచి—"భార్యలమీద ప్రేమ ఉండవలసిందే గాని, వాళ్లను తగు స్థానంలోనే ఉంచాలి. నెత్తి నెక్కించుకో గూడదు' అని పరోక్షంగా హెచ్చరించి, తను మకాం తోట బంగళాలోకి మార్చడానికి నిశ్చయించుకున్నానని చెబులాడు.

కొడుకులు దీనికి ఒప్పుకోరు. కాని, రామభద్రయ్య ప్రపంచధర్మం చెబుతాడు. ఎదిగిన కొడుకులు చీటికి మాటికి సలహాలు అడగడం, తండ్రి చెప్పడం అంత మంచిదిగాదని, అయినా చిక్కు సమస్య లేమైనా వస్తే, తనని సంప్రదించ వచ్చు" ననీ వాళ్లని వప్పించి, మకాం తోట బంగళాకి మారుస్తాడు.

* * * *

గుండమ్మ ఇంటి ముఖద్వారంమీద 'నాట్య భారతి' బోర్డు వెలిసింది. ఇంట్లో భూపతి ఆధ్వర్యంక్రింద—తబలా వాయిద్యాలూ, నాట్యాలు జరుగుతున్నయ్. కొందరు నాట్యకత్తెలు శిక్షణ పొందుతున్నారు. ఇదంతా పద్మకు మొదట్లో యిష్టం లేకపోయినా,—'భారతదేశంలో పెళ్లిళ్లవల్ల కళామతల్లికి ఎంతో అపచారం జరుగుతోందనీ, 'నీలాంటి కళా తపస్వినుల కళా కౌశలం వివాహానికి ఆహుతి అయిపోగూడదనీ'

ప్రభాకర్ భార్యకు నచ్చజెప్పి, నాట్యకళను ఉద్ధరించడానికి కంకణం కట్టుకున్నాడు.

గుండమ్మ—కోరలు తీసిన పాములాగ — మామూలు పెరటి యింట్లో పడి ఉంటున్నది!

* * * *

గంటయ్య ఇంట్లో తిష్టవేసి, ఇంటికి చిచ్చు పెట్టాడు. ఎలాగంటే ఒకనాడు సరోజని డబ్బు అడిగాడు. 'నా దగ్గర లేదు. అక్కని అడగమంది. గంటయ్య నొచ్చుకుని 'అయ్యో! ఒకనాడు నీ చేతిమీదుగా ఎంత డబ్బు ఖర్చు పెట్టినదానివి! యీనాటికి—ఒక్క రూపాయి కోసం, అక్కని —ఆనాడు నీ చేతికింద బతికిన అక్కని—అడుక్కోవలసి వచ్చిందే'' అని ముసలి కన్నీళ్లతో సానుభూతి చూపాడు. సరోజకి ఒక్కసారిగా పాత జీవితమంతా జ్ఞాపకం వస్తుంది. (Flash Back) అవును! గంటయ్య చెప్పింది ఆమెకి యదార్థం గానే కనిపించింది.

ఆ రాత్రి భర్తని 500 రూపాయలు కావాలని అడిగింది. 'ఎందుకు?' అన్నాడు భర్త.

''ఎందుకో! అవన్నీ చెప్పాలా? నా చేతిలో ఆమాత్రం డబ్బు ఉండగూడదా?' అన్నది సరోజ. ''అయితే—మీ అక్కేగా! అడుగు'' అని నవ్వి ఊరుకున్నాడు. సరోజ యిక మాట్లాడలేదు. ఆరాత్రి గోడవైపుకి తిరిగి పండుకుంది.

రాజా సంగతి గ్రహించాడు. మరునాడు అన్నని డబ్బు అడిగాడు. 'ఎందుకు?' అన్నాడు అన్న. రాజాకి నవ్వు వచ్చింది. 'ఎందుకు నవ్వుతావు' అని అడిగాడు అంజి. రాజా చెప్పాడు. అన్న లక్ష్మిని పిలిచి, 500 కావాలన్నాడు. 'ఎందుకు?' అన్నది లక్ష్మి. అన్నదమ్ములిద్దరూ ఒకళ్ల మొఖం ఒకళ్లు చూచుకుని నవ్వారు. లక్ష్మికి ఏమీ అర్థంకాక, వెళ్లి డబ్బు తీసుకొస్తుంది. తమ్ముడికి ఇవ్వమంటాడు. ఎందు కన్నట్టు చూస్తుంది లక్ష్మి. రాజా అర్థం చేసుకుని, సంగతి చెబుతాడు.

లక్ష్మి చెల్లెలి దగ్గరికి పోయి, 'నీకు డబ్బు కావలిస్తే —నన్ను అడగకూడదా? ఈ భాగ్యానికి మొగవాళ్లదాకా పోవాలా?' అంటుంది.

'ఏం పోతే? ఇందులో రహస్యం ఏముంది? నా మొగుణ్ణి నేను డబ్బు అడగడం తప్పా?' అంటుంది సరోజ.

లక్ష్మి అర్థం చేసుకుంది. తాళాలు యిచ్చేద్దామన్నంత వరకూ వస్తుంది. గాని మళ్లీ తమాయించుకుని—ఆరాత్రి భర్తకి జరిగిందంతా చెబుతుంది.

మరునాడు అన్న తమ్ముడికి జరిగింది చెబుతాడు.

సరోజది ఖర్చుచేసే చెయ్యి. పైగా పల్లెటూళ్లో తోచదు. కొన్నాళ్లపాటు తమ్ముడు మరదలితో—శృంగార యాత్ర చేసి వస్తే బాగుంటుందని సలహా యిస్తాడు.

బాగానే ఉందని రాజా గూడ ఒప్పుకుంటాడు.

రాజా సరోజల శృంగారయాత్ర ప్రారంభమైంది.

మహాబలిపురంలో మొదలుపెట్టి—ఊటీ, బృందావన గార్డెన్స్ మొదలైన దక్షిణాది టూరిస్టు కేంద్రాలు సందర్శించి, ఉత్తరాది యాత్రలకు బయలుదేరుతూ, ఢిల్లీలో అశోక్ హోటలుకు 500 రూపాయలు పంపమని అన్నకు టెలిగ్రాం యిచ్చారు. దంపతులు ఢిల్లీ చేరేసరికి మని యార్డరు సిద్ధంగా ఉంది. డబ్బు పుచ్చుకుని, ఢిల్లీలో ఎర్ర కోట, ఆగ్రాలో తాజ్ మహలూ మొదలైన పాత ప్రదేశాలు, భాక్రా నంగల్ డామూ, చండీఘర్ రాజభవన్ మొదలైన ఆధునిక కట్టడాలూ సందర్శించి—(ప్రొడ్యూసరు యింత డబ్బు ఖర్చు పెట్టలేకపోతే, కొన్ని మానుకోవచ్చు) కాశ్మీరు చేరుకున్నారు.

కాశ్మీరులో ఒక బోటు అద్దెకు తీసుకుని, ద్వంద్వ గీతాలు పాడుకుంటూ, మూడు మాసాలు మూడు రోజుల్లాగ వెళ్లబుచ్చారు. ఇంటికి ఉత్తరాలు రాస్తూనే ఉన్నారు—డబ్బుకోసం! నాలుగోసారిగా డబ్బు పంపుతూ, అన్న 'మరదలుపిల్ల చెయ్యి కొంచెం ఎత్తుబారిందనీ, ఖర్చు విషయంలో అదుపుచేస్తే బాగుంటుం' దనీ తమ్ముణ్ణి మందలించాడు.

ఆ ఉత్తరం సరోజ చదివి మండిపోయింది. అక్కకి ఉత్తరం రాస్తూ—బావగారి విషయం ప్రస్తావించి—'మేం మా డబ్బు ఖర్చుపెట్టుకుంటున్నాం. మాకు పంపిన డబ్బంతా మా పేరనే ఖర్చు రాసి, మా వాటాలో తీసుకోవచ్చు' ననీ 'యిలాంటి చిన్న విషయాలలో—పొదుపు ఉద్యమం మీద బావగారు ఉపదేశించడం బాగలేద' నీ ఎత్తిపొడిచింది.

లక్ష్మి ఉత్తరం భర్తకి చూపి, 'మీ కెందుకు వాళ్ల గొడవలు! ఊరుకోగూడదా!' అని సలహా యిచ్చింది. అంజి భార్య సలహా పాటించలేదు. తమ్ముడికి ఉత్తరం రాశాడు— ''మరదలుపిల్ల చాటుగా నీకు రాసిన ఉత్తరాలు చదువుతున్న'' దనీ, 'ఒకరి ఉత్తరాలు ఒకరు చదవడం మంచిది కాద' నీ. భార్యకు అంత చనువివ్వడం బాగలే'దనీ, హెచ్చరించాడు. సరోజ ఆ ఉత్తరం గూడ చదివి, అక్కకి యిలా రాసింది. ''తమ భార్యాభర్తల మధ్య రహస్యాలేమీ లేవనీ, తమ శరీరాలు వేరైనా, ఆత్మలు ఒకటేననీ, ఒకరి హృదయాలు ఒకరికి విప్పిన పుస్తకాలనీ, యీ ప్రపంచంలో ఏ అభివృద్ధి నిరోధక

శక్తి తమని విడదీయలేదనీ,''—ఈ ధోరణిలో నడిచింది ఉత్తరం!

అంజి మరదలి ఆవేశాన్ని గ్రహించాడు. తమ్ముడికి ఒక్క ముక్కలో ఉత్తరం రాశాడు ''ఇకనుంచి డబ్బు పంప డానికి వీలులేదు'' అని. సరోజ ఉత్తరం చదివి, భర్తచేతి కిచ్చింది. 'ఇక్కడ అప్పులు తీర్చి, ఇంటికి పోవడానికి డబ్బు లేదు' అన్నాడు భర్త. (రాజా హృదయమైతే విప్పాడు గాని—భార్య ముందు మనీపర్సు విప్పలేదు) సరోజ చాల ఆందోళన పడింది. ఈలోపల—'నాట్య భారతి' డ్యాన్సు ట్రూపుతో—ప్రభాకర్ కాశ్మీర్ వచ్చాడు. అతని దగ్గర చేబదులు తీసు కుని, యిద్దరూ యింటికి ప్రయాణమైనారు.

ప్రశాంతి

గంటయ్య తోటబంగళాలో రామచంద్రయ్యకు తోడుగా, ఆయన్ని వినోదపరుస్తూ ఉండిపోయాడు. ఫ్రీగా దొరికిన అవుపాలూ, కోడిగుడ్లతో కొంచెం ఒళ్ళు కూడా చేశాడు.

గంటయ్య పెట్టిన చిచ్చు రగిలి మండుతున్నదని అతనికి తెలియదు.

రాజా సరోజలు ఇంటి కొచ్చేశారు.

చిన్న చిన్న విషయాల దగ్గర నుంచి అక్క చెల్లెళ్ల మధ్య—నువ్వా—నేనా అని తగాదాలు పెరిగిపోతున్నయ్. లక్ష్మికి విసుగెత్తి తాళాలు భర్త కిస్తుంది. భర్త తనకూ అక్కరలేదని—'నీ కిచ్చినవాళ్లకే యిచ్చుకో' మంటాడు.

లక్ష్మి మామగారి దగ్గరికి పోయి, విషయమంతా చెప్పి, తను యీ బాధ్యత నిర్వహించలేనని తాళం చేవులు యివ్వబోతుంది. రామభద్రయ్య తీసుకోడు. తను లక్ష్మిని ఎంతో సమర్థత గలదని ఊహించి యీ యింటి కోడలుగా తెచ్చుకున్నాననీ, తన ఊహ లిలా తల్లక్రిందు లవడం నమ్మ లేకుండా ఉన్నాననీ, ఏమైనా యీ సంసార పంకంలో తాను మళ్లీ ఇరుక్కోదల్చుకోలేదనీ, లక్ష్మినే యింకోసారి ప్రయ త్నించి చూడమనీ, రామభద్రయ్య బతిమాలతాడు. లక్ష్మి సరే నంటుంది.

లక్ష్మి ఇంటి కొచ్చేసరికే, ఇనప్పెట్టె తాళంమీద ఇంకో తాళం పడిఉంది. రాజా సరోజని గట్టిగా మందలించ బోతాడు. సరోజ నిరాహార వ్రతం ప్రారంభిస్తుంది.

పరిస్థితులు చూచి, అన్నదమ్ములు వేర్లు పడడమే మంచిదని నిర్ణయించుకుంటారు.

పంపకాలు జరుగుతయ్. వేరు వంటలు ప్రారంభ మవుతయ్ !

గంటయ్యకి మళ్లీ చేతినిండా పని దొరుకుతుంది. రామభద్రయ్య సేవ వదిలి, రాజా భాగం వ్యవసాయం చేయిం చడం మొదలుపెడతాడు. గట్ల దగ్గఱ పాలేళ్లతో ప్రారంభ మైన తగవులు, పైదాకా పాకినై. ఊళ్లో న్యాయం పెద్ద వాడి తరఫునే ఉన్నదనీ, గంటయ్యే కలహాలు పెంచుతున్నా డనీ, చెప్పుకుంటారు.

రాజా యిప్పుడు తలకిందనే పిస్తోలు పెట్టుకుని పండు కుంటున్నాడు. రాత్రి నిద్రలో—''అన్నో తనో—ఎవరో ఒకరు ఏరిపోవలసిందేనని, లేకపోతే ఈ తగవు చల్లార'' దని ఒకటి రెండు సార్లు కలవరించాడు. సరోజ విని భయపడింది. పిస్తోలు తీసి దాచింది. రాజా బలవంతాన మళ్లీ లాక్కున్నాడు.

అంజి ఊళ్లో లేడు, చెబుదామంటే ! గ్రామాంతరం వెళ్లాడు. రెండు మూడు-రోజుల్లో వస్తాడు.

వచ్చే దోవలో కాపలా వేసి, కాలుస్తానని రాజా సరో జతో చెప్పాడు. సరోజ భయపడింది. వెళ్లి అక్కకు చెప్పి, ఏడుస్తుంది. బావని కనబడకుండా చెయ్యమనీ, రామభద్రయ్య గారితో చెప్పి, ఈ తగూలు ఎలాగైనా సర్దుబాటు చెయ్య మనీ బతిమాలుతుంది.

ఇద్దరూ రామభద్రయ్యగారి దగరకు వెళతారు.

రామభద్రయ్య అంతా వింటాడు. విని—'ఏనాడు భాగాలు పంచుకున్నారో, ఆనాటినుంచి వాళ్లు తన కొడుకులే కాదనీ, వాళ్ళు ఏమైపోయినా తనకు విచారం లే''దనీ చెబు తాడు. సరోజ తప్పు తనదేనని ఒప్పుకుని, ఎట్లాగైనా యీ యాపదనుంచి తప్పించమని, కాళ్లా వేళ్లా పడుతుంది. రామభద్రయ్య వినడు.

''మీరే తెచ్చారు తగవులు. మీరే సమర్థించుకోండి'' అని చెబుతాడు. వెళ్లి తలుపు వేసుకుంటాడు.

ఇక క్లయిమాక్స్ ఘట్టం!

సరోజ ఎంత చెప్పినా వినకుండ రాజా—Standard Triumph లో — 65 మైళ్ల స్పీడ్‌లో బయలు దేరుతాడు. వెంటబడి రాజాని ఆపడానికి—అక్క చెల్లెళ్ళకి కారు లేదు. గుర్రబ్బండి చేసుకుంటారు. గుర్రం కదలదు. సరోజ బండివాణ్ణి దిగమని లగాము పట్టుకుంటుంది. (ఈ మార్పు పాఠకులకు ఎబ్బెట్టుగా ఉంటుంది గాని—ప్రేక్షకులకు బాగుంటుంది) గుర్రం గూడ 59 మైళ్ల స్పీడులో పోతూ ఉంటుంది.

రాజా కారు దూసుకుపోతూ ఉంది! గుర్రబ్బండి ఆగ మేఘాలమీద పోతోఉంది. సరోజ—కొరడా....దెబ్బ! .... కొరడా .... దెబ్బ !.......

గుర్రబ్బండి కారుని దాటగలదా ? ప్రేక్షకులు గుండె చేతబట్టుకుని, Background music వింటూ కూర్చుంటారు. కారు పోతూనే ఉంటుంది. 60, 70, 80 మైళ్ల Speed !

గుర్రం 59, 49, 39—దిగుతూ ఉంది !

లాభంలేదు! ఈ ప్రమాదాన్ని నివారించే వీలులేదు.! దైవ యత్నం తప్పితే, మానవ ప్రయత్నం లాభంలేదని ప్రేక్షకులు నిర్ణయించుకుంటారు.

కారు పోతూనే వుంటుంది.— ఇంకా పోతుంది.— గుర్రం నురుగులు కక్కుతోంది! ఏమిటా నురుగుల్లో ఎరుపు ! ఎరుపు గాదు రక్తం.!

అక్క చెల్లెళ్లిద్దరూ—దిగి—పరుగు లంకించు కున్నారు. ప్రేక్షకులు, చూడలేక, కళ్ళు మూసుకున్నారు.

Background music వినబడుతూనే ఉంది.

70 మైళ్ల స్పీడులో పోయే కారును యీ అబలా మణులు జయించ గలరా? అని ప్రేక్షకుల ముఖంలో ఒకటే ప్రశ్న, పెద్ద ప్రశ్న!! తెరంతా ప్రశ్న!!!

ఢాం ! పెద్ద చప్పుడు ! ప్రేక్షకులు కళ్ళు తెరిచారు ! టైరు బరస్టు అయింది. రాజా దిగాడు. జాకీ తీశాడు. టైర్ మార్చాలి.

అబలలు పరుగెడుతున్నారు. దూరం దగ్గరవుతున్నది. చూపు మేరలో కారు కనిపించింది. ధర్మం జయించింది.

ఇంకోఉపద్రవం! అంజి కారు ఎదురుగా వస్తున్నది! పాపం, అంజికి యిదంతా తెలియదు.

అబలలు దగ్గరికి వచ్చేస్తున్నారు. అంజి కారువచ్చి ఆగింది. "తమ్ముడూ! టైర్ వెయ్యాలా" అని ఆప్యాయంగా దగ్గర కొచ్చాడు.

ఆడవాళ్లు "వద్దు!! వద్దు! చంపేస్తాడు" అని అంజికి అడ్డం పోతారు. అంజికి ఏమీ అర్థంకాదు. Back ground music రొదలో— నిజానికి—యీ మాటలు వినపడవు. రాజా పిస్తోలు తీస్తాడు! అంజి గ్రహించుకుంటాడు!! రొమ్మిచ్చి "తమ్ముడు చేతిలో చావడంకంటే స్వర్గమే లేదని", యీ బలితో నైనా కుటుంబ కలహాలు తీరితే, తాను సంతోషిస్తాననీ— అంటాడు.

సరోజ అంజికి అడ్డంగా పోతూంది. 'ముందు నన్ను కాల్చి, తరువాత బావని కాల్చమంటుంది.

రాజా 'లాభంలేదం'టాడు. "నీ సౌఖ్యం కోసం నేనింత చేస్తే— నువ్వు పోయిన తరువాత— నాకిక ప్రపంచం ఏముంటుంది? సన్యసిస్తానని పిస్టలు పారేస్తాడు.

సరోజ నిజంగా పశ్చాత్తాప పడుతుంది. తన మూలంగా గదా, గుట్టుగా బలికిన కుటుంబం రట్టు అయిందని— చిన్న Speech యిస్తుంది. (ఆ Speech వ్రాయడం లేదు— ఎవరైనా సినిమాల్లో పెట్టుకుంటారేమోనని)

speech యిచ్చి— పిస్టలు తీసుకొని కాల్చుకుంటుంది.

లక్ష్మి కెవ్వున కేకవేసి, సరోజని చేతుల్లోకి తీసుకొని, ఏడుస్తుంది. (ఏడుపులో చిన్న పిల్లలా గుక్క పెడుతూంది.) రాజా వదినెను ఓదారుస్తాడు! ఫరవాలేదు. అంత ప్రమాదకరమైన దెబ్బకాదని మొదలుపెట్టి, చివరికి 'పిస్తోలులో గుండు లేద'ని తేల్చి పారేస్తాడు. సరోజ ఆశ్చర్యంతో కళ్ళు తెరుస్తుంది.

అందరూ కలిసి, కైర్ తగిలిస్తారు.

అంతా కారెక్కి quartet పాడుకుంటూ— ఇల్లు చేరుకుంటారు.

విచిత్రం! యిల్లు తాళం వేసివుంది.

ఈ సంతోష వార్త తెలిపి, తాళంచెవి తెచ్చుకోవడానికి నలుగురూ రామభద్రయ్య దగ్గరికి పోతారు.

రామ భద్రయ్య ముఖాన— కొడుకులు కోడళ్లు కలసి వచ్చినందుకు సంతోష చిహ్నాలు కనబడలేదు. విసుగు మాత్రమే ద్యోతక మవుతున్నది.

కొడుకులు కోడళ్లను ఆశీర్వ దించటానికి బదులు— యిలా ఆదేశించారు.

—"తండ్రి సంపాయించిన ఆస్తి తింటూ కూర్చుంటే— మీకు డబ్బు విలువ తెలియలేదు. కొట్లాడుకున్నారు. ఈ నాటి నుంచీ—నా ఆస్తిలో మీకు భాగం లేదు. చెరి వెయ్యి రూపాయలు యిస్తున్నాను— ఖర్చులకి.' వెళ్లి సంపాదించుకొని బతకండి."

డబ్బు చేతికిచ్చి, 'శుభం' అని చెప్పి, పేపరు ముఖానికి అడ్డు పెట్టుకున్నాడు.

పేపరు మీద 'శుభం' అనే అక్షరాలు— పెద్దవిగా కనిపిస్తయ్:— తెరనిండా!.

షరా:— భావం సరిగా వ్యక్తం చెయ్యటానికి, "దూసుకు పోతుంది,' 'తెరచిన పుస్తకంలాగా' 'శృంగార యాత్ర' 'అభివృద్ధి నిరోధక శక్తులూ' మొదలైన కొన్ని పదాలు తస్కరించ వలసి వచ్చింది. క్షమించాలి. పోతే,యిది సంగ్రహక కథ. దీనికి ట్రీట్‌మెంటూ డైలాగ్సూ రాస్తే మీరు ఆశ్చర్య పోతారు. మాట వరుసకు అక్కచెల్లెళ్లిద్దరూ భర్తలతో పందెం వేస్తారు—' మా సోదర ప్రేమ కంటే మా సోదరీ ప్రేమే గొప్పదనీ, అన్యోన్యమైన'దనీ. చూడండి ఈ మార్పుతో కథకు ఎంత బరువూ, సస్పెన్సు వచ్చిందో!ఇలాంటివి చాలా ఉన్నై రాయాలంటే— రాయదలచలేదు. కావాలంటే దీని తరువాయి కథ 'గుండమ్మ అల్లుళ్ల కథ'గా ఎవరైనా రాసుకోవచ్చు.



# ఎంకిపాటల పుట్టు పూర్వోత్తరాలు

## శ్రీ సోమరాజుపల్లి చెంచయ్య

మన ప్రాచీన ఆంధ్ర జానపద సాహిత్య ధోరణియందు వెలువడిన నవ్య సాహిత్య కుసుమము—నండూరివారి "ఎంకి పాటలు! ఈ పాటలు గత రెండు దశాబ్దములలో—ఆంధ్ర దేశము నాలుగు చెఱగులా—ఒక ఊపు ఊగించాయి.

"ఎంకిపాటలు"—మీద, సాహితీరంగములో గాలి దుమారమే రేగింది. నండూరివారి "ఎంకి" అవతరించక పూర్వము మరో "ఎంకి" ఉండేదని తెలుస్తోంది.

శ్రీ తూమాటి దోణప్పగారు ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాల పత్రిక (1953) యందు "జానపద సాహిత్యము"—శీర్షికను రాసిన వ్యాసమునందు—అనాదినుంచి మన గ్రామ సీమలయందు జనసామాన్యము నోళ్ళయందు నిలిచియుండిన "ఎంకీ పాటలు"- కొన్నిటిని ఉదాహరించి—యిలా వ్యాఖ్యానించిరి.

"ఎంకిపాటలను నొక తెగ గేయములును" ప్రచారమున గలవు. ఈ "ఎంకి" వాగ్విదగ్ధగాదు, ముగ్ధ. నండూరివారి "ఎంకి" లోని, నయగారములు, నాజూకులు మా "ఎంకి" లో, గానరావు. వెర్రిబాగులది. నాగన (రావుల) కందనూరు మెట్టిన యూరట! ప్రియుడు కమ్మవారి, జీతగాడో, రెడ్డిగారి సంబళగాడో. మనసిచ్చి తనతోడ మాటాడదు. సన్నిహితసఖు లింకను బ్రతిమాలినచో, వారితో, కంచము పొత్తే గాని, మంచముపొత్తు కలదనుట కంగీకరింపదు.

"అవతల గిరీలోన
ఆవుల దొడ్డికాడ
మంచంమీదీ మాటా
మనసుకులేదే ఎంకీ
మా పటాళా కాడ
మంచినీళ్ళ బాయికాడ
మరి మరి సూసిన సూపూ
మరిసితివే, ఎంకి ...... "

మరి, యీ ప్రియు డెవడో, మనకు తెలియదు. చిఱునవ్వుల చేమంతుల చెరుగుచు ముంతంత కొప్పు మీదుగా ముసుగిడి, సుంకువేసికొనిన, ముంగారి కంకి వోలె, పొలము పనుల కేగును.

"గూళ్ళ గూళ్ళది కంకి
గుడ్లది సద్ద కంకి
దంచిన మెదగదు మామ
రుబ్బిన మెదగదు మామ ..... "

పొలములో, దాత్కాలికముగ వేసిన, చొప్పగుళ్ళ కంకివి గోయుచు మామతో—మా —మంతి."

"ఎంకూ ఎంకూ నిన్ను
యావూరు కిచ్చినారు
నాగన కందనూరూ నన్నిచ్చినారు ....
చిన్నది గిరి పెద్దది మద్దికేరి
కమ్మోరి జీతగాడే
కత్తెర జులపాలోడే
ఎంకును పొందినాడే
లేదని బొంకుతాడే."

"ఎంకి వస్తాదంటె—సుక్కబొట్టు పెట్టుకుంటి
ఎంకి రాకపాయె ఎంగిలేసి రుద్దుకుంట ....."

వీని నన్నింటిని జూడ నీ "ఎంకి" కులపాలిక, కాదని తెలియుచున్నది."

ఇక నండూరివారి "ఎంకి" 1918 సంవత్సరము తిరువల్లిక్కేణికి శివరామన్ వీధిలో—పుట్టింది. ఈ "ఎంకిపాటలు" అవతరించకపూర్వం శ్రీ వల్లూరి జగన్నాథరావుగారి కోడి పాటలు, గొల్ల పాటలు, విస్కీ పాటలు మొదలైనవి—చల్ మోహనరంగ పాటలూ— సముద్రతరంగాలలాగా ముంచుకొనివచ్చి— కాలేజీ "కారిడార్ల" నిండా, బొబ్బరిల్లి పోతుండేరోజు లవి!

కొన్ని రోజులు నండూరి వెంకటసుబ్బారావుగారు, కాకినాడలో చదివే రోజుల్లో—కాలేజీ కారిడార్లలో—సముద్రపు ఒడ్డునా— యిత త్రా పాడి—తోడి విద్యార్థులను ఆనందింపజేసేవాడట! ఆ తర్వాత పట్ట పరీక్ష చదవడానికి, మదరాసు వచ్చేడు. మదరాసులో, ఉండే రోజులలో—తొలి పాటలు, అవతరించాయి.

అనాడు ఆయన రాసిన తొలి పాట "ముద్దులనా ఎంకి"—శీర్షికను వ్రాయబడిందట!

"గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ
కూకుండనీదురా కూసింతసేపు!
నాకాసి సూస్తాది నవ్వు నవ్విస్తాది
ఎల్లి మాటాడిస్తె యుసిరి కొడతాదీ!
గుండె గొంతుకలోన .... .....
కన్ను గిలికిస్తాది నన్ను బులిపిస్తాది
దగ్గిరస కూకుంటె అగ్గి సూస్తాదీ!
ఈడుండ మంటాదీ
యిలుదూరి పోతాది
యిసిగించి యిసిగించి ఉసురోసుకుందీ!
గుండె .... .....

మందో మాకో ఎట్టి
మరగించినాదీ
పల్లకుందామంటే
పాణ మాగదురా
గుండె గొంతుకలోన
కొట్లాడుతాదీ
కూకుండ నీయదురా
కూసింతసేపూ !" అను, ఈ పాట

యందు—"మందో మాకో ఎట్టి మరిగించినాది"—ఇది సాధారణంగా ఆడవాళ్ళు తమ ప్రియులుగానీ, భర్తలుగానీ—తమకు వశవర్తులుగా మెలగడం కోసరమని, "మర్లు మందు" వాడడము, అనాదినుంచీ మన ఆంధ్రలో అచ్చటచ్చట వ్యవహారంలో ఉండడము—అలాంటి దుష్కృత్యాలవలన, భర్తలు, ప్రియులు దీర్ఘ రోగపీడితులై, దుర్మరణం పాలుగావడం లేదా—యీ విషయము భర్తలకు తెలియడమువలన, కొన్ని కొన్ని కాపురాలు పాడు పడిపోవడమమామూలే !

ఇట్లు ఆడవాళ్ళు పురుషులను తమ వశవర్తులుగా చేసుకొనుటకు చేయు వెర్రి మొర్రి ప్రయత్నముల వలన కలిగెడు దుష్ఫలితములను గురించి భారత కథలో, ద్రౌపది మాటలు వినండి :

"మగని కొవరృు వశ్య విధి మందులు
మాకులు నొందు చందమై
మగనికి దెచ్చు రోగములు .... ...."

ఇలాంటి దురలవాటు అనాదినుంచీ ఉన్నదని చెప్పడానికే ఇంత వివరణము యిచ్చాను. ఈ దురలవాటు, యీనాళ గూడా మధ్య తరగతి కుటుంబాల్లోను, సన్నకారు శ్రామిక కుటుంబాల్లో—కొంతమంది అవినీతి వర్తనులైన ఆడవాళ్ళు ఇలాంటి "మర్లు మందు" తమ భర్తలచేత తినిపిస్తారు. ఇలా చేస్తే, తమ భర్తలు తమ ఇష్టానుసారముగా మెలగుచూ, ఉండగలరనీ, అలాంటప్పుడు తాము వ్యభిచారం" వంటి అవినీతి పనులు చేసినా ఆ భర్తలు, నోరు మూసుకుని, మరీ పడి ఉండగలరని—యీ మర్ల మందులను, తమ భర్తలచేత తినిపిస్తుంటారు.

అలాగే నాయుడుబావ, ఎంకి మీద గల్గిన తొలి ప్రేమ వలన, ఆవిడ కోసరము విరహవేదన పడుతూ—తన యీ వేదనకు—ప్రియురాలైన ఎంకి, తన కేమైనా "మర్ల మందు" పెట్టిందేమో (?)—అని సందేహిస్తాడు.

ఆ తర్వాత సుబ్బారావుగారి కలమునుంచి అవతరించిన రెండవ పాట—"సత్తెకాలపు ఎంకి" అనేది. ఈ పాటకు తొలుత పెట్టిన, పేరు—"నాయుడుబావ". ఈ పాట అవతరించిన తొలి దినాల్లో యిలా ఉండే దన్నారు, స్వర్గీయ శ్రీ బసవ రాజు అప్పారావుగారు :

"వరుకు లేమి కావాలె
సంతః పిలా ?" అని
నాయుడుబావ, అడిగితే—

"నే మురుకుతార యింటి కాసి
నాయుడుబావా" అంటుంది ఎంకి.

ఈ చరణము బసవరాజుగారికి కర్ణ కఠోరముగా ఉండి, మందలించడం వలన— "నువ్వు మరమ విడిచి
మనసియ్యి నాయుడుబావా."

అని, సంస్కరించారు. ఈ రెండు పాటలూ రాసిన నాటికి, సుబ్బారావుగారు "ఎంకి పాటలు" అని నామకరణము చేయ లేదని అప్పారావుగారి వ్యాసము వలన తెలియుచున్నది. మరి "ఎంకి పాటలు" అని ఎప్పుడు నామకరణం చేసిందీ తెలియ డానికి శ్రీ అప్పారావుగారి మాటలనే మీకు వినిపిస్తాను.

"ఎంకి పేరు మొట్టమొదట "జాము రేతిరి వేళ" అను పాటలోనే కనిపించింది. అప్పటి రూపంలో ఆ పాట" ఒయ్యారి నాగుండు నా ఎంకి" అని తూరుపు కాపువాళ్ళ భాష కనురూపంగా ప్రయోగములు చేశాడు కవి. కాని, ఆ శబ్దధ్వని బాగుండకపోవటంచేత "ఒయ్యార మొలికించు నా ఎంకి" అని దిద్ది విమర్శకుల విమర్శనము కొంతవరకు మన్నించినందులకు సంతోషించవలసిందే. అదేమి ఖర్మమో గాని, నాకీపాట నాటి నుండి నేటివరకు రుచించలేదు. పండిత ప్రకాండులు, చాల మంది దీనిని మెచ్చుకున్నారట. కాని, ఇందు భావ సౌందర్య మేమో నాకు గోచరించుటలేదు. చీకటిలో నుండి వచ్చిన పండితుల కొక్కమారు కన్నులు మిరుమిట్లు గలిగినవో లేక నా కందరాని నిగూఢ సారస్య మిందేమైనా, ఉన్నదో ! అటు తరువాత ఆ యేడే "ఎంకి ముచ్చట్లు" "ఎంకితో తిరపతి", "ఏటి దరి నాఎంకి"—అనే, పాటలు బయటబడ్డవి."

*　　*　　*　　*

ఎంకి పాటలు పాతవి—కొత్తవి—వేరువేరుగా ఒకే పుస్తకముగా వెలువడినవి. ఇవిగాక, ఆ తర్వాత వ్రాయబడిన "బాగోతం", "ఎంకి వరం" లాంటి పాటలు "భారతి" యందు 1956 ప్రాంతమునందు ప్రకటిత మైనాయి. ఈ పాటలయందు భాషలోను, భావనలోను, వినూత్న పరిణతులేర్పడి—నాయుడు—ఎంకి దంపతులు, అరుంధతి దంపతులవలె ప్రత్యేకముగా కనబడుతుంటారు. నండూరి వెంకటసుబ్బారావుగారు వారి కజ్జాల తీర్పరిగా మనకు దర్శన మిస్తుంటాడు.

*　　*　　*　　*

ఆకాశవాణి ద్వారా "ఎంకి పాటలు" రూపకములుగా, నాటికలుగా, వినిపించబడుతున్నాయి. కొన్ని ఎంకి పాటలు, సినిమా చిత్రాల్లో గూడా ఉపయోగించబడ్డాయి.

ఇక "ఎంకిపాటలు" అనునవి, ఆంధ్రదేశ గ్రామీణ యువతీ యువకుల ప్రణయజీవితాన్ని—తెలియజేసేవి మాత్రమే గాక, మారుతున్న ఆంధ్ర గ్రామసీమయందు, క్రొలాను గుణ్యముగా కనుమరుగై పోయిన ప్రాచీన జానపద జీవితాన్ని తెలియజేసే—జానపద జీవిత కైఫీయత్ అంటే సరిపోతుందనుకుంటాను. (ఈ వ్యాసరచనకు ఉపకరించిన, వ్యాస రచయితలకు, ఆంధ్రపత్రికా సంపాదకులకు, ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాల పత్రికా నిర్వాహకులకు కృతజ్ఞుడను.)



# ఫ్రాన్సిస్ థామ్సన్ మహాకవి

శ్రీ జి. కృష్ణమూర్తి

మహానుభావుల జీవిత చరిత్రలు మహావింతగా ఉంటాయి. ఆ మహానుభావుడు మహాకవికూడా అయితే మరి చెప్పనే అక్కర్లేదు.

ఒక కవిని పేదవాడని తెలియజెయ్యటంలో ప్రత్యేక అర్థం గోచరించకపోవచ్చు. సుమారుగా కవులంతా పేదవారే. పేదతనాన్ని కొలిచే కొలతబద్ద ఏమిటి? ఎక్కడనుండి కొలవాలి? కొలతకి అందని అధోగతిలో ఉన్న పేదరికానికి ప్రత్యేకమైన పేరేదన్నా ఉందా? ఆ జీవితం ఎలా ఉంటుందో, ఏం చేస్తే అర్థం అవుతుంది? ఉండడానికి ఇల్లు, తినేందుకు తిండిలేకపోతే పేదవాడని అర్థం. మనం సాధారణంగా తెలుసుకోడానికి ప్రయత్నం చేసేదికూడ అంతవరకే. గాని ఆపైన అతని జీవితం ఏవిధంగా ఉందన్న విషయం మనం తీసుకోడము. మనకు అర్థంకూడ కాదేమో!



థామ్సను కవి పేదవాడో కాదో నాకు తెలియదు. బహుశ ఆ విషయం ఆయనకే తెలిదేమో గాని అతని జీవిత విశేషాలు ఇవి: 1859 లో ఒక కేథలిక్కు కుటుంబంలో జన్మించేడు. జ్యేష్ఠుడు. ఒకే ఒక్క కొడుకు— తర్వాత ముగ్గురూ ఆడపిల్లలే.. ముందర ఒక కుమారుడు పుట్టి ఒకటి రెండు రోజులకే పోయాడు. తండ్రి మంచి ప్రాక్టీసున్న హోమియో వైద్యుడు. గారాబానికి కొదవులేదు.

థామ్సను ఏడో ఏటే షేక్స్పియర్ను, మిల్టనులతోపాటు లాటిన్, గ్రీకు కవుల రచనలు కూడా చదివేడు. తన వయసు పిల్లలు బయట ఆడుకుంటూ ఉంటే తను మూల గదిలో పుస్తకాల దొంతర్ల మధ్య కూర్చుని చదువులో లీనమయ్యేవాడు. ఎప్పుడూ

ఏదో ఆలోచిస్తూ ఉండేవాడు. పది సార్లు పిలిస్తేనేగాని మన లోకానికి వచ్చేవాడు కాదు.

తల్లితండ్రులిద్దరూ మతంలో బాగా విశ్వాసం ఉన్న వాళ్లవటంచేత భగవద్భక్తిగల వారవటంచేత కొడుకును మత ప్రచారకుడిగా తయారు చెయ్యాలని ''ఉషా'' కాలేజీకి చదువుకు పంపారు. తొమ్మిదేళ్ల వయస్సులో థామ్సను తొలిసారిగా ఇల్లు వదలి రెండు వందల మైళ్ల దూరంలో ఉన్న ఈ కాలేజీకి వెళ్లేడు. మంచి తెలివైన వాడని మాష్టర్లు మెచ్చుకున్నారు. ఆ వయస్సులో లాటిను భాష కొరకరాని కొయ్యగా మిగత విద్యార్థులు బాధ పడ్తూ ఉంటే థామ్సను ఆ భాషలో పద్యాలు రాసేడు. ఇంగ్లీషు, గ్రీకు భాషల్లో ఎప్పుడు ప్రథమ శ్రేణి. కాని కాలేజి నియమాలు పాటింపు విషయంలో నిత్యం వార్నింగులు వస్తూ ఉండేవి. రాత్రంతా చదువుతూ ఉండటంవల్ల వేళకు ఉదయం లేవలేక పొయ్యేవాడు. ఏడేళ్లు చదివాక, ఈ కారణం వల్లే దైవ సంకల్పం వేరుగా ఉన్నదని, ఈ చదువు ఇంక మాన్పించవల్సిందని ప్రధా నోపాధ్యాయుడు డాక్టరు థామ్సనుకు ఉత్తరం రాశాడు.

పోనీ, తనలాగే వైద్యుడవుతాడని ఓవెన్సు కాలేజిలో (మాంచెస్టరు) వైద్య విద్యార్థిగా ప్రవేశపెట్టాడు. కొడుకును డా.థామ్సను. అప్పటికే సాహిత్య రంగంలో మునిగి, ఈతకొడ్తున్న థామ్సనుకు ఈ వైద్య విద్య రుచించలేదు. అక్కర్లేదని కచ్చితంగా చెప్పేందుకు తగిన ధైర్యం లేకపోయింది. ఆరు సంవత్సరాలు విద్యార్థిగా నటించాడు. ఏనాడు కాలేజికి వెళ్లలేదు. అతనుండేది మాంచెషరు గ్రంథాలయాల్లో— తప్పితే క్రికెట్టు మైదానంలో. మెడికలు కాలేజిలో ప్రవేశించిన ఏడే జబ్బుచేసి కొన్ని నెలలు బాధపడ్డాడు. టైఫాయిడన్నారు. అదే యావజ్జీవ శత్రువు, మృత్యువుకు కారణం అయిన క్షయకు ప్రారంభ దశ అయి ఉండవచ్చు. ఈ రోజుల్లో నే థామ్సను నల్లమందుకు అలవాటు పడ్డాడు— 'లాడినం' అనే ద్రవ రూపంలో దీనిని త్రాగేవాడు. ఇది త్రాగితే నొప్పి తగ్గేదట.

కాలేజి ముఖం చూడని విద్యార్థి— పరీక్షలు పోవడంలో ఆశ్చర్యమేముంది? గాని తండ్రి ఈసారి నిలవదీసి అడిగాడు. మాటామాటా అనుకున్నారు. తల్లిపోయిఇప్పటికిలయిదేళ్లయింది. ఇల్లువదలిపోయాడు థామ్సను కట్టుగుడ్డలతో,కానీ ఆస్తిలేకుండా. లండను చేరాడు. తర్వాత మూడేళ్లు లండనులో అతను అనుభవించిన జీవితం విశ్వసాహిత్య చరిత్రలోనే నమ్మలేని, మరుపురాని విశేష ఘట్టాల్లో ఒకటి.

రాత్రులు విక్టోరియా ఎంబేంకుమెంటు మీదో కవెంటు గార్డెను దుకాణాల ముందో ఆకలితో పడుకొనేవాడు. ఈ దేశపు చలి అనుభవించవల్సిందేగాని వర్ణించటం కష్టం. వార్తా పత్రికలు పర్చుకుని — కప్పుకోటానికి ఏ మాత్రం లేకుండానే రాత్రిళ్లు నిద్రలేక సూర్యోదయం కోసం మార్కెట్టు గడియారం ముల్లు చూస్తూ కాలం గడిపేవాడు. పగలు కూలికని ప్రయత్నం చేసేవాడు. గుర్రాలను కాచేవాడు — ఈ నాడు సైకిళ్లు కాచినట్లు. బూట్లు పాలిష్ చేసేడు, న్యూస్ పేపర్లు అగ్గిపెట్టెలు రోడ్లమీద అమ్మేడు. ఏది ఎలాగున్నా తప్పనిసరిగా ఏదో ఒక గ్రంథాలయానికి వెళ్లి రోజు ఏవో కొత్త పుస్తకాలు చదివేవాడు. ఈ చదువులో ఆకలి మర్చిపోయేవాడు. గాని అనతి కాలంలోనే గ్రంథాలయాల తలుపులు ఇతనికి మూసివెయ్యబడ్డాయి. గ్రంథాలయ నియమాలకు తగిన మంచి దుస్తులు లేకపోవటంవల్ల ఇతన్ని అధికారులు మరి రానివ్వలేదు. అది మొదలు అన్నం, ఆశ్రయం లేకపోగా ఓ విధమైన ఆవేదన కూడా అనుభవించేవాడు. లండను మహా నగరంలో లక్షలు జనం గల నగరంలో థామ్సనుకు ఒక్కడు కూడా పలుకరించే వ్యక్తి లేకపోయాడు. శారీరకంగానూ, మానసికంగానూ కూడా ఏ ఒక్క వృత్తికి సరిపోలేదు. ఏ రీతమైన దైవభక్తి, ఆత్మశక్తీ ఏ పరిస్థితుల్లోను కోల్పోలేదు. థేమ్సు నదిమీద, ఛారింగ్ క్రాసు బజారులోనూ అనుక్షణం ప్రతి చోట కూడ దేవుడి నీడ చూస్తూనే ఉండేవాడు. అయితే అది ఆకలిమంటను శాశ్వతంగా ఆర్పలేదు.

ఈ పరిస్థితుల్లో అతని జీవితంలో కొన్ని విచిత్ర సంఘటనలు జరిగాయి. ఒకప్పుడు వర్షంనుండి తలదాచుకోడానికి పొంచిఉన్న థామ్సనును ఆ భవనం ముందు ఉండకూడదని గెంటివేసిన పోలీసులే ఓసారి తాత్కాలిక అనాయాచిత సహాయం చేసేరు. మరునాడు ఓ ధనికుడు థామ్సను వద్ద న్యూసుపేపరు కొని 'పెన్నీ' కి బదులు 'ఫ్లొరెను' ఇచ్చేడు. వెంటనే థామ్సను కూడ గమనించలేదు. తర్వాత ఆ ఫ్లొరెను వాపసుచేసే ఉద్దేశంతో ఆ ప్రదేశమంతా వెదికాడు. ప్రయోజనం లేకపోయింది. భగవత్సంకల్పం అనుకున్నాడు. గాని వీటితో అతని సమస్యలు ఎప్పుడూ తీరలేదు. అన్నిటికంటే అతి విచిత్రమైన సంఘటన ఒకటి జరిగింది. తనకేమల్లే తిండికి లేని మరో వ్యక్తితో అతనికి స్నేహం కుదిరింది. లండన్ నగరం నాటికీ, నేటికీ కూడా దూరపు వారికి ఊహానగరమే, వైకుంఠపురమే. ఎల్లాగైనా లండను చేరి పడితే గొప్పవారం అవచ్చని, గొప్ప పేరు తెచ్చుకోవచ్చని దేశ దేశాల్నుండి వచ్చే జనం సంఖ్య వేలూ, లక్షలు. ఇందులో నూటికి తొంభై తొమ్మిది పాళ్లు ఏమైపోతారో తెలీదు. ఈవిధంగా వచ్చే జనంలో స్త్రీలు కూడా ఉంటారు. వేల సంఖ్యలోనే ఉంటారు. ఏ ఉద్దేశంతో వచ్చినా ఆఖరుకు గత్యంతరంలేక కాబోలు

వీరిలో చాలమంది వేశ్యలై పోతారు.. అటువంటి ఒకయువతి థామ్సను కవి ప్రాణం కాపాడింది.

'A child;—, a spring flower; but a flower
Fallen from the budded Coronal of Spring,
And through the city-streets blown withering.
. . . . . . . . . . . . . . . . . . . . . .
And of her own scant pittance did-she give
that I might eat and live.

అని ఆమె చరిత్రను తన 'Sister songs' అనే కవితలో వర్ణించాడు. అయితే ఈమెలో ఉన్న గొప్పతనం అతనికి అత్యవసర పరిస్థితుల్లో చేరదీసి, సేవజేసి, ప్రాణం కాపాడటమే కాకుండా కొంతకాలానికి అతని కవిత్వం అర్థం చేసుకొని, ప్రచురించి, స్నేహం, ఆశ్రయం కూడా దొరికినప్పుడు ఈమె అతనికి ఎక్కడికి వెళ్తున్నదీ కూడ తెలియజెయ్యకుండానే మకాం ఎత్తేసింది. ఈవిధమైన త్యాగం సాధారణంగా అర్థం అవదు. ఒకసారి థామ్సనుతో ఆమె అంది : 'మన ప్రేమ వారికి అర్థంకాదు' అని. ఆమెకోసం సుమారు ఆరు మాసాలు లండను వీథులన్నీ వెదికాడు థామ్సను. ప్రయోజనం లేకపోయింది.

Merry England అనే పత్రికకు సంపాదకుడు wilfrid Meynell. ఇతను ఒక గొప్ప కవయిత్రి Alice Meynell కు భర్త. ఈ పత్రికకు థామ్సను ఒక పద్యాన్ని ఒక వ్యాసాన్ని పంపాడు. వీటిని చెత్త కాగితాలమీద రాసేట్ట. సాధారణంగా యీ కవి ఆ రోజుల్లో చెత్త కాగితాలు, న్యూసు పేపరు 'మార్జిన' లను తన వ్రాతకు ఉపయోగించి వాటినే ప్రచురణార్థం పత్రికలకు పంపేవాడు. పత్రికలకు పంపటానికే తగిన పోస్టు బిళ్లల సొమ్ముకు కష్టంగా ఉండేది. ఇక ప్రచురించని పక్షంలో తిరిగి పంపేందుకు సరిపోయే బిళ్లలు పంపే ప్రశ్నే లేదు. ఆవిధంగా ఎన్నో రచనలు శాశ్వతంగా నాశన మయ్యాయి. తను సాధారణంగా పగటివేళలు గడిపే Strand బజారులోనే ఈ పత్రిక కార్యాలయం ఉండటంచేత థామన్సు వీటిని స్వయంగా వారి పోస్టుబాక్సులో విడిచేడు. గాని, తిరిగి పంపమని పోస్టుబిళ్ల పెట్టి తనకు ఇల్లూ, వాకిలీ లేని కారణాన Pl send your reject to the Care of Charing cross Post office అని వ్రాసేడు.' అందిన ఆరు నెలల వరకు ఆ పత్రిక సంపాదకుడికి ఆ రచనలు చదివే అవకాశం దొరకలేదు. చదివి, మెచ్చుకొని తన్ను కల్సుకోవలసిందిగా అతనిచ్చిన ఎడ్రసుకు ఉత్తరం వ్రాసాడు. గాని, అది dead letter office నుండి తిరిగి వచ్చేసింది. రెండు నెలలు ఎదురుచూసి విసిగి థామ్సను మరి ఆశ వదులుకోటంవల్ల ఆ ఉత్తరం అతనికి అందలేదు. అనేక ప్రయత్నాలు చేశాక థామ్సను తెల్సుకోటం జరిగింది. అది మొదలు థామ్సను జీవితాంతం మేనెల్ (Meynell. అతనికి తల్లి, తండ్రి, దైవం అన్నీను. 1907 థామ్సన) పోయిన తర్వాత మేనెల్లే మరి నలభై ఏళ్ల బతికాడు ఈ నలభై ఏళ్లు కూడా థామ్సను రచనల పట్ల అతను నిర్విరామకృషి చేశాడు. వీరి స్నేహం సాహిత్యరంగంలో సాటిలేనిది.

వీ రిద్దరికి పరిచయమయ్యే నాటికి థామ్సనును పరిక్ష చేసిన ఒక వైద్యుడు ఇతనిక ఆరు వారాలకన్న ఎక్కువ బతికే అవకాశం లేదన్నాడు. ఎంత ప్రయత్నం చేసినా థామ్సను ఆస్పత్రిలో చేరనన్నాడు. అవి అతను తన ప్రాణం నిలబెట్టిన ఆ స్త్రీని వెదుకుతున్నరోజు లన్నమాట. తర్వాత ఎలా గైతేనేం వైద్యానికి అంగీకరించాడు. మేనెల్లె అతని నల్ల మందు వ్యసనం మాన్పించి, గాలి మార్పులని 'స్టారింగ్టన్ను' అనే గ్రామానికి పంపాడు. అక్కడ ఒక కేథలిక్కు మత ప్రచారకుల ప్రత్యేక పరిచర్యతో ఒక సంవత్సరంలో ఆరోగ్యం పూర్తిగా కోలుకొని తిరిగి లండను వచ్చేడు థామ్సను.కవ్వితం సాఫీగా ప్రవహించింది. ఈ కొత్త పేరు ఎవరా అని అంతా ఆశ్చర్యపోయారు. ఆనాటి రాజకవి లార్డు టెన్నిసన్ ఇతని కవిత్వాన్ని మెచ్చుకున్నాడు. కార్డినల్ మానింగు ఇతన్ని చూడాలని తహతహ పడ్డాడు. ఈలోగా జగత్ప్రఖ్యాతి గాంచిన 'Hound of Heaven' ప్రచురించబడింది. ఆంగ్ల సాహిత్య రంగంలో అసమాన జ్యోతి వెలిగిం దన్నారు వ్యాఖ్యాతలు. అన్ని పత్రికలు ఇతన్ని ఆకాశానికి ఎత్తేశాయి. ఈ ప్రశంసలు తనకి కావేమో అన్నట్లుగా థామ్సను వాటిని ఎప్పుడు గుర్తించనైనా లేదు. లండను నగరం ఈయన రచనల ప్రభావంతో మోహిత్వం జెంది మరొక రచయితనే చూడని రోజుల్లో థామ్సను కవి లండను నగరం వదలి 'నార్తు వేల్సు' లో ఒక పల్లెటూరిలో ఉండేవాడు. గాని తనకు ఎప్పుడూ లండను అంటే ప్రత్యేకమైన ప్రేమ.

వేల సంఖ్యలో ఇతని పుస్తకాలు అమ్ముడయి నప్పటికీ ఇతను ఆర్థికంగా గొప్పవాడు కాలేకపోయాడు. అందుకు అతను ఏనాడు ఆశించలేదు. పోగా అతని రచనలు ప్రచురించి పారితోషికం "చెక్' సంపాదకులు పంపితే ఆ కవర్లు విప్పకుండ అలాగే పడి ఉండేవి. ఒకటి రెండు సార్లు అటు

వంటి కవర్లతో ఆయన తన సిగరెట్టు ముట్టించుకోవటం, చెక్కు కాలిపోవటం సంభవించాయి. అది మొదలు సంపాద కులు చెక్కులను అతని ఇంటి యజమానికో, మిత్రుడైన Meynell కో పంపేవారు.

థామ్సను రచనల ప్రభావంవల్ల ఆయన్ని చూడాలని ఎంతోమంది ఉత్సాహపడేవారు. గాని, ఆయన దొరకటం కష్టం. క్రైస్తవ మతాధిపతి 'పోపు' రోము నగరం నుండి ఉత్తర మిచ్చి ఒక ప్రత్యేక దూతను పంపాడు. చూడకుండానే ఆ వ్యక్తి వెనక్కి వెళ్లవల్సి వచ్చింది. 'మహాకవుల దైనందిన జీవితం' అనే శీర్షిక క్రింద థామ్సనుకవిని ఇంటర్వ్యూ చెయ్యటానికి అమెరికా నుండి ఒక పత్రికా ప్రతినిధి వచ్చాడు. థామ్సను దొరకలేదు.

దేశదేశాలా థామ్సనుకవి రచనలు ప్రఖ్యాతి చెందాయి. తర్జుమా లయ్యాయి, ప్రత్యేక వ్యాఖ్యానాలు వచ్చాయి. భారత దేశం ఈ విషయంలో ఏవిధంగానూ వెనుకపడలేదు. మహాత్మా గాంధి ఈయన రాసిన Hound of Heaven ను ఆగాఖాన్ భవనంలో ఉన్నప్పుడు చదివి ఆనందించారు. శ్రీ రాజ గోపాలాచారి యీ రచనకు వ్యాఖ్యానం రాశారు. అప్పటి వైస్రాయ్ అయిన లార్డు వేవెల్ యీ కవిపైన మరెవ్వరి మీదా లేని భక్తిశ్రద్ధలు చూపాడు. Hound of Heaven ను లార్డు వేవెల్ సర్వకాల సర్వావస్థలలోను చదివాడట. ముఖ్యంగా యుద్ధభూమిలోను, ఇతర ప్రమాద పరిస్థితుల్లోను యీ రచనను ఆయన తిరిగి తిరిగి చదివేవాడు.

కేథలిక్కు మతంలో 'డాంటే' కవి తర్వాత ఈయనే మహాకవి అని అంటారు. ఇటువంటి మహాకవి జీవితం నాకు ప్రత్యేక అభిమాన వస్తువుగా దొరికినందుకు ఎంతో గర్వ పడుతున్నాను.

1913 నాటికి థామ్సను కీర్తి అత్యంత ఉన్నత స్థాయి చేరుకుంది. ఆంగ్ల సాహిత్యంలో షేక్స్పియరు తర్వాత ఇంతటి మహాకవి మరొకడు లేడన్నారు. షెల్లీ, కీట్సు, టెన్నిసన్‌లు థామ్సన్‌తో పోల్చటానికే అర్హులు కారన్నారు. ఈ తరహా వ్యాఖ్యాతలలో మహామహులు లేకపోలేదు. ఆర్నాల్డు బెన్నట్టు, క్విల్లరు కూచి, గార్విన్ వంటి వ్యక్తులు జేజేలు అర్పించారు. థామ్సనుకు. ప్రీ—రాఫలైటు తెగకు చెందిన సర్ ఎడ్వర్డు బర్న్సు జోన్సు థామ్సనుకవి రాసిన హౌండు ఆఫ్ హెవెన్ చదివి సమ్మోహనం జెందాడు. ఈ రచనను మనసులో వర్ణించు కుంటూ పరధ్యానంగా దుస్తులను తొడిగి, తిరిగి విప్పి, మళ్లీ తొడుక్కొని మళ్లీ విప్పివేస్తే భార్య ఆశ్చర్యపోయిందట. ఈ పద్యం చదువుతున్న తను ఏం చేస్తున్నది తనకే అర్థం కావటంలేదన్నాట్ట. ఇక ఇంగ్లాండు దేశంలోని యూనివర్సిటీల విద్యార్థులు టెన్నిసనుకు బదులు థామ్సను విద్యావిషయంగా కావాలని ఆందోళన తీసుకొచ్చారు. ఆ సంవత్సరంలోనే ఫ్రెంచి, జర్మనీ, ఇంగ్లీషు భాషల్లో థామ్సను కవి జీవిత చరిత్రలు వ్రాయబడ్డాయి. సులభంగా అర్థం కాకపోయినా థామ్సను రచనలను ప్రత్యేక శ్రద్ధతో ప్రజలు చదివేవారు. ప్రతి సాధారణ కుటుంబీకుడు తన చిన్న లైబ్రరీలో బైబులు షేక్స్పియరు పక్క థామ్సను పుస్తకం లేకపోతే అది వెల్తిగా తలచేవాడు.

మరో సంవత్సరంలో యుద్ధం వచ్చింది. మనుషులు, ఆలోచనలు కూడా మారిపోయాయి. ప్రపంచమే మారిపోయింది. కాలప్రవాహం దారి తప్పింది. ఇప్పటి కింకా రస్తాలోకి రాలేదు. థామ్సనును ప్రపంచం మర్చిపోవటంలో ఆశ్చర్యంలేదు.

మానవులలో మరుపు మార్పు ఉండక తప్పదు. ఇవి ఉన్నంతకాలం మహాత్ముల జీవితాలు బండి చక్రాల్లాగా క్రిందకు మీదకు అవుతూ ఉంటాయి. బురదలో ఇరుక్కుపోయి చలనమే లేకపోవటం కంటే ఇదే చాల మంచిది. ఈ యోగ్యత బహు కొద్దిమందికే దక్కుతుంది. ఇదే గొప్ప తనానికి నిదర్శనం.

---

## థామ్సన్ సొసైటీ

**1963 సం॥ నవంబరు 15 న లండనులో ఫ్రాన్సిస్ థామ్సన్ సొసైటీ స్థాపించబడినది. ప్రారంభోత్సవం లార్డ్ ఇల్‌ఫర్డు అధ్యక్షతను జరిగింది. ఎర్నెస్టురేమెండు, థామ్సన్ కవిని గురించి మాట్లాడారు. 16 నవంబరు నుండి 23 నవంబరు దాకా థామ్సను గురించిన వస్తుప్రదర్శన జరిగినది. ఈ ప్రదర్శనలో, థామ్సన్ గ్రంథాలు, చిత్రాలు వ్రాతప్రతులు, ఉత్తరాలు మొదలైనవి ప్రదర్శింప బడినవి.**

**థామ్సన్ సొసైటీ అనేది ఆయన గతించిన అర్ధశతాబ్దానికి ఏర్పడినది. ఈ సొసైటీని స్థాపించిన ఘనత ఒక ఆంధ్రునికి దక్కినది. ఆయన జి. కృష్ణమూర్తిగారు. (ప్రస్తుతం వారు లండను విశ్వవిద్యాలయంలో (సాహిత్యం) పి. హెచ్. డి. కి**



శ్రీ జి. కృష్ణమూర్తిగారు

చదువుతున్నారు. విద్యావ్యాసంగంతోపాటు ఒక ప్రచురణ సంస్థలో పనిచేస్తున్నారు.

కృష్ణమూర్తిగారికి థామ్సన్ ఆరాధ్యదైవం. కేవలం వెర్రిభక్తి అనవచ్చు. కొద్ది సంవత్సరాల క్రితం కాలేజీలో చదువుతూండగా ఆయన థామ్సన్ పుస్తకం ఒకటి చదవటం తటస్థించింది. దానిపేరు Hound of Heaven. అదే మొదటిసారి థామ్సన్ కవితా రసాన్ని రుచి చూడటం. ఆ తరువాత వదలలేక పోయారు. థామ్సన్ భక్తి యోగంలో పడ్డాడు. ఆయన స్మారక చిహ్నాస్థాపనకు తనను అంకితం చేసుకున్నాడు. సొసైటీ ఏర్పాటుచేసి థామ్సన్‌కు సంబంధించిన పుస్తకాలు, ఉత్తరాలు, వ్రాతప్రతుల చిత్రాలు ఎక్కడెక్కడి నుంచో వందలకొద్దీ సంపాదించాడు. ఆయా దేశాలలో థామ్సను గురించిన పరిశోధనా విషయాలను సొసైటీ సాలీనా ప్రచురించబోయే సంచికలో ప్రకటిస్తారు. థామ్సన్ కవిత్వాన్ని వివిధ భాషలలో ప్రచురించ ప్రోత్సహిస్తారు. లండనులో థామ్సన్ కవి ఉన్న భవనాన్ని ఈ సొసైటీకి సంపాదించటానికి కూడా ప్రయత్నాలు జరుగుతున్నాయి. కృష్ణమూర్తిగారు ఈ సొసైటీకి కార్యదర్శి. వారి కృషికి అనేకమంది పెద్దల సహకారం ప్రోత్సాహం లభించాయి. లార్డు ఇల్ ఫర్డు, కేంబ్రిడ్జిలోని కింగ్సు కాలేజి ప్రొఫెసరు షేన్ లెస్లి ముఖ్యంగా పేర్కొన దగినవారు. శ్రీ లెస్లి పూర్వప్రధాని విన్‌స్టన్ చర్చిల్‌కు దగ్గర చుట్టం. (వారు వ్రాసిన ఉత్తరాలు ఇవి).

Kings College
Cambridge

Nov 13, 1963

Dear Sir

May I congratulate you on the achievement of an exhibition to the memory of Francis Thompson. I am grateful for the invitation which I cannot accept as I am far this week at Cambridge. The relics you describe are fascinating and I only regret that Mrs & Mr Meynell have not survived to be present.

You have certainly done more for Francis Thompson than any living. We shall all continue to be grateful to you.

I shall look forward to seeing the eventual building —

I hope the Press will appreciate your work

Yrs sincerely

Shane Leslie



28 Nov. 1963

FROM THE LORD ILFORD, M.C., T.D., Q.C.
12, CHURCH ROW.
N. W. 3.

Dear Mr. Krishnamurti,

Thank you for your letter. It was kind and thoughtful of you to write.

I can assure you that the Hampstead Subscription Library was very glad to put the Library rooms at your disposal.

I am very glad that you found Miss Moore helpful.

As I told you on Sunday, the Exhibition did you the greatest credit. It was wonderfully complete, and would have done credit to the Book League or one of the big museums.

The Library, so long as we exists, will always be glad to help the Francis Thomson Society.

Sincerely yours,

Ilford.

కృష్ణమూర్తిగారి స్వగ్రామం బరంపురం, జననం పర్లాకిమిడి విజయనగర విశాఖపట్నాలలో విద్యాభ్యాసం. అమలాపురం కాలేజీలో మూడు సం॥లు. బిలాస్‌పూర్ కాలేజీలో నాలుగు సం॥లు లెక్చరర్‌గా ఉన్నారు. గత మూడేళ్లుగా లండనులో చదువుతున్నారు. వీరి శ్రీమతి విశాఖపట్నం మెడికల్ కాలేజీలో కెమిస్ట్రీ లెక్చరర్‌గా ఉన్నారు. కృష్ణమూర్తిగారి లండను చిరునామా 33, Gayton Road, London. N. W. 3

# ప్రణాళికలు: పెట్టుబడులు

శ్రీ ఎం. ఎ. మాస్టర్

**1951** నుంచి ప్రణాళికాబద్ధమైన ఆర్థిక వ్యవస్థ కింద శ్రేయోరాజ్య స్థాపనకు భారతదేశం కృషి చేస్తున్నది.

ముందుగా ప్రణాళికను సిద్ధంచేసి, ఆ తర్వాత దాని అమలుకు అవసరమైన నిధులను సమకూర్చడానికి ప్రయత్నించాలా లేక అందుబాటులో ఉన్న నిధులను ముందుగా అంచనా వేసుకొని అందుకు అనువైన పథకాన్ని ఆతర్వాత రూపొందించుకొనాలా అనే విషయం జోలికి ఇప్పుడు పోవలసిన అవసరం లేదు. ఆచరణకు సంబంధించినంతవరకు ప్రణాళిక అనేది ఒకటి ఉంది. ఈ ప్రణాళికకు పబ్లిక్ రంగంలో 7,500 కోట్ల రూపాయలను, ప్రయివేటు రంగంలో 4100 కోట్ల రూపాయలను, మొత్తం 11,600 కోట్ల రూపాయల పెట్టుబడిని ఉద్దేశించారు. అయినప్పటికి తృతీయ ప్రణాళికకు ఉద్దేశించిన వ్యయం 10,400 కోట్ల రూపాయలని జరుగుతున్న అధికార ప్రకటనలు హర్షనీయం కావు. పబ్లిక్ రంగంలో ఉద్దేశిస్తున్న 1200 కోట్ల వ్యయాన్ని మినహాయించి, వీరీ అంకెను చెబుతున్నారు. ఈవిధంగా ఈమొత్తాన్ని ఎందుకు మినహాయిస్తున్నారో, నిల్వల జాబితాగా 800 కోట్ల రూపాయలను ఎందుకు కలుపుతున్నారో, 11,600 కోట్లు కాక 10,400 కోట్ల రూపాయల వ్యయాన్ని ఉద్దేశిస్తున్నామని ఎందుకు చెబుతున్నారో అర్థం కాకుండా ఉంది. తృతీయ ప్రణాళిక నిధులను సమకూర్చడం అనే సమస్య వచ్చినప్పుడు, లెక్కకు తీసుకొనవలసింది 10,400 కోట్ల రూపాయలు కాక 11,600 కోట్ల రూపాయలను మాత్రమే. అందువల్ల ఈ మొత్తాల వ్యత్యాసాన్ని గురించి సంతృప్తికరమైన సమాధానాన్ని ప్రణాళికాసంఘం నివేదికల నుంచి పొందవలసి ఉంది.

ప్రణాళిక కింద ఉద్దేశించిన కార్యక్రమాలను, ప్రాజెక్టులకు అవసరమైన సొమ్మును ఎంతగా సమకూర్చవచ్చునో అంచనా వేయడానికి ముందు ప్రణాళికా సంఘంవారు ఆచారంగా అనుసరిస్తున్న పద్ధతి ఒకటి ఉంది. దాని ప్రకారం ప్రణాళికను ఆరంభించిన సంవత్సరంలోని (1961 మార్చి 31 నాటికి) పన్నుల ప్రాతిపదిక ప్రకారం కేంద్ర—రాష్ట్ర ప్రభుత్వాల రెవెన్యూలో మిగులు తేలగల మొత్తాలు, అయిదేళ్లమీద ఎంతగా ఉండగలవో, ప్రణాళికకు ఎంతగా వాడుకొనవచ్చు ననేది మదింపు వేస్తారు. ద్వితీయ ప్రణాళిక కాలంలో 240 కోట్ల రూపాయల మేరకు అదనపు పన్నులు విధించారు. ఇలా విధించిన అదనపు పన్నులవల్ల తృతీయ ప్రణాళికా కాలంలో 1200 కోట్ల రూపాయలకు మించిన రెవెన్యూ రాగలదు. మన ఆర్థిక వ్యవస్థలోని చురుకుదనం, అభివృద్ధి కారణంగా, ఈ అదనపు పన్నులవల్ల వచ్చే రాబడి 1200 కోట్ల కంటె మిన్నగానే ఉంటుంది. కాని, ఏ పరిస్థితులలోనూ తగ్గదు. అయితే ప్రణాళికాసంఘంవారు మాత్రం ఈ పద్దు క్రింద 9250 కోట్ల రూపాయలను మాత్రమే చూపుతున్నారు. ఖర్చు అనేది, అభివృద్ధి పథకాలకు, అభివృద్ధితో నిమిత్తంలేని ఇతర ఖర్చులు చేర్చి 8,700 కోట్ల రూపాయల వరకు ఉన్నాయి. కనక రెవెన్యూ మిగులు అనేది, తృతీయ ప్రణాళిక ఆరంభ సంవత్సరం నాటికి ఉన్న పన్నుల ప్రకారం 550 కోట్లు మాత్రమే అవుతుంది.

దీనివల్ల ప్రధానమైన ఒక ప్రశ్న సహజంగా ఉత్పన్నమవుతున్నది. ప్రణాళిక అవసరాలు తీర్చడానికి అదనపు పన్నులు విధిస్తున్నప్పుడు, ఆ పన్నుల ద్వారా లభించే నిధులను ప్రణాళికేతర కార్యక్రమాలకు వినియోగించకుండా చూడవలసిన బాధ్యత ప్రభుత్వానిదై ఉంది. అయితే బడ్జెట్టు పత్రాలతో పాటు ఆర్థిక శాఖవారు ప్రచురించే స్థితిగతుల సమీక్షా నివేదికలోను, అంచనాల సంఘం నివేదికలోను కూడా, అదనపు పన్నులవల్ల లభించే మొత్తం నుంచి, జాతీయ రాబడిలో నూటికి ఒక వంతు చొప్పున ప్రణాళికేతర కార్యక్రమాలకు ఖర్చు అవుతున్నట్లు తెలుస్తున్నది. ఈ సందర్భంలోనే 1958—59 నివేదికలో ఉన్న ఈ క్రింది భాగాలు గమనార్హాలు :—

"గత మూడేళ్ళలోను ఇతరత్రా తీసుకున్న చర్యలవల్లనూ, ప్రజల ఆదాయాలు హెచ్చినందున ప్రభుత్వం రాబడి గమనీయంగా పెరిగింది. జాతీయ ఆదాయానికి—ప్రభుత్వం రాబడికి మధ్య ఉన్న నిష్పత్తి నూటికి 9.10 వంతుల నుంచి 10.10 వంతులకు హెచ్చింది. అయితే ఈ పెరుగుదల మొత్తం యావత్తు ప్రణాళికేతర కార్యక్రమాల క్రింద ఖర్చు జరిగింది. దాని ఫలితంగా ప్రజల నుంచి, బ్యాంకుల నుంచి, విదేశాల నుంచి కూడా ప్రణాళికకు అవసరమైన నిధులను అప్పుగా పొందడమనే ధోరణి పెరిగింది."

ఆర్థిక సమీక్షా నివేదిక అనేది కేంద్ర ఆర్థిక శాఖ వారు జారీచేసే అధికార పత్రం. అదనపు పన్నుల ద్వారా వచ్చే రాబడిలో, జాతీయ ఆదాయంలో నూటికి ఒక వంతు ప్రణాళికేతర కార్యక్రమాలకు ఖర్చు అవుతున్నట్టు అది కూడా అంగీకరిస్తున్నది. అంటే ద్వితీయ ప్రణాళికాకాలంలో ప్రణాళిక కోసమని ఉద్దేశించి విధించిన అదనపు పన్నుల రాబడి నుంచి సుమారు 600 కోట్ల రూపాయలను ప్రణాళికేతర కార్యక్రమాలకు ఖర్చు చేశారన్నమాట. ఈవిధంగా ఈ సొమ్మును ఖర్చు చేయడంవల్ల ప్రణాళికను రూపొందించిన లక్ష్యం విఫలమైపోగలదని అందరూ అంగీకరించవలసి ఉంది.

ప్రణాళిక కింద ఉద్దేశించిన వ్యయంలో, తప్పనిసరిగా చేయవలసిన వ్యయానికి సంబంధించిన మొత్తాలను చేర్చలేదు. ద్వితీయ ప్రణాళిక కాలంలో పూర్తిచేసిన పథకాల నిర్వహణకుగాను, తృతీయ ప్రణాళికా కాలంలో చేయవలసిన ఖర్చు 3000 కోట్ల రూపాయల వరకు ఉంటుందని ప్రణాళికా కర్తలు అంచనా వేశారు. ఇది ప్రణాళిక పద్దులలో చేరదు. ఆ సంగతి తృతీయ ప్రణాళికలో స్పష్టంగా ఉదహరించి ఉన్నారు.

కనుక తృతీయ ప్రణాళిక అమలుకు అవసరమైన 11,600 కోట్ల రూపాయలను మాత్రమే కాక, ద్వితీయ ప్రణాళిక చివరకు పూర్తిచేసి, తృతీయ ప్రణాళిక కాలంలో కూడా నిర్వహించవలసిన పథకాలకు అవసరమైన 3000 కోట్ల రూపాయలను కూడా సమకూర్చుకొనవలసి ఉంది. ప్రణాళికాబద్ధమైన వ్యవస్థలో పథకాల నిర్వహణ ఖర్చు అనేది తప్పనిసరి. ఒక ప్రణాళిక నుంచి మరొక ప్రణాళికకు ఇందుకు సంబంధించిన మొత్తాలు పెరుగుతూ ఉంటాయి. ఈ విషయాన్ని ప్రణాళికలకు నిధులు సమకూర్చడంలో జాగ్రత్తగా పరిశీలించాలి.

ఇప్పుడు ప్రణాళికకు నిధులు ఎలా సేకరిస్తారో పరిశీలిద్దాం. పబ్లిక్ రంగానికి ప్రయివేటు రంగానికి కూడా నిధులు కావాలి. దేశంలో జాతీయరంగం అనేది మాత్రమే ఉంది కనుక పబ్లిక్—ప్రయివేటు రంగాలనే విచక్షణతో మాట్లాడరాదన్నారు. కాని, ప్రధానమంత్రి మొదలు అన్ని రకాల, అందరు మంత్రులు తమ ప్రసంగాలలో ప్రయివేటు రంగం కంటె పబ్లిక్ రంగం అవసరాల ఆధిక్యతను గురించి, కొన్ని రకాల కార్యక్రమాలను పబ్లిక్ రంగానికే పరిమితం చేయాలని నొక్కి వక్కాణిస్తూ ఉంటారు. ఉదాహరణకు ఆమధ్యను ప్రధానమంత్రి ప్రసంగిస్తూ "నూనెల అభివృద్ధిని పబ్లిక్ రంగం ద్వారానే మేము ప్రోత్సహించ దలుస్తున్నాము. అలాగే చేస్తున్నాము. పబ్లిక్‌రంగంలోని నూనె శుద్ధి కర్మాగారాలను కాదని ప్రయివేటు రంగం విస్తరణను మేము కోరడంలేదు." అని చెప్పారు.

ఇక ప్రణాళికాసంఘంవారు, పబ్లిక్‌రంగం పథకాలకు నిధులు సమకూర్చడాన్ని గురించి సమగ్రమైన ఆలోచనలు చేస్తారు. కాని, ప్రయివేటు రంగానికి నిధులు సమకూర్చడం వంటి, అంతే ప్రాధాన్యం గల సమస్యను గురించి అంత శ్రద్ధ చూపరు. కేంద్ర ప్రభుత్వం అనుమతి లేనిదే ప్రయివేటు రంగం తనకు అవసరమైన నిధులను సమకూర్చలేదు. కనుక ఇది చాలా దురదృష్టకరమైన పరిస్థితి అని చెప్పవలసి ఉంటుంది. అదీకాక ప్రణాళికాబద్ధమైన ఆర్థిక వ్యవస్థలో నిధులు సమకూర్చడంలో ప్రయివేటు రంగం కంటె పబ్లిక్ రంగానికి కొన్ని అవకాశాలు అధికంగా ఉన్నాయి. అదనపు పన్నుల ద్వారా సేకరించిన మొత్తాలను పబ్లిక్ రంగానికి వినియోగించవచ్చు. కాని, ప్రయివేటు రంగానికి ఆ వసతి లేదు. ఆ నిధులు అందుబాటు కావు. లోటు బడ్జెట్టుల విధానం ద్వారా (ద్రవ్యోల్బణం ద్వారా) ప్రభుత్వం కొంత సొమ్ము సమకూర్చగలదు. కాని, ప్రయివేటు రంగానికి అదీ అందుబాటు కాదు. దీనినిబట్టి ప్రయివేటు రంగాకి నిధులు లభించే "పొదుపు చేసిన మొత్తాలు" అనేవి, పబ్లిక్ రంగానికి అవసరమైన నిధులు సమకూర్చే "వసతులకు" సమానం కాదనేది దానినిబట్టి స్పష్టమైపోతున్నది.

ఈ సందర్భంలోనే గమనార్హమైన ఒక సంగతి కూఢా చెప్పవలసి ఉంది. తొలి ప్రణాళిక క్రింద పబ్లిక్‌రంగంలో పెట్టిన 1960 కోట్ల రూపాయల పెట్టుబడిలోను మొత్తం 575 కోట్ల రూపాయలు అదనపు పన్నుల వల్ల వచ్చాయి. అంటే నూటికి 29 వంతులు ఇలా సమకూరాయన్నమాట. ద్వితీయ ప్రణాళికలో పబ్లిక్ రంగానికి ఉద్దేశించిన 4600 కోట్ల రూపాయల పెట్టుబడిలోను 1002

కోట్లు అదనపు పన్నుల ద్వారా లభించింది. అంటే ఇది నూటికి 22 వంతు అన్నమాట. ఇక తృతీయ ప్రణాళికకు పబ్లిక్‌రంగంలో ఉద్దేశించిన పెట్టుబడి 7,500 కోట్లు. ఇందులో ఇంతవరకు అంచనా వేసిన దాని ప్రకారం 2260 కోట్లు, అంటే నూటికి 30 వంతులు అదనపు పన్నుల వల్ల వస్తుంది. తృతీయ ప్రణాళికాంతానికి, లెక్కలన్నీ సరి చూచినప్పుడు కానవచ్చే మొత్తాలు ఇంతకంటే ఎక్కువగా ఉండగలవు. ఏమైనప్పటికి, ఇందులో వాస్తవం ఏమంటే, పబ్లిక్‌రంగంలో పెట్టే పెట్టుబడి మొత్తాలలో నూటికి 30 వంతులు అదనపు పన్నులు విధించడంతో వచ్చే రెవెన్యూ నుంచి లభించగలవు కనుక, వానిమీద ఎలాంటి వడ్డీని చెల్లించవలసిన అవసరం ఉండదు. ప్రయివేటు రంగం పరిస్థితి ఇలా ఉండదు. ప్రయివేటు రంగం కేంద్రం అనుమతితో నిధులు సమకూర్చుకున్నప్పుడు, తన వాటాదార్లకు డివిడెండు ఇవ్వవలసి ఉంటుందనేది గుర్తుంచుకొని వ్యవహరించాలి. అలా వీరు డివిడెండు చెల్లించేప్పుడు అవసరమైన నిధులను లకర్పించలేరు. పబ్లిక్—ప్రయివేటు రంగాలకు నిధులు సమకూర్చడాన్ని గురించి పోల్చి చూచేటప్పుడు, ఈ వ్యత్యాసాన్ని కూడా పరిగణించవలసి ఉంటుంది.

పబ్లిక్ రంగానికి నిధులు సమకూర్చడానికి అదనపు పన్నులు విధించడమే కాకుండా లోటు బడ్జెట్ల విధానాలు కూడా ప్రభుత్వం అనుసరించింది. ఇలా తొలి ప్రణాళిక కాలంలో 531 కోట్లు, ద్వితీయ ప్రణాళికా కాలంలో 948 కోట్లు (అంటే ప్రణాళికా వ్యయంలో నూటికి 20 వంతులు) సమకూర్చింది. తృతీయ ప్రణాళిక కింద 550 కోట్లు సమకూర్చడానికి అంచనా వేసింది. అయితే ప్రణాళికాంతానికి గాని ఈ మొత్తం ఎంత అవుతుందనేది చెప్పడానికి వీలుపడదు.

ఇక తృతీయ ప్రణాళిక కాలంలో ఎంతగా అదనపు పన్నులు విధిస్తున్నారో తెలుసుకోవలసి ఉంది. సాలీనా రెవెన్యూలో మిగులు, అంటే అదనపు పన్నులు విధించి రాబట్టేది కాక, 550 కోట్లుగా అంచనా వేశారు. కేంద్రం 1100 కోట్లు, రాష్ట్ర ప్రభుత్వాలు 610 కోట్లు, మొత్తం 1710 కోట్ల రూపాయల మేరకు అదనపు పన్నులు విధించవలెను. ఇందుమూలాన తృతీయ ప్రణాళిక తొలి మూడు సంవత్సరాలలోను ఎంతగా అదనపు పన్నులు విధించింది ఇప్పుడే చెప్పుకోవలసి ఉంది. 1961—62 బడ్జెట్టు సంవత్సరంలో విధించిన అదనపు పన్నులు 60 కోట్ల 87 లక్షలు. ఆ సంవత్సరపు జమాఖర్చులను బట్టి అదనపు పన్నుల విధింపువల్ల వసూలు అయిన మొత్తం 184 కోట్ల 89 లక్షలు. అంటే అదనపు పన్నుల కింద రాబడి బడ్జెట్టులో చూపిన దానికంటె 120 కోట్లు అదనంగా వచ్చిందన్నమాట. రెండవ సంవత్సరంలో (1962—63) అదనంగా విధించిన పన్నులు 60 కోట్ల 80 లక్షలు. ఈ సంవత్సరానికి సవరించిన అంచనాల ప్రకారం చూస్తే, ఈ అదనపు పన్నులవల్ల రాబడి 60 కోట్ల 80 లక్షలు కాక 138 కోట్ల 96 లక్షలని తెలుస్తున్నది. ఇక 1963—64 లో 275 కోట్ల 50 లక్షల రూపాయల అదనపు పన్నులు విధించారు. నిర్బంధ డిపాజిట్ల పథకం కింద వచ్చే సొమ్ము దానిలో చేరలేదు. ఒకవేళ తృతీయ ప్రణాళికకు మిగిలిన రెండు సంవత్సరాలలోను అదనపు పన్నులు విధించనప్పటికి, ఇంతవరకు విధించిన అదనపు పన్నుల కింద జరిగిన వసూళ్లను బట్టి చూడగా, కేంద్ర ప్రభుత్వం అంచనా వేసినది 1100 కోట్లు కాగా, వసూలయ్యేది 2400 కోట్ల రూపాయలని తెలుస్తున్నది. రిజర్వుబ్యాంకు డైరెక్టర్లు ఈమధ్యనే ప్రకటించిన నివేదికలో "అదనపు పన్నులు విధించే విషయం కేంద్రానికి సంబంధించినంతవరకు, ప్రణాళికలో అయిదేళ్లమీద లక్షించిన కోటాను మించిపోయింది." అని ఉదాహరించడాన్ని బట్టే ఈ అభిప్రాయం ధ్రువపడుతున్నది.

కేంద్ర ప్రభుత్వం ప్రత్యక్షపు పన్నులు, పరోక్షపు పన్నులు విధిస్తుంది. ఇలా 1951—52 లో 505 కోట్ల రూపాయల పన్నులు విధించగా, దీనివల్ల 1963—64 వసూలైనది 1469 కోట్ల 71 లక్షల రూపాయలుగా ఉంది. అంటే ప్రణాళికలను ఆరంభించిననాటి కంటె మూడు రెట్లు అధికంగా ఇప్పటి పన్నులు ఉన్నవన్నమాట. ఇదేవిధంగా రాష్ట్ర ప్రభుత్వాలు ప్రత్యక్షపు, పరోక్షపు పన్నులు కింద 1951—52 లో 228 కోట్ల 40 లక్షల రూపాయల మేరకు విధించగా 1963—64 లో వసూలవనున్న రెవెన్యూ 597 కోట్ల 30 లక్షలుగా ఉంది. అంటే 1963—64 సంవత్సరంలో కేంద్ర—రాష్ట్ర ప్రభుత్వాల బడ్జెట్లలో అదనపు పన్నుల కింద రాగల మొత్తం 2067 కోట్ల ఒక లక్ష రూపాయలు రాగలవన్నమాట. అసలు అంకెలు చూస్తే, ఈ మొత్తం ఇంకా మించిపోగలదు. ఏమైనప్పటికి, ప్రణాళికలకు గాను కేంద్ర—రాష్ట్ర ప్రభుత్వాలు విధించే అదనపు పన్నుల కింద ఈ దేశ ప్రజలు నేడు తలసరిని 50 రూ. లు చొప్పున చెల్లిస్తున్నారు. ఇతర స్థానిక సంస్థలు వగైరాలు విధించే పన్నుల దానిలో చేరలేదు.

ఇందువల్ల దేశంలో ఏర్పడిన పరిస్థితులను గురించి సర్. ఎ. రామస్వామి మొదలియార్ చేసిన ఈ క్రింది ప్రకటన జాగ్రత్తగా పరిశీలించవలసి ఉంది. వారు చెప్పిన దిది :—

"మార్కెట్‌లో మూల నిధులు తరిగిపోయాయి. పారిశ్రామికులు ప్రజల నుంచి తగిన నిధులను సమీకరించలేక పోతున్నారు. శోచనీయమైన ఈ పరిస్థితికి అధిక పన్నుల భారం—నిత్య జీవితావసర వస్తువుల ధరలు పెరుగుదల ముఖ్య కారణం. ఇందులో పౌరుల చేతులలో పెట్టుబడి పెట్ట డానికి దమ్మిడీ మిగలడంలేదు. ఇప్పటి వ్యవస్థలో, వాడకం దారుల సంగతి సందర్భాలను గురించి ఆలోచించడమే లేదు." అందువల్లనే ఇప్పటి పరిస్థితులను జాగ్రత్తగా పరిశీలించి చూస్తే, కేంద్ర ప్రభుత్వం పన్నుల విధానంలో తీవ్రమైన మార్పు అవసరమని ప్రజలలో దృఢంగా సర్వత్రా కానవస్తున్న భావాన్ని కాదనడానికి వీలులేకున్నది.

పన్నుల ద్వారా రాగల ఆదాయాన్ని కచ్చితంగా అంచనా వేయడం కష్టమని చెప్పడాన్ని అందరూ అంగీకరిస్తారు. అర్థం చేసుకుంటారు. అలా అని రెవెన్యూ అంచనాలను వరసగా సాలీనా తక్కువగా అంచనా వేసి చూపే విధానాన్ని నిరాఘాటంగా సాగనివ్వకూడదు. అసాధారణ నివేదికలో ఇచ్చిన అంకెలను బట్టి చూడగా 1950—51 నుంచి 1957—58 వరకు, అంటే వరసగా ఎనిమిది సంవత్సరాలు, సాలీనా అనుకోకుండా వస్తున్న రాబడి 50 కోట్ల రూపాయల చొప్పున ఉంది. ఇది 1960—61 నాటికి 111 కోట్ల రూపాయలు అయింది. ఆర్థికమంత్రి బడ్జెట్టును తయారు చేసేటప్పుడు అన్ని అంశాలను ఊహించలేడు కనుక, అనుకోకుండా ఆదాయం వచ్చినప్పటికీ, అందుకు బడ్జెట్టును సిద్ధం చేయడంలో లోపం ఉన్నదని ఆరోపించడానికి వీలులేదని సాధారణంగా సమాధానం చెబుతారు. ఒకవేళ ఈ వాదనను అంగీకరించినప్పటికీ, ఆర్థికమంత్రి సవరించిన అంచనాలను ప్రతిపాదించేటప్పుడు కనీసం 10—11 నెలల వసూళ్ల వివరాలు ఆయన ముందు ఉంటాయి. అందువల్ల పెద్ద తేడాలు రాకూడదు. కాని 1961—62 సవరించిన అంచనాలలో—ఆదిలో అనుకున్న మిగులు 27 లక్షల రూపాయలు కాక 33 కోట్ల 96 లక్షలు కావడం ఆశ్చర్యకరం. అంతేకాదు. ఈ సంవత్సరం నికర జమాఖర్చులు తేలడంతో ఈ మిగులు 124 కోట్ల 58 లక్షలు అయింది. అంటే ఒకటి—రెండు నెలల వ్యత్యాసంలో రాబడి 90 కోట్ల రూపాయల వరకు పెరిగిందన్నమాట. కనుకనే వరసగా సాలీనా ప్రభుత్వం రెవెన్యూను తక్కువగా అంచనా వేసి చూపడమనే దానిని జాగ్రత్తగా పరిశీలింపజేయవలసి ఉంది. ఆర్థికమంత్రి కూడా తన బడ్జెట్టు ప్రసంగంలో బడ్జెట్టు అంచనాలు, సవరించిన అంచనాలను గురించి చెబుతారే కాని, నికర జమాఖర్చుల సంగతి సందర్భాలను గురించి ప్రస్తావించక పోవడం కూడా శోచనీయం.

## విదేశ ద్రవ్య సేకరణ

ప్రణాళిక అవసరాలలో విదేశ ద్రవ్యం కూడా ఉంది. దీని కొరత అనేది కూడా ఒక క్లిష్ట సమస్యగా తయారై ఆందోళన కలిగిస్తున్నది. విదేశ ద్రవ్యం సమకూర్చడానికి రెండు ముఖ్య మార్గాలు ఉన్నాయి. ఒకటి : దేశం నుంచి ఎగుమతులు పెంచుకొనడం. రెండు : విదేశాల నుంచి సహాయం పొందడం. ఇప్పుడు స్టర్లింగ్ నిల్వలను వాడుకొనడం అనే సమస్యే లేదు. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించినప్పుడున్న 1700 కోట్ల స్టర్లింగ్ నిల్వలలోను ఇప్పటికి మిగిలినవి 97 కోట్ల రూపాయలు మాత్రమే. విదేశాలలోని ఆస్తుల మీద వడ్డీ రూపంలో గాని, డివిడెండుల రూపంలోగాని మనకు వచ్చే రాబడి దాదాపు లేనేలేదు. ఇంతవరకు ఈ-రూపంలో కొంత విదేశాల ద్రవ్యం లభించేది. ఇకనుంచి ఇలా వచ్చేది కూడా ఉండదు.

తృతీయ ప్రణాళికకు, అవసరమైన ఆహారధాన్యాల దిగుమతికిగాను విదేశ ద్రవ్యం 3200 కోట్ల రూపాయల వరకు అవసరం కాగలదని అంచనా వేశారు. ఇంతవరకు చేసిన ఏర్పాట్ల ప్రకారం ఆహారధాన్యాల దిగుమతికి 600 కోట్ల రూపాయలు చెల్లించవలసి ఉంది. పోగా మిగిలిన 2600 కోట్ల రూపాయలు ప్రణాళిక అవసరాలకు లభించగలదన్నమాట.

ఈ మొత్తంతో తృతీయ ప్రణాళికను పూర్తి చేయవచ్చునా లేదా అనేది పరిశీలించడానికి ముందు, ద్వితీయ ప్రణాళికలో ఇందుకు సంబంధించిన అనుభవాన్ని సమీక్షించుకొనడం అవసరం. ప్రణాళికకు లభించగల విదేశ ద్రవ్య నిధిని ప్రణాళికా సంఘంవారు అంచనా వేయడంలో దేశంలోకి దిగుమతుల కింద ఎంత సొమ్మును చెల్లించవలసి ఉంటుంది, ఎగుమతులవల్ల దేశానికి రాగల రాబడి ఎంత అనేది ముందుగా అంచనా వేస్తారు. ద్వితీయ ప్రణాళిక కాలంలో దేశం నుంచి ఎగుమతుల వల్ల 2965 కోట్ల రూపాయల రాబడి రాగలదని, దేశం చేసుకొనే దిగుమతులకు 4340 కోట్ల రూపాయలు చెల్లించవలసి వస్తుందని అంచనా వేశారు. విదేశ యాత్రికులు వగైరాలవల్ల 255 కోట్ల రూపాయలు వచ్చినా, భర్తీ చేయవలసిన లోటు 1120 కోట్ల రూపాయలుగా ఉంది. దీనిని భర్తీ చేయడానికి స్టర్లింగ్ నిల్వల నుంచి 200 కోట్లు తీసుకొని, ప్రయివేటు పెట్టుబడుల రూపంలో 100 కోట్లు ఆకర్షించి, విదేశ ఆర్థిక సహాయం కింద 800 కోట్ల రూపాయలు పొందాలని అనుకున్నారు. కాని, చివరకు ఈ

అంచనాలన్నీ తప్పు అయినాయి. దీనిని గురించి తృతీయ ప్రణాళికలో కూడా అంగీకరిస్తూ ఇలా ఉదహరించారు :—

"ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో విదేశ ద్రవ్య నిధుల సమస్యలో వ్యతిరేక పరిణామాలు సంభవించడానికి కారణం—కొంతవరకు విదేశ ద్రవ్య నిధుల అవసరాలను తక్కువగా అంచనా వేయడం, అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థకు అత్యవసరమైన అవసరాలను తగినంతగా గమనించకపోవడం."

తృతీయ ప్రణాళికలో ఉదహరించినట్లు మన దిగుమతులు 4340 కోట్ల రూపాయల నుంచి 5360 కోట్లుకు హెచ్చినవి. అంటే 1000 కోట్ల కిమ్మతుకు పెరిగినవి. ఇక ఎగుమతులు అంచనా వేసింది 2965 కోట్ల రూపాయలు కాగా, వాస్తవానికి జరిగింది 3053 కోట్ల మేరకు. విధంగా విదేశవాణిజ్యంలో లోటు 932 కోట్లు వరకూ పెరిగింది. దాని ఫలితంగా స్టర్లింగ్ నిల్వల నుంచి 200 కోట్లు కాక, 600 కోట్ల రూపాయలను వినియోగించుకొనవలసి వచ్చింది. అంతర్జాతీయ ద్రవ్య నిధి నుంచి 55 కోట్లు అప్పు తీసుకున్నాము. విదేశ ఆర్థిక సహాయాన్ని కూడా ఎక్కువగా పొందవలసి వచ్చింది. విదేశ ద్రవ్య నిధుల లోటు 1100 కోట్లు కాక 2059 కోట్ల వరకు భర్తీ చేయవలసి వచ్చింది. ఈవిధంగా ద్వితీయ ప్రణాళిక అంచనాలు నూటికి నూరుపాళ్ళు తలక్రిందులు అయినవి. గతానికి సంబంధించిన దారుణమైన ఈ గుణపాఠాన్ని భారత ప్రభుత్వం విస్మరించడం ప్రమాదకరం.

అయినా ఇప్పటి పరిస్థితులలో 3650 కోట్ల రూపాయల దిగుమతులు అవసరమని అంచనా వేశారు. ఇందులో ప్రణాళిక పథకాలకు యంత్రాలు పరికరాల క్రింద ఖర్చు 1900 కోట్లు, ఇతరత్రా పథకాలకు అవసరాలు 200 కోట్లు. ఇవీ దిగుమతుల అవసరాలు. ఇందుకుగాను మనం చేయవలసిన ఎగుమతులు 3700 కోట్ల రూపాయలు మాత్రమే. అంటే ఎగుమతులకు—దిగుమతులకు మధ్య వ్యత్యాసం 2050 కోట్ల రూపాయలన్నమాట. ఈ మేరకు విదేశ ద్రవ్య నిధులను సంపాధించవలసి ఉంది.

దిగుమతులు—ఎగుమతులు మాత్రమే కాక భారత దేశం తీర్చవలసిన ప్రధానమైన బాధ్యత మరొకటి ఉంది. అది విదేశాల నుంచి తీసుకున్న అప్పులమీద చెల్లించవలసిఉన్న వడ్డీ, వాయి మొత్తాలు చెల్లింపులకు సంబంధించినది. ఈ మొత్తం ౨50 కోట్ల రూపాయలుగా ఉంది. దీనినిబట్టి ఆహారధాన్యాల దిగుమతికి పొందుతున్న సహాయం కాక, 2600 కోట్ల రూపాయల వరకు విదేశ ఆర్థిక సహాయాన్ని పొందనప్పుడు తృతీయ ప్రణాళికలో లక్షించిన కోటాలను సాధించడం వీలుపడదని చెప్పుకోవచ్చు.

అయినా ప్రణాళికా కర్తలు తృతీయ ప్రణాళిక కాలంలో ఎగుమతుల ద్వారా 3700 కోట్ల రూపాయలు సంపాదించవచ్చునని అంచనా వేశారు. అయితే వాణిజ్యమండలి వారు అయిదేళ్ళమీద 3800 కోట్ల రూపాయలు రాగల ఎగుమతుల జాబితా వేశారు. 1961—62 లో మన ఎగుమతులు 680 కోట్లు అందుకొనగలవని వారు అంచనా వేశారు. దీనినుంచి సాలీనా 40 కోట్లు చొప్పున పెరగవచ్చునని ఊహించి 1965—66 నాటికి సాలుకు 840 కోట్ల రూపాయల ఎగుమతులు జరగవచ్చు నన్నారు.

అయితే తృతీయ ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలోను జరిగిన దేమిటి? అంచనా వేసినట్లు 680 కోట్లు కాక, 662 కోట్ల రూపాయల ఎగుమతులు మాత్రమే జరిగినవి. 1962—63 లో ఎగుమతులు 708 కోట్లకు హెచ్చినవి. ఇందులో మార్మగోవా నుంచి జరిగిన 16 కోట్ల ఎగుమతులు కూడా ఉన్నాయి. అయినప్పటికి అంచనా వేసిన

మొత్తం కంటె ఇది 11 కోట్లు తక్కువ. దాని ఫలితంగా వచ్చే మూడేళ్లలోను భారతదేశం 2430 కోట్ల రూపాయల ఎగుమతులను అంటే సాలుకు 810 కోట్ల ఎగుమతులను చేయగల దన్నమాట. ఇలా చేయలేనప్పుడు—చేయగలదనడం అనుమానం—ఇప్పుడున్న విదేశ ద్రవ్య నిధుల కొరత మరింతగా పెరిగి, పరిస్థితి మరింత క్లిష్టం కావడం తథ్యం.

గతానుభవాన్ని బట్టి దిగుమతులు—అభివృద్ధికి, మామూల్ల ఉత్పత్తులకు గాను—సుమారు 600 నుంచి 750 కోట్లు వరకు పెరగవచ్చునని చెప్పుకోవచ్చు. అంటే ఈ పద్దు క్రింద మొత్తం 5750 కోట్ల నుంచి 6500 కోట్లు కావచ్చు. అంటే దేశానికి విదేశ ద్రవ్య నిధి రూపంలో మరొక 700 కోట్ల రూపాయలు అవసరం కాగలదన్నమాట. అంటే లంచనా వేసినట్లు అవసరమైన విదేశ ద్రవ్య నిధి 2600 కోట్లు కాక 3500 కోట్లుగా ఉండగలదు. వీటన్నింటిని బట్టి, విదేశ ద్రవ్య నిధులను సమకూర్చడ మనేది ఎంత క్లిష్ట సమస్యగా ఉంటుందో యోచనాపరు లందరూ గ్రహించగలరు. దేశరక్షణ అవసరాలు, ఆర్థికాభివృద్ధికి అవసరాలు పెరిగిపోతూ ఉంటే, విదేశ ద్రవ్య నిధుల వ్యవహారాన్ని అదుపులో ఉంచుకోవడం, అది నానాటికి విషమించకుండా నివారణోపాయాలు కనుగొనడం కేంద్ర ప్రభుత్వానికి పెద్ద చిక్కు సమస్య కాగలదు.

విదేశ ఆర్థిక సహాయ సమస్యలోపాటు, విదేశాలకు మనం చెల్లించవలసిన అప్పుల సమస్య కూడా ముందుకు రాగలదు. భారతదేశానికి సకాలంలో తనమాట చెల్లించుకోగలదనే కీర్తి ఉంది. మన ప్రభుత్వ ఋణభారం నానాటికి పెరిగిపోతున్నది. ప్రణాళికలు ఆరంభించిన నాటికి ఉన్న ఋణం 2746 కోట్లు. 1964 మార్చి నాటికి అది 9364 కోట్లు కావచ్చునని ఆర్థికశాఖవారి నివేదికలు చెబుతున్నవి. అంటే గత 13 సంవత్సరాంతోను ఋణభారం 6618 కోట్లకు అంటే నూటికి 240 వంతులు పెరిగిన దన్నమాట.

కేవలం ప్రభుత్వ ఋణభారం పెరిగినందున ఎవ్వరూ ఆందోళన చెందవలసిన అవసరం లేదు. మరి రెండు కీలక సమస్యలను కూడా మనస్సులో ఉంచుకోవాలి. ఒకటి: విదేశాలకు ఉన్న అప్పుమీద చెల్లించవలసిన వడ్డీ మొత్తం. రెండు: వడ్డీ చెల్లించవలసిన మొత్తాలకు—వడ్డీని గిట్టింపుచేసే ఆస్తులకు మధ్య ఉన్న వ్యత్యాసం నానాటికి పెరగడం, చెల్లించవలసిన వడ్డీలకు సంబంధించినంతవరకు ద్వితీయ ప్రణాళికారంభం నాటికి 92 కోట్లు ఉందని ఆర్థికశాఖ చెబుతున్నది. అది 1964 మార్చి నాటికి 275 కోట్లు వరకు పెరుగుతుంది. అంటే గత ఎనిమిదేళ్లలోను వడ్డీలుగా చెల్లించవలసిన మొత్తం 183 కోట్లకు అంటే నూటికి 200 రెట్లు పెరిగిందన్నమాట. ఇందులో 1964 మార్చి నాటికి విదేశాలకు చెల్లించవలసిన అప్పు 1790 కోట్లు అని, దీనిమీద చెల్లిస్తూ ఉండవలసిన వడ్డీ 60 కోట్లు అని గుర్తుంచుకోవాలి. మనం నిరంతరం విదేశాల నుంచి అప్పులు తీసుకుంటున్నాము కనుక, ఈ మొత్తాలు కూడా విధిగా నిరంతరం పెరుగుతూ ఉండగలవని గ్రహించడం కష్టంకాదు. అందువల్లనే కేవలం వడ్డీ చెల్లించడానికి మాత్రమే కాక, అసలు సొమ్ము వాయిదాలు చెల్లగట్టడానికి కూడా విదేశాల నుంచి ఇంకా అప్పులు చేయవలసిన స్థితి ఏర్పడింది. ఈ విషయాన్ని తేలికగా త్రోసివేయడానికి వీలుపడదు.

ఆర్థిక సహాయం చేస్తున్న అన్ని దేశాలకు భారతదేశం తన అభినందనలు తెలుపవలసి ఉన్నమాట నిజం. అయితే కొన్ని దేశాలు ఇచ్చే అప్పుమీద దాదాపు వడ్డీ లేకపోవడమే కాక, ఒకవేళ ఉన్నా అది 50 సంవత్సరాలమీద చెల్లించవలసి ఉంటుందనేది కూడా గమనించి, హర్షించవలసి ఉంది. విదేశ ఆర్థిక సహాయం అనేది, వర్తక, వాణిజ్యాల స్థానాన్ని భర్తీ చేయలేదని కొందరు ఉత్తమ మిత్రులు సలహాను ఇచ్చినప్పటికి, భారతదేశానికి ఉన్న అవసరాలకు—ఇతరులు చేసే సహాయానికి మధ్య ఉన్న వ్యత్యాసం తృతీయ ప్రణాళికాంతానికి భర్తీ కాదనేది దురదృష్టవశాత్తు నిజం. భారత మిత్రమండలివారు 1961—62 లో 616 కోట్లు, 1962—63 లో 509 కోట్లు, 1963—64 లో 500 కోట్లు సహాయం చేయడానికి అంగీకరించారని అందరికీ తెలుసు. ఇలా వీరు చేయగల మొత్తం సహాయం 1626 కోట్లు. అయితే భారతదేశానికి బహుశా ఉండగల విదేశ ద్రవ్య నిధుల కొరత 3500 కోట్లు. అంటే తృతీయ ప్రణాళికలో మిగిలిన రెండు సంవత్సరాలలోను భారతదేశానికి ఇంకా 1900 కోట్లు విదేశ సహాయం కావాలి. అదృష్టవశాత్తు అది లభించగల దనుకోవడం వాస్తవిక దృక్పథం అనిపించుకోదు. కనుక మన ఎగుమతులు సాలీనా తగినంతగా పెరుగుతూ పోయినప్పుడు కాని, తృతీయ ప్రణాళిక కాలంలో విదేశ ద్రవ్య నిధుల ద్వారా ఉద్దేశించిన పథకాలు పూర్తిచేయడ మనేది సాధ్యపడదు.

ఇక చెల్లించవలసిన మొత్తాలకు, వడ్డీలు గిట్టింపు చేసే ఆస్తులకు మధ్య ఉన్న వ్యత్యాసానికి సంబంధించినంత వరకు 1951 మార్చి ఆఖరుకు ఉన్న వ్యత్యాసం 738 కోట్లు. ఇది 1964 మార్చి ఆఖరుకు 1559 కోట్లు వరకూ ఉండగలదని ఆర్థికశాఖ నివేదికలు చెబుతున్నవి.

ఇందులో పాకిస్తాన్ నుంచి రావలసిన 300 కోట్ల రూపాయలను వడ్డీ వచ్చే ఆస్తి కింద ఇందులో జమకట్టి ఉంచారనేది గుర్తుంచుకోవాలి. ఈ మొత్తంలో ఒక్క రూపాయి అయినా భారతదేశానికి వచ్చే అవకాశం లేదు. కాని, దీనిని మినహాయిస్తే వ్యత్యాసపు మొత్తం ఇంకా పెరుగుతుంది. అది కాక తృతీయ ప్రణాళిక కాలంలో మరి 550 కోట్లు అప్పులు చెల్లించడానికి అప్పుగా విదేశాల నుంచి సహాయం పొందవలసి ఉంది. కనుక ఈ వ్యత్యాసం అనేది తృతీయ ప్రణాళికాంతానికి 2500 కోట్ల రూపాయలకు మించవచ్చునని బాధ్యత కలిగిన వర్గాలు అంచనా వేస్తున్నవి. ఇంత పెద్ద మొత్తంమీద భారతదేశం ఆర్జించేది ఏమీ లేకపోయినా దాని మీద వడ్డీలను, దఫాలవారీగా అసలు మొత్తాలను చెల్లిస్తూ ఉండాలి. అప్పులు చెల్లించడంలో భారతదేశానికి గతంలో ఉన్న ప్రతిష్ఠను కాపాడుకొన దలచినవా రందరికీ ఈ పరిస్థితి ఆందోళన కలిగించడం సహజం. "బడుగు దేశాలు చాలా సందర్భాలలో ఎగుమతులవల్ల భవిష్యత్తులో రాగల ఆదాయంలో, ప్రమాదకరమైనంత నిష్పత్తిని, సహాయం క్రింద తాము పొందిన అప్పులు చెల్లించడానికి పూచీ పడ్డాయి' అంటూ శ్రీ యూజినీ బ్లాక్ విజ్ఞతతో చేసిన విమర్శనను దాని అంతరార్థాన్ని భారతదేశం జాగ్రత్తగా మనస్సులో ఉంచుకొని వ్యవహరించడం అవసరం.

ఇంతవరకు ప్రణాళికకు నిధులు సమకూర్చడంలో పన్నుల భారం—విదేశ ఆర్థిక సహాయం అనే ప్రధానమైన రెండు పద్ధతులను గురించి పరిశీలించాము. ఇకరైల్వేల నుంచి, ప్రావిడెంట్‌ఫండుల ఖాతాల నుంచి, ఉక్కు ధరల స్థిరీకరణ నిధి నుంచి మొత్తం 470 కోట్లు ప్రణాళికకు నిధిగా లభిస్తుంది. అంచనా వేసినట్లుగా ఈ మొత్తం లభించవచ్చు. కనుక దీనిని గురించి అంతగా పరిశీలన అనవసరం.

## ప్రజల అప్పులు—ప్రభుత్వ నిధులు

ప్రణాళికకు నిధులు సమకూర్చడంలో దేశంలో తీసుకొనే అప్పులు కూడా ప్రధాన బాధ్యతను నిర్వహిస్తున్నవి. ప్రజల నుంచి 800 కోట్లు, స్వల్ప మొత్తాల పొదుపు కార్యక్రమం ద్వారా 600 కోట్లు, మొత్తం 1400 కోట్లు దేశంలో రాబట్టవచ్చునని ప్రణాళికలో అంచనా వేశారు. అయితే ఈ మొత్తం యావత్తు లభించగలదా లేదా అన్నది చెప్పడం చాలా కష్టం. ద్వితీయ ప్రణాళిక కాలంలో మార్కెట్ నుంచి 780 కోట్లు అప్పు చేశారు.. ఇందులో తృతీయ ప్రణాళికలో ఉదాహరించినట్లు "అమెరికా నుంచి పొందిన పి. ఎల్. 480 డిపాజిట్ల నుంచి స్టేట్ బ్యాంకు, వారు గవర్నమెంటు బాండులకు పెట్టిన పెట్టుబడికి చెందిన పెద్ద మొత్తాలు, రిజర్వు బ్యాంకువారు ఖరీదుచేసి తీసుకున్న పెద్ద మొత్తాలు దీనిలో చేరి ఉన్నాయి." ఇందువల్ల మార్కెట్ అప్పులలో రిజర్వుబ్యాంకు మినహా ఇతర కమ్మర్షియల్ బ్యాంకులు, ప్రజలు తీసుకున్నవి 300 కోట్లకంటె తక్కువగానే ఉన్నవి." అని కూడా తృతీయ ప్రణాళికలో పేర్కొన్నారు. అంటే ప్రభుత్వం మార్కెట్‌లో చేసిన అప్పులవల్ల అదనంగా లభించినది (ద్వితీయ ప్రణాళికా కాలంలో) 780 కోట్లు కాక, 300 కోట్లు అని అర్థం చెప్పుకోవాలి.

చివరకు ఈమధ్య తీసుకున్న 364 కోట్ల రూపాయల అప్పులోను, రిజర్వుబ్యాంకు తాలూకు మొత్తం 90 కోట్లు ఉంది. అంటే ఇది ప్రజలు పొదుపు చేసుకున్న దాని నుంచి ప్రభుత్వం కొత్తగా రాబట్టిన మొత్తం కాదనేది దీనివల్ల స్పష్టం అవుతున్నది. పూర్తి అంకెలు లభించనందున, ఈ అప్పులకు సంబంధించిన నిజస్థితిని తెలుసుకొనడం కష్టం. ప్రభుత్వం ఋణపత్రాల అమ్మకంవల్లను, స్వల్ప మొత్తాల పొదుపును ప్రోత్సహించడం వల్లను అదనంగా ఎంత సొమ్మును పెట్టుబడిగా రాబట్టిం దనేది తెలుసుకొనాలనే కుతూహలం ప్రజలకు ఉంది. ఈ మొత్తం 1400 కోట్లుగా ఉంటుందని తృతీయ ప్రణాళిక చెబుతున్నది. ఈ ప్రధానాంశంలో ఇంతవరకు జరిగిన దేమిటి, ఇకముందు జరుగనున్నది ఏమిటి అనేది ప్రజలకు స్పష్టంగా చెప్పవలసిన బాధ్యత ప్రభుత్వం మీద ఉంది.

లోటు బడ్జెటుల విధానం కింద, అంటే ద్రవ్యోల్బణం ద్వారా 550 కోట్లు సమకూర్చాలని తృతీయ ప్రణాళికలో ఉంది. అయితే ఇది నిధులు సమకూర్చిపెట్టదు. ఆర్థికంగా కొన్ని క్లిష్ట పరిస్థితులను తప్పించుకొనడానికి కరెన్సీ

నోట్ల చెలామణిని పెంచడం జరుగుతుంది. ఇందు కింద సూచించిన సొమ్ము చాలవరకు సహేతుకం కనుక, దానిని గురించిన చర్చ అనవసరం.

ప్రభుత్వ సంస్థల మిగులు మొత్తాల నుంచి కూడా ప్రణాళికకు పెట్టుబడులు సమకూరుస్తున్నారు. ఇందులో రైల్వేల ద్వారా లభించే మొత్తం చేరదు. ఈ మిగులు మొత్తాలు కేవలం నిఖర లాభాలు మాత్రమే కాక "ఈ సంస్థలకు చెందిన తరుగుదల నిధులు, రిజర్వు నిధులు, తదితర నిధులు చేరి ఉన్నాయి. వీనిని ఇలా వినియోగించడంలో, ఈ సంస్థల విస్తరణ పథకాలకు పెట్టుబడిగా ఈ సొమ్ము వినియోగ పడగలదన్న అర్థం చెప్పుకోవాలి." అని కూడా తృతీయ ప్రణాళిక ఉదహరిస్తున్నది. "అయితే వీనికి సంబంధించిన వివరాలు సమగ్రంగా అందు లేవు గనుక వీని అంచనాలు తాత్కాలికమైనవి మాత్రమే" అని కూడా ముందు జాగ్రత్తకోసం హెచ్చరించింది. ఇలా సమకూరే మొత్తాలు కేంద్ర సంస్థల ద్వారా 350 కోట్లు, రాష్ట్ర సంస్థల ద్వారా 150 కోట్లు అని కూడా అంచనా వేశారు.

అయితే, అంచనా వేసినట్టుగా ఈ మిగులు మొత్తాలు లభించగలవా అన్న ప్రశ్న తరచూ వినవస్తున్నది. అందుబాటులో ఉన్న అంకెలనుబట్టి చూడగా, ఈ మొత్తాలు అందకపోవచ్చు. నన్న సూచనలు ఉన్నాయి. ఉదాహరణకు కేంద్ర ప్రభుత్వానికి చెందిన పెద్ద సంస్థ హిందూస్థాన్ ఉక్కు కంపెనీ నుంచి లభించగల మొత్తాలను గురించి పరిశీలిద్దాము. ఈ సంస్థకు 1962 మార్చి 31 నాటికి చెల్లించిన వాటా ధనం 307 కోట్లు. అప్పుగా ఇచ్చినది 357 కోట్లు. 1962 మార్చి 31 వరకు ఆడిట్ రిపోర్టులను బట్టి ఈ కంపెనీకి వచ్చిన నష్టం 40 కోట్లకు పైగా ఉంది. అప్పుమీద వడ్డీ కింద చెల్లించవలసిన మొత్తాన్ని కూడా లెక్కలోకి తీసుకుంటే, దాని నష్టం ఇంకా హెచ్చుగా ఉంటుంది. ఏడు సంవత్సరాల వరకు ఈ కంపెనీ తీసుకున్న అప్పుమీద వడ్డీ చెల్లించవలసిన అవసరం లేకుండా చేశారు. 1963 మార్చి వరకు చూస్తే ఈ కంపెనీకి పెట్టుబడి 698 కోట్లు.. నష్టం 61 కోట్ల 50 లక్షలుగా ఉంది. అప్పులమీద నూటికి ఆరు రూపాయల వడ్డీ చెల్లించడం జరిగితే ఈ నష్టం ఇంకెంతగా పెరుగుతుందో ఊహించవచ్చు.

ప్రభుత్వ సంస్థలనుంచి మిగులు సొమ్ము అనే సమస్య ఈ సంస్థలు తీయవలసిన లాభాలకు సంబంధించిన ఒక ముఖ్య సమస్యను ముందుకు తెస్తున్నది. ప్రభుత్వ సంస్థల లక్ష్యం సాంఘిక న్యాయసాధన అని మనకు చెబుతున్నారు. వాటి ఉద్దేశ్యం లాభాలు తీయడం కాదు. కాని ఆర్థికమంత్రి 1962—63 బడ్జెట్టు ప్రసంగంలో "మన రైల్వేలు, విద్యుత్ కేంద్రాలు, ఇరిగేషన్ ప్రాజెక్టులు, ఎరువులు ఉక్కు కర్మాగారాలు వంటి వానిమీద మనం పెట్టే పెద్ద మొత్తాల పెట్టుబడికి తగిన ప్రతిఫలం మనం పొంది తీరాలి. గతంలోని పెట్టుబడుల ద్వారా భవిష్యత్తులోని పెట్టుబడులకు దారితీయడం ద్వారా ఆర్థికాభివృద్ధిని త్వరితం చేయవచ్చు. అభివృద్ధికి ప్రయివేటు లేదా పబ్లిక్ రంగాల మీద ఆధారపడుతున్నారా అనే ప్రశ్నతో సంబంధం లేకుండా అన్ని దేశాల అనుభవం ఇందుకు అనువుగా ఉంది. భారతదేశంలోని ప్రయివేటురంగం చాలవరకు తన విస్తరణ కార్యక్రమాలకు తాను సంపాదించే లాభాలమీద, పొదుపు చేసుకొనే మొత్తాలమీద ఆధారపడుతున్నది. మన దేశ, ఆర్థిక వ్యవస్థలో ప్రముఖ పాత్రను నిర్వహించాలంటే పబ్లిక్‌రంగం కూడా ఆ మార్గాన్నే అనుకరించాలి." అని చెప్పి ఉన్నారు. ఆవిధంగా లాభాలు తీయడానికి సంబంధించినంతవరకు మన ప్రభుత్వంవారు ప్రయివేటురంగం మార్గాన్నే పబ్లిక్ రంగంలో కూడా అనుసరించ దలుస్తున్నారు. అయిన్పుడు ప్రయివేటు రంగంవారు తాము చేసిన అప్పులమీద వడ్డీ చెల్లించడానికి, తమ వాటాదారులకు డివిడెండ్లు పంచిపెట్టడానికి, విస్తరణ కార్యక్రమాలకు మిగులు మొత్తాలు సంపాదించడానికి ప్రయత్నిస్తే విమర్శించడం దేనికి ? అపహాస్యం చేయడం దేనికి ? తీర్పు చెప్పడంలో రెండు రకాల ప్రమాణాలు ప్రయివేటు రంగానికి ఒక రకం, పబ్లిక్ రంగానికి ఒక రకం ఉండకూడదు. మన పరిశ్రమల నిర్వహణలో సాంఘిక న్యాయానికి చెందిన సూత్రాలను గుర్తించవలసిందే. అది వాంఛనీయమే. కాని, ఆర్థికమంత్రి ప్రసంగంలో వివరించినట్టు—ప్రయివేటు రంగంకాని, పబ్లిక్ రంగం కాని న్యాయమైన లాభాలు తీసేటట్టు పనిచేయనివ్వడం అవసరమని గుర్తించితీరాలి. ఈ లాభాల నుంచే పెట్టుబడిమీద న్యాయమైన ప్రతిఫలం, ఆయా సంస్థలవిస్తరణకు సమంజసమైన మొత్తాలు కేటాయింపు జరగనివ్వాలి.

దేశంలో లభించే నిధులు, పొదుపు జరిగే మొత్తాలు ఏక మొత్తంగా ఉంటాయి. పబ్లిక్ రంగం కాని—ప్రయివేటు రంగం కాని తనకు అవసరమైన నిధులను దానినుంచే వాడుకోవాలి. అయితే అదనపు పన్నుల ద్వారా లభించే మొత్తాలు, లోటు బడ్జెట్టుల ద్వారా తీసుకొనే మొత్తాలు కూడా దీని నుంచే వస్తాయి. ఇవి ప్రయివేటు రంగానికి లభించవనేది గుర్తుంచుకోవాలి. అంతేకాదు, "ప్రయివేటు రంగంలో మిగులు తేలే మొత్తాలలో కొంతభాగం ప్రభుత్వ ఖజానాకు

రాబట్టి, వానిని చాలవరకు పబ్లిక్‌రంగం పథకాలకు నిధులుగా సమకూర్చడం" ప్రభుత్వ విధానంగా ఉంటుందని కూడా తృతీయ ప్రణాళికలో ఉంది. దీనికి తోడు కేంద్ర ప్రభుత్వం ఆమోదం వ్రాతమూలకమైన అనుమతిలేకుండా ప్రయివేటు రంగానికి వాటా ధనంగా ఒక్క రూపాయి వసూలు చేయడానికి వీలుపడదు. విదేశాల నుంచి ఒక్క డాలరు సహాయంగా పొందడానికి అవకాశం లేదు. చివరకు ప్రణాళికా కర్తలు కూడా ఈ విషయాలలో ప్రయివేటు రంగం చిక్కులను తమ నివేదికలో అంగీకరిస్తూ ఉదహరించారు. ఇందువల్ల ప్రయివేటు రంగం అభివృద్ధి కుంటుపడుతున్నదని కూడా చెప్పారు.

ఎన్ని చెప్పినప్పటికి, దేశంలో లభించే నిధులనుంచి పబ్లిక్‌రంగం అవసరాలు ముందుగా తీర్చడానికి ప్రభుత్వం అనుమతిస్తుంది. ఆ తర్వాతనే ప్రయివేటు రంగానికి అవకాశం దొరుకుతుంది. దీనికి తోడు విపరీతమైన అదనపు పన్నుల భారంవల్ల పరిస్థితులు మరింతగా క్లిష్టమైనాయి. ఒక్క ఏడాదిలో పన్నులు, అప్పులు, స్వల్ప మొత్తాల పొదుపు, రిస్క్ ఇన్స్యూరెన్సు, జాతీయ రక్షణ నిధికి వసూళ్లు వగైరాల రూపంలో మార్కెట్ నుంచి ఒక వెయ్యి కోట్లు ప్రభుత్వం తీసుకుంటే, ఇతరుల అవసరాలకు మిగలగల మొత్తం అతి స్వల్పమని చెప్పడానికి పెద్దగా పరిశోధనలు చేయవలసిన అవసరం లేదు.

రిజర్వుబ్యాంకు డైరెక్టర్ల బోర్డువారు కూడా ఈమధ్యనే తమ నివేదికలో "తృతీయ ప్రణాళిక తొలి మూడు సంవత్సరాల లోను రకరకాల అదనపు పన్నుల కింద కేంద్ర ప్రభుత్వం 1900 కోట్లు రాబట్టింది" అని వివరించారు. 1963—64 బడ్జెట్టు సంవత్సరంలో కేంద్ర—రాష్ట్ర ప్రభుత్వాలు విధించిన అదనపు పన్నులవల్ల, జాతీయాదాయంలో పన్నుల కింద రాబట్టే మొత్తం నూటికి 9.6 వంతులు (ద్వితీయ ప్రణాళిక చివరకు) నుంచి 13 వంతుల వరకు హెచ్చింది." అని కూడా పేర్కొన్నారు. ఇలా రిజర్వుబ్యాంకు డైరెక్టర్ల బోర్డువారు నిర్మొహమాటంగా అసలు విషయం వెల్లడించటం వలన, దేశంలో పన్నుల భారపు తుది హద్దును చేరుకున్నామని ప్రజలు ఇంకా త్యాగాలు చేయాలని కోరడం అన్యాయమని వినవచ్చే అభిప్రాయానికి మరింతగా బలం వచ్చినట్టు అయింది.

# జాతీయాదాయం: పన్నులభారం

**1961-62** లో జాతీయాదాయం, ఇప్పటి ధరవరుల ప్రకారం 14,630 కోట్ల రూపాయలుగా అధికారవర్గాలు అంచనా వేశాయి. ఇక 1962—63 లో వ్యవసాయాభివృద్ధి సవ్యంగా లేదని అందరికీ తెలుసు. పారిశ్రామిక రంగంలో అభివృద్ధి నూటికి ఎనిమిది వంతులుగా ఉన్నా, వ్యవసాయంలో అధికోత్పత్తి నామమాత్రంగా ఉంది. ఇతరత్రా అనుబంధ రంగాలలో అధికోత్పత్తి అత్యల్పం. కనుకనే 1962—63 లో జాతీయాదాయం పెరుగుదల నూటికి 2—2.5 వంతులకు మించదని చెప్పుకోవచ్చు. ఇంకపోతే 1963—64 లో కూడా వ్యవసాయాభివృద్ధి సంతృప్తికరంగా లేదు. (వ్యవసాయరంగం దెబ్బతినడం అనేది అయిదేళ్ల వరసక్రమంలో ఉంటుంది. అలా జరగడంలో ఇది మూడవ సంవత్సరం. బహుశా నాలుగవ, అయిదవ సంవత్సరాలలో ఉత్పత్తి పైముఖం చూడవచ్చు.) అందువల్ల ఎంత ఆశగా అంచనా వేసినా జాతీయాదాయం పెరుగుదల నూటికి 2—3 వంతులకు మించదు. దీనినే మరొక రకంగా చెప్పుకోవాలంటే, జాతీయాదాయాభివృద్ధి 1961—62 నాటి కంటె నూటికి అయిదు వంతులుగా 1963—64 నాటికి ఉండవచ్చు.

ఇక ధరవరులు చూస్తే 1962—63 లో ఉన్నవి 1961—62 లో కంటె నూటికి 2.2 వంతులు అధికంగా ఉన్నాయి. 1963—64 లో కూడా వ్యవసాయాభివృద్ధి కుంటుపడిన కారణాన ధరలు పెరుగుదల ఇంతగానే ఉంటుందనుకోవచ్చు. అంటే 1961—62 లో కంటె నూటి అయిదు వంతులుగా ధరలు పెరుగుదల 1963—64 లో ఉండి తీరుతుంది. ఈ ప్రకారం ఈ రెండు సంవత్సరాలలోను జాతీయాదాయాభివృద్ధి, ఇప్పటి ధరల ప్రకారం నూటికి 10 వంతులు అవుతుంది. అంటే 1600 కోట్ల రూపాయలన్నమాట. ఇది జాతీయాదాయం సంగతి.

ఇక పన్నుల సంగతి. 1963—64 లో కేంద్ర—రాష్ట్ర ప్రభుత్వాల బడ్జెట్టుల ప్రకారం పన్నులవల్ల రాగల మొత్తం రాబడి సుమారు 2100 కోట్లు. అంటే 1963—64 సంవత్సరానికి అంచనా వేసిన జాతీయాదాయంలో దాని నిష్పత్తి 13.2 అన్నమాట.

దేశంలో పన్నులు విధింపు కేవలం కేంద్ర—రాష్ట్ర ప్రభుత్వాల ద్వారానే కాదు, పెక్కు స్థానిక సంస్థలు కూడా ఆస్తి పన్నులు, ఆక్ట్రాయి పన్నులు, స్థానిక సెస్సులు, వృత్తి పన్నులు, రకరకాల సుంకాలు విధిస్తారు. 1963—64 లో ఇలా ఎంత మొత్తం లభించేది కచ్చితంగా తెలియదు. కాని పన్నుల దర్యాప్తు సంఘం సేకరించిన వివరాలనుబట్టి స్థూలంగా అంచనా వేయవచ్చు. పంచాయతీలు కాక, ఇతర స్థానిక సంస్థలు 1951—52 లో పన్నుల రూపంలో 48 కోట్ల 73 లక్షలు వసూలు చేసినట్టు అంచనా వేశారు. ఇది కేంద్రం విధించే అదనపు పన్నులలో ఏడవ వంతుగా ఉంది. కేంద్రం పన్నుల ధోరణినే స్థానిక సంస్థల పన్నులు కూడా పెరిగిన వనుకుంటే 1963—64 లో స్థానిక సంస్థ లకు పన్నుల రూపంలో సుమారు 170 కోట్లు లభిస్తుం దనుకోవచ్చు. రాష్ట్ర ప్రభుత్వాల అదనపు పన్నులకు—స్థానిక సంస్థల పన్నులకు ఉండే నిష్పత్తి ప్రకారం చూచినా, అంచ నాకు సరిపోతున్నది. రిజర్వుబ్యాంకువారు 1962 నవం బరులో 63 స్థానిక సంస్థల పన్నుల వసూళ్ల ధోరణిని దర్యాప్తుచేసి, ప్రకటించిన వివరాల ప్రకారం చూచినా ఈ 170 కోట్లు అంచనా సవ్యమనిపిస్తున్నది.

పోతే, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు తమ బడ్జెట్టు లలో పన్నుల ఆదాయాన్ని తక్కువగా అంచనా వేసి చూపడం మామూలు. క్రింది పట్టికను బట్టి ఆ సంగతి ధృవపడుతున్నది.

| సంవత్సరం. | అంచనా | నిఖరం. |
|---|---|---|
| 1960—61 | 676.8 | 730.1 |
| 1961—62 | 762.2 | 875.4 |
| 1962—63 | 888.5 | 953.2 |

ఈ అంకెలు కోట్ల రూపాయలలో ఉన్నవి. ఆదాయం నూటికి 10 వంతులు తక్కువగా అంచనా వేయడమనేది మామూలుగా ఉంది. ఈ లెక్కను ఈ ఏడాది కూడా 210 కోట్ల రూపాయల మేరకు తక్కువ అంచనా వేసి ఉంటారని ఉజ్జాయింపుగా చెప్పుకోవచ్చు. ఇదికాక నిర్బంధ డిపాజిట్ల పథకం కింద ఇంకో 60 కోట్ల రాబడుతున్నారు. ఇది కూడా ఒక రకమైన పన్నుకిందే జమ. దానికి ద్రవ్యోల్బణం మొత్తాలు కూడా చేర్చాలి. అది 181 కోట్లుగా ఈ సంవత్స రానికి ఉద్దేశించారు. ద్రవ్యోల్బణం అంటే కరెన్సీ నోట్లు హెచ్చుగా చెలామణిలో పెట్టడం. ఇది కూడా ఒక రకమైన బలవంతపు పన్ను కింద జమ. ఈవిధంగా 1963—64 లో పన్నులవల్ల దేశం మొత్తంమీద రాబట్టే మొత్తం 2721 కోట్ల రూపాయలు అవుతున్నది. అంటే జాతీయాదాయంలో నూటికి 17 వంతులు పన్నుల రూపంలో ప్రభుత్వం రాబడు తున్నదన్నమాట.

ఈ పన్నుల భారం, భారత్‌వంటి విశాల దేశంలో వివిధ ప్రాంతాలలో కాని, విభిన్న వర్గాలమీద (ఆదాయాలు కల వారిమీద) కాని, సమానంగా ఉండదు. అదీకాక ప్రజల తలసరి ఆదాయం అనేది అతి తక్కువగా ఉంటున్నందున, కొత్త పన్నులు విధించడానికి అవకాశాలు తక్కువ అనేది కూడా ఈ సందర్భంలో గుర్తు చేయవలసి ఉంది. అంతేకాదు. తల సరి ఆదాయం అనేది, కటిక పేదరికంలో జీవించే పెక్కు కుటుంబాల నిజస్థితిని చూపదు. జాతీయ నమూనా సర్వే ద్వారా లభించిన అంకెల ఆధారంతో చూస్తే, నెలకు 50 రూపాయల కంటె తక్కువ ఆదాయం కల గ్రామీణ కుటుంబాలు, మొత్తం కుటుంబాలలో నూటికి 20.47 వంతులుగా ఉన్నాయి. అలాగే బస్తీలలో ఇలాంటి కుటుం బాలు నూటికి 12.07 వంతులుగా ఉన్నాయి. అంటే దేశంలోని కుటుంబాలలో ప్రతి ఆరవ కుటుంబం కటిక పేదరికం కంటె తక్కువ జీవితాన్ని అనుభవిస్తున్న వన్న మాట. కనీసపు జీవితావసరాలను సమకూర్చుకొనలేకుండా ఉన్నాయన్నమాట. ఈ కుటుంబాలకు అదనపు పన్నుల భారం భరించగల శక్తి శూన్యం.

ఈ సమస్యనే మరొక దృక్పథంతో కూడా చూడ వచ్చు. దేశంలో అసలు ప్రత్యక్ష పన్నులు చెల్లించని వారు మాత్రంగా పరోక్షపు పన్నులు చెల్లించే విభాగం ఒకటి ఉంది. దానిని Non - monetised Sector అంటారు. ఈ విభాగం ఏదంటే, మారుమూల గ్రామాలలో నివశిస్తూ, ఆహారపు పంటలు పండించుకొని, తింటూ సంవ త్సరం మొత్తంమీద డబ్బు ఖర్చు చేయవలసిన అవసర మనేది దాదాపు లేనట్టుగా నివసించేవారిదన్నమాట. ఇది ఎంతగా ఉందంటే, దేశంలో జరిగే వాడకాలలో నూటికి 37 వంతులు సరాసరిని వస్తు రూపంలోనే స్వయంగా పొందడం జరుగుతున్నదని జాతీయ నమూనా సర్వే నివేదిక చెబుతున్నది. అంటే వారికి డబ్బు ద్వారా వ్యవహారా లనేవి అనవసర మన్న మాట. దేశ ఆర్థిక వ్యవస్థలో మూడవవంతు ఈ దశలో ఉందని పెక్కుమంది నిపుణులు అంగీకరించారు. ఈ విభాగం ఒకవేళ నూటికి 30 వంతులుగా ఉన్న దనుకున్నా, జాతీ యాదాయంలో డబ్బు ద్వారా వ్యవహారాలు జరిగే విభాగం (Monetised Sector) 11,200 కోట్ల రూపా యలుగా ఉంటుంది. (1963—64 లో జాతీయాదాయం

16,000 కోట్లు అంచనా వేశాము కనుక) ఇందులో పన్నుల రూపంలో 2721 కోట్ల రూపాయలు ప్రభుత్వం వసూలు చేస్తున్నదంటే, నూటికి 24.3 వంతున ఈ విభాగం నుంచి రాబడుతున్నదన్నమాట. (అంటే ప్రతి రూపాయికి పావలా తీసుకుంటున్నదన్నమాట.)

ఈ పన్నుల భార సమస్యను మరొక రకంగా కూడా పరిశీలించవచ్చు. వచ్చే ఆదాయాలను బట్టి చూడగా గ్రామాలలో కంటె బస్తీలలో పన్నుల భారం అధికంగా ఉంది. గ్రామాలలోని ఆదాయంతో పోల్చినప్పుడు అక్కడ ఉన్న పన్నుల భారం నిష్పత్తి కంటె, బస్తీలలోని ఆదాయాలతో పోల్చినప్పుడు అక్కడ ఉన్న పన్నుల భారం నిష్పత్తి చాలా హెచ్చుగా ఉందని కొన్ని అంచనాలవల్ల తెలియవచ్చింది. జాతీయాదాయంలో గ్రామాల—బస్తీల వాటాలను, అక్కడి వాడకాల తీరునుబట్టి సులభంగా మదింపు వేయవచ్చు. కాని, పన్నుల భారంలో అలా బస్తీల—గ్రామాల వాటాలను విభజించడం కష్టం. అయినా స్థూలమైన కొన్ని ప్రాతిపదికలతో జాతీయాదాయాన్ని—పన్నుల భారాన్ని గ్రామాలు—బస్తీల మధ్య కింది జాబితాలో చూపినట్టు విభజించే ప్రయత్నం జరిగింది :—(అంకెలు కోట్ల రూపాయలలో)

| | బస్తీలు. | గ్రామాలు. |
|---|---|---|
| జాతీయాదాయం : | 4000 | 12000 |
| పన్నుల భారం : | | |
| కేంద్రం రాష్ట్రాలు | 1100 | 1210 |
| స్థానిక సంస్థలు | 150 | 20 |
| లోటు బడ్జెటులు | 72 | 109 |
| నిర్బంధ డిపాజిట్లు | 30 | 30 |
| మొత్తం పన్నులభారం | 1352 | 1369 |
| జాతీయాదాయంలో నిష్పత్తి | 33.8% | 11.4% |

తాత్కాలికంగా తయారైన ఈ అంచనాల ప్రకారం చూడగా 1963—64 లో బస్తీల ఆదాయం నుంచి రాబట్టే పన్నులు రాబడి నిష్పత్తి, గ్రామాల ఆదాయం నుంచి వచ్చే పన్నుల రాబడి నిష్పత్తి కంటె మూడు రెట్లు అధికంగా ఉండగలదని స్పష్టంగా తెలుస్తున్నది.

దేశంలో పన్నుల భారం ఇంకా పెంచవచ్చునని వాదిస్తూ విచిత్రమైన ఒక సంగతి ఉదాహరించడం జరుగుతున్నది. పెక్కు దేశాల జాతీయాదాయం నుంచి పన్నుల రూపంలో రాబట్టే మొత్తం నిష్పత్తి, భారతదేశంలో కంటె హెచ్చుగా ఉంటున్నదని చూపుతున్నారు. ఈ సంగతి కూడా గ్రహించటానికి ఈ క్రింది పట్టికను చూడవలసి ఉంది.

| దేశం పేర్లు. | జాతీయాదాయంలో పన్నుల నిష్పత్తి. |
|---|---|
| బ్రిటన్ | 33.33 |
| అమెరికా | 30.22 |
| ఫ్రాంసు | 26.70 |
| కెనడా | 17.99 |
| అర్జంటీనా | 11.42 |
| ఇటలీ | 17.08 |
| ఆస్ట్రేలియా | 25.11 |
| నార్వే | 22.46 |

ఈ పట్టికను బట్టి చూడగా బ్రిటన్, అమెరికా, ఫ్రాంసు, నార్వే, ఆస్ట్రేలియాలలో మాత్రమే పన్నుల నిష్పత్తి నూటికి 20 కి పైగా ఉంది. ఆసియాలో జపాన్, బర్మా, లంక, థాయ్‌లాండ్ వగైరాలలో ఈ నిష్పత్తి భారతదేశంలో కంటె హెచ్చుగా ఉంది. ఇంతగా పన్నుల భారం హెచ్చుగా ఈ దేశాలలో ఉండడాన్ని గురించి ఆలోచించేటప్పుడు, ఆ దేశాలలో విద్య, శిశుసంరక్షణ, ఆరోగ్య వసతులు, గృహ సౌకర్యం, వృద్ధాప్యం పింఛను, జాతీయ భీమా వసతి వగైరాల ద్వారా పౌరులకు సమకూర్చే సాంఘిక సదుపాయాలు, సాంఘిక భద్రతను విస్మరించరాదు. ఉదాహరణకు బ్రిటన్‌లో జాతీయాదాయంలో నూటికి 33 వంతుల వరకు (1961) లో పన్నుల రూపంలో రాబట్టినా, అందులో నూటికి 19.4 వంతులకు తగ్గని మొత్తాన్ని సాంఘిక సదుపాయాల కింద వ్యయపరుస్తున్నారు. అమెరికా, కెనడా వగైరా దేశాలలో కూడా ఇంతే జరుగుతున్నది. (కాని, భారతదేశంలోనో ?)

పన్నుల విధానాలలో మరొక గమనార్హమైన అంశం కూడా ఉంది. అభివృద్ధిచెందిన దేశాలు అమెరికా, బ్రిటన్ జపాన్ వగైరాలలో అతిగా పన్నులు విధించడంవల్ల ఆర్థికాభివృద్ధి తగ్గుతుందని అనుభవంమీద తెలుసుకున్నారు. అందువల్లనే ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలలోను, ఆర్థికాభ్యున్నతి కృషిలోను ప్రజలు ఇచ్ఛికంగా పాల్గొనేటట్టు చేయడానికిగాను అమెరికా, బ్రిటన్‌ల ఈమధ్య బడ్జెటులలో పన్నుల భారాన్ని తగ్గిస్తూ రావడం జరిగింది. అత్యధిక పన్నుల భారం వల్ల తప్పనిసరిగా ఆర్థికాభివృద్ధి జరుగుతుందని చెప్పడానికి వీలులేదని, దీర్ఘకాలంలో క్రమక్రమంగా ఆర్థికాభివృద్ధిని అది కుంటుపరచవచ్చునని ఈ దేశాల ఆర్థిక నిపుణులు, పాలకవర్గాలు సుదీర్ఘంగా పరిశీలనలు, చర్చలు కొనసాగించిన

తర్వాతనే ఒక నిర్ణయానికి వచ్చి పన్నుల భారం తగ్గించే చర్యలు తీసుకున్నారు.

కాని, ఆసియా దేశాలలో మాత్రం 1950 నుంచి పన్నుల ద్వారా రాబడిని పెంచే ధోరణి స్పష్టంగా కానవస్తున్నది. భారతదేశంతో సహా 10 ఆసియా దేశాలు 1950—1960 ల మధ్య పన్నుల భారాన్ని (జాతీయాదాయంలో దాని నిష్పత్తిని) ఎలా పెంచినదీ ఆసియా—దూర ప్రాచ్య ఆర్థిక సంస్థవారు ప్రచురించిన ఈ కింది పట్టికను బట్టి తెలుసుకోవచ్చు :—

| దేశం పేరు. | పన్నుల నిష్పత్తి. | |
|---|---|---|
| బర్మా | 16.2 | 24.0 |
| లంక | 14.5 | 19.9 |
| ఇండియా | 6.9 | 9.5 |
| ఇండొనీసియా | 15.7 | 11.8 |
| జపాన్ | 26.0 | 24.7 |
| పాకిస్తాన్ | 8.2 | 7.2 |
| ఫిలిప్పీన్స్ | 8.0 | 12.2 |
| థాయ్‌లాండ్ | 6.1 | 13.6 |
| తైవాన్ | 16.4 | 19.4 |

ఈ పట్టికను బట్టి జపాన్, ఇండొనీసియాలలో మినహా ప్రతి దేశంలోను పన్నుల భారం నిష్పత్తి పెరిగినట్టు తెలుస్తున్నది. అయితే ఈ అన్ని దేశాలలోను అదనపు పన్నులు విధించడం వలన ఆర్థికాభివృద్ధి త్వరితగతిని సాగినట్టు ధృవపడడంలేదు. పోతే ఈ అంకెలను ఒకదానికి ఒకటి పోలికగా చెప్పుకొనడానికి వీలుపడదు. వీని పన్నుల విధానాలు దేశానికొక రకంగా ఉండడమే దీనికి కారణం. ఈ అంకెలనుబట్టి ఆసియా మొత్తంమీద భారతదేశంలోనే పన్నులభారం చాలా తక్కువగా ఉన్నట్టు కనిపిస్తుంది. కాని, భారతదేశంలో ఉన్న పేదరికం, బర్మా, లంకలలో కంటె సర్వ విధాల అత్యధికమని ఈ అంకెలు సూచించవు. అందువల్లనే ఇతర దేశాలలో పన్నుల భారాన్ని ఉదాహరణగా చూపుతూ, భారతదేశంలో పన్నుల భారం పెంచడానికి ఇంకా అవకాశాలు కలవని ఆలోచిస్తూ, వాదిస్తూ ఉండేవారికి మరొక హెచ్చరికను గూడా చేయవలసి ఉంది. దేశంలోని బస్తీ ప్రాంతాలు, డబ్బుతో వ్యవహారాలు సాగించే రంగం (Monetised Sector) మీద పన్నుల భారం ఇప్పటికే అధికంగా ఉందని ఇదివరకే ఉదాహరించి ఉన్నాము. వానిమీద ఇంకా పన్నుల భారాన్ని పెంచినప్పుడు—గతంలో దేశం ఆర్థికాభివృద్ధికి తోడ్పడిన ఈ వర్గాలలో పొదుపరితనం తగ్గి, వారినుంచి తగినంతగా పెట్టుబడులు రాక (లేక) ఆర్థికాభ్యున్నతి మందగించే ప్రమాదం కూడా ఉంది. కష్టించి, పొదుపు చేసుకొని సంపాదించాలనే కాంక్ష వీరిలో తగ్గిపోగల పరిస్థితులు ఏర్పడగలవు. ఇంకా పన్నుల భారం పెంచడం అనేది వీరి ఆదాయాలను ఇంకా తగ్గించి ఆర్థికంగా ముందడుగు వేయగల శక్తిని కూడా నశింపు చేస్తుంది. (ఈస్టర్న్ ఎకనామిస్టు సౌజన్యంతో)

[అయినా 1964-65 బడ్జెట్టులో 40 కోట్ల రూపాయలు అదనపు పన్నులు విధించారు—సం]



# జననఘటికా నిర్ణయము

శ్రీ దివాకరుని వెంకటసుబ్బారావు

వసిష్ఠ, నారద, పరాశర, భృగు, జైమిని మహర్షులచే తెలుపబడి, వరాహమిహిర, సత్యాచార్య, కాళిదాసాది మహనీయులచే ఆదరింపబడిన వేదాంగమగు జ్యోతిశ్శాస్త్రము ఈనాడు ‘ఇది శాస్త్రమా’ యను ప్రశ్నకు గురియగుట అత్యంత విచారకరము. ఈ శాస్త్రము పరిపూర్ణత చెందినదని ఎవ్వరిచేతను తెలుపబడలేదు. ఇతర శాస్త్రములవలె ఇందును పరిశోధనం కనేక అవకాశము లున్నవి. ప్రస్తుత కాలమున గూడ శాస్త్రాభిమానము గలవా రనేకు లున్నను రాజాదరణము లేనందున పరిశోధన భాగము వెనుకబడి యున్నది. దుర్జనుల ప్రలాపములు శీఘ్రవ్యాప్తి నొందిన కొలది శాస్త్రజ్ఞులచే నుడువబడిన ఫలము లనుభవనీయములుగా నుండుట ప్రచారహేతువైనది. జ్యోతిశ్శాస్త్రజ్ఞులమను పేరులో వ్యవహరించు మోసగాండ్ర కనుకూల విద్య యైనందున ఈ శాస్త్రము గౌరవ మర్యాదల గోల్పోవుట విశదము. దైవబలము లేనివారి కలవిగాని ఈ శాస్త్ర రహస్యములు, హీనులు తమ హస్తగతము లైనవని ప్రలాపించుచు, స్వల్ప ధనాపేక్షతో దీనిని దుర్వినియోగ పరచుచుండుట ఎల్లరకు అనుభవనీయము. న్యాయరీత్యా పరిశీలించిన జ్యోతిషము శాస్త్రమనుట నిస్సందేహము. మానవ జీవితము దైవకృతమని గ్రహించినవారు, పూర్వ జన్మ సుకృతము గలవారు గాని ఈ శాస్త్రజ్ఞానము నొందలేరని గ్రహింపగలరు. పూర్వ జన్మల సుకృత దుష్కృత ఫలములే ఈ జన్మకు హేతువులు. జీవి అనేక జన్మల నొందుచు దైవమాయకులోనై ఎచటి నుండి వచ్చెనో, గమ్యస్థాన మేదో యెరుగక సంసార సాగరమున అహంభావ ప్రేరితుడై వ్యవహరించుచున్నాడు. ఇట్టి అంధకారమునుండి తొలగించి క్రమ మార్గమును జూపు జ్యోతియే జ్యోతిశ్శాస్త్రము. జననకాల గ్రహస్థితి ననుసరించి సంభవించు దశా ఫలముల ననుభవింపక తప్పదు. అష్టకవర్గ, గోచారములచే సూచింపబడు కష్టములు మాత్రము జప, శాంతి, వ్రతాదులచే పరిష్కరింప వీలగును. న్యాయ ప్రవర్తన సర్వ పరిహార కర్మల నధిగమించి ఫలప్రద మగును. కర్మబంధముల వీడి, సుఖముగా జీవింపవలెనన్న ఖండహేతువుల జ్యోతిశ్శాస్త్రరీత్యా ఎరుగవలెను గాని, వేరొక మార్గము లేదు. ఆయుర్దాయాభివృద్ధి, క్షీణత సహితము యోగాభ్యాసము వలన మంత్రోపాసన వలన సాధింప నలవియగుట సమస్త జ్యోతిశ్శాస్త్రములందు తెలుపబడి యున్నది. సర్వ జీవిత రహస్యముల నెరిగి జీవితమును క్రమమార్గమునకు మరలించి ఇహపర సౌఖ్యముల నొందుటకు మార్గదర్శియగు జ్యోతిశ్శాస్త్రము నవమానించి నిందించుటకన్న ఈ శాస్త్రము నాదరించి యభివృద్ధి నొందించుట సమస్త మానవకోటికి ఆచరణీయము.

జ్యోతిశ్శాస్త్రజ్ఞులచే నుడువబడు ఫలము లేల ప్రాప్తించుటలేదను అంశమును పరిశీలింతము. శాస్త్రము రెండు భాగములు; గణిత ఫలభాగములు. గణితభాగము పంచాంగముల మీద నాధారపడి యున్నది. పంచాంగకర్తలు వాక్య, సిద్ధాంత, దృగ్గణిత రీత్యా పంచాంగముల గుణించి ప్రచురించుచున్నారు. అందు నక్షత్రచారమే వార, తిథి, యోగ, కరణముల వరకు ఏ రెండు పంచాంగముల జూచిన సమానములు గావు. ఇట్టి పంచాంగముల మీద నాధారపడి తయారు చేయబడిన జాతకముల ప్రమాణములుగా స్వీకరించి ఫలభాగ ముపక్రమించుచున్నారు. ధనాశాపరులై కొందరు, క్రమ పద్ధతుల జాతకముల తయారుచేయు జ్ఞానములేని మరి

కొందరు తప్పుల తడికలగు జాతకముల జూచి వక్కాణించు ఫలము నెట్లు అనుభవనీయములగునో గ్రహించిన ఇందలి రహస్య ములు విశదమగును. అట్టి జాతకములలో జూపబడు కేంద్రములు కేంద్రములు గావు; కోణములు కోణములు గావు; గ్రహస్థితి సంబంధ దృష్టులు సరిగావు. భావ నిర్ణయ ముండదు; జననకాల మే డిగ్రీలో నున్నది, లగ్నరాశిగతులగు గ్రహము లెచ్చట నున్నవి విచారింపక అట్టి గ్రహముల లగ్నభావ గతు లుగా భావించి వక్కాణించు ఫలములు ఫలములుగావు, ఫలిం పవు. ఇట్టి ప్రమాద కారణము లనేకము లున్నవి. జనన కాల నిర్ణయము సహితము జేయక, తెలుపబడిన కాలమునకు జనన మున్నదా, లేదా యని విచారింపక తత్కాలానుసారము జాత కము తయారుచేయుచు జ్యోతిశ్శాస్త్రవేత్తలమను పేరుతో వ్యవహరించువారు ప్రజలను మోసగించుట అత్యంత విచార హేతువు. జ్యోతిషజ్ఞానము లేని ప్రజలు ఇట్టి మోసగాండ్రను ఆదరించి అభిమానించుట ఆత్మవంచన గదా! ఇందుచే ధన వ్యయమే గాక జ్యోతిశ్శాస్త్రాభిమానము గూడ నశించు చున్నది. విజయవాడకు 20 మైళ్ళ దూరమున తూర్పుగా నున్న ఒక గ్రామములో 1963 జనవరి 10 వ తేది ఒక శిశువు ఉదయం 9 గంటలకు జనన మొందెనని తెలుపబడ గానే, ఇది ప్రమాణముగా భావించి జ్యోతిష్కులు ఆ గ్రామ మునకు అప్పటి కాలనిర్ణయము జేయక, తమవద్ద నున్న పంచాంగముల మీద నాధారపడి జాతకమును తయారు చేయుచున్నారు. 9 గంటలు ఇండియన్ స్టాండర్డు టైమనుట మరచుటయే గాక ఆ గ్రామమందు ఆనాడు సూర్యోదయ కాలముగాని, తత్కాల గ్రహస్థితి గాని గ్రహించుటలేదు. 9 గంటలకు జనన మున్నదా అను అంశమును పరిశీలించుట లేదు. ఏలన జననకాల నిర్ణయ జ్ఞానము వారికి లేదు. గాన క్రమ పద్ధతిలో జాతకముల తయారుచేసిన గాని ఫలముల నరయ వీలుగాదు.

జననకాల నిర్ణయ మెట్లు? ప్రసవారంభ కాలమా? శిరోదయమా? భూ పతనమా? ప్రథమశ్వాస కాలమా యను సందేహ మున్నది. సామాన్యముగా భూపతన కాలమే ప్రమాణము. ఏలన, ప్రథమశ్వాస, భూపతనము ఏకకాల మున జరుగుచున్నవి. అయనాంశ నిర్ణయము మరియొక వివా దాంశము. శాస్త్రజ్ఞులచే పరిశీలింపబడి, భారత ప్రభుత్వముచే ఆమోదింపబడిన అయనాంశ నాధారము చేసికొనిన చాలును. ఇక ఇతర అంశముల పరిశీలింతము. మానవజన్మ నిర్ణీత కాలము లందు మాత్రమే జరుగుచున్నది. ఇతరవేళల పశు పక్ష్యాదులు జనన మొందుచున్నవి. వివిధ నక్షత్రచార గతుడగు చంద్రుడు, సూర్య శక్తి నొంది వారాధి దేవత సహాయ్యు ముచే తత్కాల తత్వపు ప్రభావముచే స్త్రీ పురుష జన్మ లకు కారకు డగుచున్నాడు. పంచ భూతాత్మకమైన శరీరములు పంచ తత్వ ప్రభావములచే గ్రహ, వార, నక్షత్ర కాల, రాసుల ఏకాగ్రత నొంది జనన మొందుట గ్రహింప వలెను. పృథ్వి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశ మనునవి పంచభూత పంచ తత్వములు. రవి వారాదిగా తేజస్తత్వము సూర్యోదయాది 6 నిమిషముల ప్రమాణము గలిగి చరరాసు లందు కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రముల గత మగు చున్నవి. మిగిలిన తత్వములు క్రమముగా తమ వారాధి దేవ తల వారములందు ప్రారంభమగుచున్నవి. ఆయా తత్వ ములు క్రమముగా 6 నిమిషములు ప్రమాణము అధికముగా గలిగి మొత్తము 90 నిమిషములలో సమాప్తినొంది క్రమము తప్పక మరల ప్రారంభ మగుచున్నవి. పృథ్వి, తేజస్సు, ఆకాశ తత్వములతో పురుషజన్మయు, జలవాయు తత్వములతో స్త్రీ జన్మయు గలుగుచున్నవి. రవి, కుజులు తేజస్తత్వమునకు, చంద్ర శుక్రులు జల తత్వమునకు, బుధుడు పృథ్వి తత్వము నకు గురుడు ఆకాశ తత్వమునకు, శని వాయు తత్వమునకు అధి పతులు. గ్రహకారకత్వములే తత్వ కారకత్వములుగా భావింప వలెను. పృథ్వీ వాయువుల సంబంధమే శని, బుధుల సంబం ధము. అట్లే శుక్ర చంద్రులు, రవి, కుజులు సంబంధించి యున్నారు. ఈ క్రమానుసారము జనన స్థల సూర్యోదయ కాల మెరిగి జననకాల లగ్నమే రాశియందుండునో విచారించిన జనన మెప్పుడు జరుగుచున్నదో నిర్ణయింపగలము. ఇట్లు తయారుచేసిన అనేక జాతకముల ఫల భాగము యదార్థ స్థితిని జూపుచున్నది. అట్లు నిర్ణయించుటకు వీలుగాని జాతక ములు కొద్దిగా లేకపోలేదు. వానిని సరిజేయు క్రమము దిగువ తెలుపగలను. శస్త్రచికిత్సచే ప్రసవము గావింపగా జన్మించిన శిశువుల జనన కాల నిర్ణయ మెట్లను ప్రశ్న జనించుచున్నది. అనుభవములో వీరికి గూడ భూపతన కాలము ప్రధానము జేసుకొని ఆధాన లగ్నము నేర్పరచి, దానితో సరిజూచి జననకాల నిర్ణయము చేయవచ్చును. ఇది శాస్త్ర సమ్మతము. ఆధానము ననుసరించి గదా జన్మము. పూర్వ పుణ్యము గల జీవులు ఆధాన లగ్నమునుండి 5 లేక 9 వ రాశియందు జనన మొందుచున్నారు. శుభగ్రహ సంబంధము గలిగిన ఆధాన లగ్న జాతకులు పూర్ణా యుర్దాయువంతులై సర్వ సుఖముల ననుభవించు చున్నారు. ఆధాన నిషేధక లగ్నములకు భేదము లేదు.

# జననఘటికా నిర్ణయము

సూర్యోదయాది తత్వ సంబంధమును జూపుటకు సులభ మార్గము :—

| వారము | తత్వము | కాలము |
|---|---|---|
| బుధవారము | పృధ్వి | 6 నిమిషములు |
| సోమ, శుక్రవారములు | జల | 12 నిమిషములు |
| ఆది మంగళవారములు | తేజస్సు | 18 నిమిషములు |
| శనివారము | వాయువు | 24 నిమిషములు |
| గురువారము | ఆకాశ | 30 నిమిషములు |

ఈ క్రమము ననుసరించి దిన ప్రమాణమునకు పట్టీ తయారుచేసిన జనన కాలము సులభముగా నిర్ణయింప వచ్చును.

## గణితభాగ మెంతవరకు?

ఫలభాగమునకు పూర్వము జ్యోతిశ్శాస్త్ర పండితులు జాతకముల స్వయముగా తయారుచేసికొనుట శ్రేష్టము. లేదా విశ్వసింపదగిన వారిచే తయారుచేయబడిన జాతకముల పరిశీలించుట అవసరము. జనన కాల నిర్ణయానంతరము రాశి చక్రాది గోష్ట్యంశల వరకు షోడశవర్గుల చక్రములు తయారుచేయవలెను. భావ చక్రము ప్రధానము. గ్రహముల బలాబలముల నరయుటకు షడ్బల సాధన, ఇష్ట కష్ట ఫల సాధన శ్రీపతి పద్ధతి ననుసరించి సాధింపవలెను. జననకాల దశాశేషమును నిర్ణయించి, దశ, అంతర్దశ, విదశ, సూక్ష్మ దశ, ప్రాణదశల క్రమముగా తయారు చేయవలెను. గ్రహముల సమయములు, అవస్థలు, జననకాల బలములు, సర్వాష్టక వర్గ రాశి, గ్రహ గుణకారములు, త్రికోణ, ఏకాధిపత్య శోధనలు గావింపవలెను. ఫలముల నరయు కాలమునకు గోచార చక్రముల తయారుచేసి గ్రహముల, తారాబల, మూర్తి నిర్ణయము గావింపవలెను. జాతకమందు ప్రాప్తించిన యోగములు, అధియోగములు, ధన, దరిద్ర యోగములు, రాజయోగములు నిర్ణయించి ఫలభాగ మాలోచించుట శాస్త్ర విధానము. ఇట్లు సంపూర్ణముగా తయారుచేయబడిన జాతకముల ఏకాగ్రతతో పరిశీలించి చెప్పు ఫలములు జరుగక తప్పవని అనుభవము. పరిశీలనా లోపమువల్ల గాని, గణితభాగమందుండు తప్పులవల్ల గాని ఫలములు అనుభవనీయములు గాకున్న అంతటితో తృప్తిచెందక మరల గణిత ఫలభాగముల పరిశీలించి తప్పుల సరిచేసికొనిన జరుగనున్న దశలలో పొరపాట్లు రావు.

| జననము | నక్షత్రములు. చరరాసి | స్థిరరాశి | ద్విస్వభావరాశి |
|---|---|---|---|
| పురుషుడు | కృత్తిక,ఉత్తర ఉత్తరాషాడ | మృగశిర, చిత్త ధనిష్ఠ | పునర్వసు, విశాఖ పూర్వాభాద్ర |
| స్త్రీ | — | — | — |
| పురుషుడు | — | — | — |
| స్త్రీ | — | — | — |
| పురుషుడు | — | — | — |

ఇంత శ్రమకోర్చి సాధింపగల జాతకము లెట్లుండునో పరిశీలించిన ప్రస్తుతము జ్యోతిశ్శాస్త్రవేత్తలమను పేరుతో రాశ్యంశ చక్రముల నాధారము జేసికొని వ్యవహరించువారు నిత్యము స్వల్ప ధనాశాప్రేరితులై అనేక జాతకముల జూచి ఫలముల దెల్పుట శుద్ధ మోసమని స్పష్టమగుచున్నది. వీరు గాక ఉపాసనా బలముచే జ్యోతిశ్శాస్త్రజ్ఞులను పేరుతో వ్యవహరించువా రనేకు లున్నారు. వారు చెప్పినవి జరుగుట అనుభవనీయము. ఇది జ్యోతిషము గాదు గదా! అట్టి ఫలములు కొద్ది కాలము మాత్రమే అనుభవనీయమగుట, అట్టివారు తమ శక్తిని శీఘ్రకాలములో పోగొట్టుకొని అతి కష్టములకు గురి యగుట ఎల్లరకు విశదము. దైవబలమును దుర్వినియోగము జేసినవారు తత్ఫలితముల ననుభవింపక తప్పదు. పై నుదహరింపబడిన గణిత భాగరీత్యా సాధించు ఫలభాగము ప్రభువులకు గాని యలవిగాదని అనేక గ్రంథములందు దెలుపబడి యున్నది. వసిష్ఠాదులు సహితము కొద్ది జాతకముల మాత్రమే పరిశీలించినట్లు ప్రమాణము లున్నవి. గాన ఇందలి యదార్థమును గ్రహించినవారు జ్యోతిశ్శాస్త్రమును దూషింపరని నమ్ముచున్నాను.

## ఆధానలగ్న నిర్ణయ మెట్లు ?

1. చంద్రలగ్నము ఆధాన జనన లగ్నములకు సమదూరమున నుండును.(అనగా రెండు లగ్నములకు మధ్య)
2. జననకాల లగ్న చంద్రులకున్న దూరము ఆధాన లగ్న జనన చంద్రుల దూరమునకు సమానము.
3. జనన కాల చంద్రలగ్న జనన లగ్నముల మధ్య ఆధాన లగ్న ముండవచ్చును.
4. నిర్ణీత కాలమునకు పూర్వము జన్మించిన శిశువులకు ఆధాన లగ్నము జననకాల సూర్య చంద్ర లగ్నముల మధ్య నుండి వచ్చును.
5. ఆధానలగ్న ద్వాదశాంశ రాశియందు జననకాల చంద్రుడుండును. లేదా ఆ రాశికి 10 వ రాశియందుండును.

6. ఆధాన లగ్నమందు రవి, శుక్రులు బలవంతులై ఉపచయములందుండి వర్గోత్తమాంగల నొందిన మగ శిశువును, చంద్ర కుజులు ఉపచయగతులై వర్గోత్తమాంశలందున్న స్త్రీ జననము గల్గును.

7. జననకాల చంద్రరాశి ఆధానకాల లగ్న ద్వాదశాంశను మేషాదిగా లెక్కించిన సరిపోవును. లేదా

8. ఆధానలగ్న చంద్ర నవాంశ రాశికి సప్తమమందు చంద్రచార జరుగునపుడు జననము గల్గును. లేదా

9. ఆధాన లగ్న నవాంశ రాశ్యాధిపతి రాశియందు చంద్రచార జరుగునపుడు జననము గల్గును. లేదా

10. ఆధాన లగ్న రాశికిగాని ఉపనవాంశ రాశికిగాని 5 లేక 7 వ రాశి జననరాశి. లేదా

11. ఆధాన లగ్న ద్వాదశాంశ రాశినుండి సముద్వాదశాంశములు గల రాశియందు చంద్రుడున్న వేళల జననము గల్గును. అనగా జననరాశి యందలి చంద్రభుక్తి ఆధాన ద్వాదశాంశ భుక్తికి సమానము.

12. ఆధాన లగ్నము శీర్షోదయ రాశియో లేక పృష్ఠోదయ రాశియో నెరిగి అందలి భుక్తి గమనింపవలెను. శీర్షోదయ రాశియైన దినమందు, పృష్ఠోదయ రాశియైన రాత్రులందు సమకాలానంతరము జననము గల్గును. జననకాల ఘడియలు జననరాశికి 1/60 వంతునకు సరిపోవును.

13. జననకాల నక్షత్రము ఆధాన కాల నక్షత్రమునకు 10 వది.

14. ఆధాన లగ్నమునకు గాని ఆధానకాల చంద్రరాశికి గాని 7 వ రాశి జననరాశి.

15. జననకాలమందు వృద్ధి చంద్రుడు దృశ్యుడైననూ, క్షీణ చంద్రుడు అదృశ్యుడైననూ ఆధానకాలమునుండి జననకాలము నుండి 10 చంద్రమాసములు గాని 9 సూర్యమాసములు గాని యగును. లేదా కొంచెము తక్కువగా వచ్చును గాని హెచ్చదు.

16. జననకాలమందు వృద్ధి చంద్రు డదృశ్యు డైననూ క్షీణ చంద్రుడు దృశ్యు డైననూ ఆధాన జననకాలము భేదము 10 చంద్రమాసముల కెక్కువగా నుండును. చంద్రమాసము—27.32305 రోజులకు సమానము. అదృశ్య చంద్రునకు లగ్నమునుండి చంద్రుని వరకున్న భాగలను, దృశ్య చంద్రునకు సప్తమ భావము నుండి చంద్రుని వరకున్న భాగంను 12 చే భాగించిన భాగ ఫలము 10 చంద్రమాసములకు కలుపుటచే గాని తీసి వేయుటచే గాని జనన దిన మెరుగవచ్చును.

17. శుక్లపక్షమందు జననము జరిగిన జన్మలగ్నము ఆధాన చంద్రలగ్నముగాను, కృష్ణపక్ష జననములకు సప్తమ భాగము ఆధాన చంద్రలగ్నముగాను భావింపవలెను.

18. జననకాల చంద్రస్థిత రాశి ఆధాన చంద్రుని వృద్ధి క్షీణతల ననుసరించి ఉదయించుచున్నదో, అస్తమించుచున్నదో తెలియునగును.

19. ఆధానకాలమందు చంద్రుడే ద్వాదశాంశయం దుండునో గమనించి అచటినుండి సముద్వాదశాంశలు లెక్కింపగా వచ్చు రాశియందు చంద్రుడుండగా జననము కలుగును. ఒక్కొక్క ద్వాదశాంశ 150 కళలు గల్గియున్నది. 5 వ ద్వాదశాంశయందు చంద్రచార యుండిన 600 నుండి 750 కళల మధ్య చంద్రు డుండును. వీనిని నక్షత్రకళంను 800 చే భాగింపగా చంద్ర స్థిత నక్షత్రపాద భాగం నెరుగ నగును. దీని ననుసరించి జననము ఏ ఘడియలో జరుగుచున్నదో తెలియును. అనగా ఆధానకాలమునుండి పదవ మాసమున ద్వాదశాంశచే సూచింపపబడిన రాశియందు కళలచే నిర్ణయింపబడిన డిగ్రీంలో జననము గల్గును.

## జననకాల నిర్ణయ సూత్రములు

1. జననకాల ఘడియలను 4 చే హెచ్చించి 9 చే భాగింపగా వచ్చు శేషముచే అశ్వని, మఖ, మూలాదిగా లెక్కించగా సూచింపబడు నక్షత్రమందు జననము. ఇట్లు నతిగానున్న 15 విఘడియల కొక నక్షత్రము వంతున జన్మనక్షత్రము వరకు జననకాల ఘడియలకు కూడుట లేక తీసివేయుటచే జననకాల ఘడియలు స్పష్టమగును.

2. జననకాల ఘడియలు 6 చే హెచ్చించి జననకాల సూర్యుడున్న రాశియందు గతించిన భాగలను కూడి మొత్తమును 30 చే భాగించి భాగ ఫలమునకు 1 చేర్చిన సూర్యాది తద్రాశియందు జననము గల్గును.

3. జననకాల ఘడియ విఘడియలను విఘడియలు జేసి 225 చే భాగించి శేషించిన వానితో 15—30—45—60—75 గాగల ఖండములలో ఏ ఖండమునకు శేషము సరిపోవునో నిర్ణయించిన ఖండములో జనన మేర్పరచి బేసి ఖండములందు పురుష జనన మనియు సరిఖండములందు స్త్రీ జనన మనియు సరిచూడవలెను.

4. జననకాలమునకు మాంది యుండు రాశి, నవాంశల నిర్ణయించిన తద్రాశ్యంశలందు గాని వాని సప్తమ పంచమ నవములందు గాని జననము జరుగును.

5. మాంది యున్న రాశిని తద్రాశ్యాధిపతి యుండు రాశిని గమనించిన, జననలగ్నము వానికి కోణములందు గాని, మాంది నవాంశాధిపతికి కోణములందుగాని యుండును. ఇట్లే గుళికుని నుండి చూడవచ్చును. జాతక మందు చంద్రుడు బలవంతుడైన మాందిని గణింపక చంద్రునుండి జనన లగ్నమును నిర్ణయించ వలెను.

6. జననకాల ఘడియలను 4 చే హెచ్చించి ఆ లబ్ధమునకు మేషాదిగా జనన లగ్నము వరకు నున్న సంఖ్యను కలుపగా వచ్చిన మొత్తమును 27 చే భాగించి, శేషించిన సంఖ్యచే అశ్వన్యాదిగా సూచింపబడు నక్షత్రముగాని దానికి 10 వ నక్షత్రముగాని,జనన నక్షత్రమగును. లేదా తత్కాల దశానాథుని మూడు నక్షత్రములలో ఒకటి యగును.ఇట్లు జననకాల ఘడియలో విఘడియలను సరిచేయవచ్చును.

7. సూర్యోదయాది జననకాలము వరకు గణించిన ఘడియలను సగముచేసి వానికి సూర్యు డుండెడి నక్షత్రసంఖ్య కలిపిన మొత్తముచే సూచింపబడు నక్షత్రరాశి జన్మలగ్న మగును.

8. జననకాల ఘడియలను 6 చే హెచ్చించి లబ్ధమునకు సంక్రమణాది తేదులను కలిపి మొత్తమును 3 చే భాగింపగా వచ్చిన భాగ ఫలము సూర్యరాశిని వదలి తదాది ఏ రాశిని సూచించునో అట్టి రాశి జనన లగ్న మగును.

9. చంద్రరాశి లేదా అచటనుండి 7, 11,3, 5, 9 రాశులలో నొకటి జన్మలగ్న మగును. లేదా చంద్ర రాశ్యాధిపతి యుండెడి రా.గాని దానికి 5, 9, 7 రాశు లైననూ జన్మలగ్నము. లేదా చంద్ర రాశ్యాధిపతి నుండి 59 వ రాశి జన్మలగ్నము. ఈ పద్ధతి ననుసరించి చంద్రుని మారుగా సూర్యుని జూచిన అది సూర్యలగ్న మగును.

10. (ఎ) జనన దిన సూర్యోదయ డిగ్రీల నుండి తండ్రి జాతక మందలి చంద్రస్థిత డిగ్రీలను తీసి వేయుట.

(బి) జనన దిన సూర్యోదయాది కేతు స్థిత నవాంశాంత్య భాగల నుండి తల్లి జాతకమందలి శుక్ర స్థిత నవాంశాంత్య భాగలను తీసివేయుట.

(సి) శని భాగల నుండి జనన నక్షత్ర అంత్య భాగలను తీసివేసి శేషమును 2 చే హెచ్చించి ఆ మొత్తమును 360 నుండి తీసివేయుట.

(డి) సూర్యోదయ సూర్యభాగల నెరుగుట.

(ఇ) ప్రథమశిశు జననమైన 50 నిమిషములను, రెండవ శిశువునకు $50 \times 2 = 1°40'$ భాగలను అనగా ప్రతి శిశు జననమునకు 50 నిముష ముల వంతున హెచ్చించిన ఫల మెరుగుట.

ఈ పై నుదహరింపబడిన 5 అంశములను కూడగా వచ్చిన భాగలే జనన భాగలు లేదా వానికి 90 లేక 180 లేక270 డిగ్రీలు కలిపిన వచ్చు ఫలములు జనన భాగలు.

11. సూర్యోదయ కాలమునకు జనన తేదిన గత నవాంశ నుండి సూర్యు డెన్ని డిగ్రీలు ఎన్ని నిముషములు ఎన్ని సెకనులు దూరమున నున్నది తెలిసి ఆ సంఖ్యను 2 చే హెచ్చించవలెను. ఆనాటి సూర్యోదయ వేళకు రాహువు సూర్యునికి 165 నుండి 195 డిగ్రీలలో నున్న పై సంఖ్యను 3 చే హెచ్చింపగా వచ్చిన మొత్తమునకు ప్రతి శిశువునకు 50 నిముషముల వంతున కలుపగా వచ్చిన మొత్తమును 3°20' చే భాగింపగా వచ్చిన శేషమును శిశువు జన్మించిన గత నావాంశ అంత్య భాగలకు కలిపిన జననకాల జనన భాగలు స్ఫుటమగును.

12. శుక్లపక్ష జననమునకు చంద్రరాశి లగ్న ద్వాదశాంశ అనగా చంద్ర భాగలను 12 చే భాగించి 2°—30' కలుపగా నేర్పడునది జన్మలగ్నము.

కృష్ణపక్ష జననమునకు చంద్రుని ద్వాదశాంశ రాశికి పంచమరాశి ఆధానకాల చంద్రరాశిగా నుండవలెను.

13. జననకాల ఘటికా విఘటికలను 2 చే హెచ్చించి వచ్చిన లబ్ధమునకు, లగ్నము చర, స్థిర ద్విస్వభావములతో నేదగునో తెలుసుకొని క్రమముగా చ రమైన 5, స్థిరమైన 9, ద్విస్వభావమైన 7 కలిపి వచ్చిన మొత్తమును 4చే హెచ్చించి లబ్ధమును 27చే భాగింపగా వచ్చిన భాగ ఫలము అశ్వని నుండి గాని, చిత్త నుండి గాని లెక్కింపగా జననకాలమునకు గత నక్షత్రమును దెల్పును. శేషము జననకాల నక్షత్రమందు గతించిన భాగలను నిర్ణయించును.

పై సూత్రములో చెప్పబడిన రీతిని 5, 9, 7 లక్కబదులు 5, 10, 15 లను కలిపి లెక్కించిన అంత్యమున వచ్చు భాగఫలము శుక్లపక్ష జననములలో జననకాలమునకు అశ్వన్యాదిగా నుండు నక్షత్రమును, కృష్ణపక్ష జననములలో చిత్తాదిగా యుండు నక్షత్రమును దెల్పును.

14. జననకాల ఘటికా విఘటికలను 4 చే హెచ్చించి లబ్ద మునకు మేషాదిగా లగ్నరాశి వరకు లెక్కింపగా వచ్చు సంఖ్యను కలిపి 8 చే భాగించిన భాగ ఫలము సమ సంఖ్య అయిన పురుషజన్మ యనియు, బేసి సంఖ్య అయిన స్త్రీజన్మ అనియు తెలియవలెను.

15. జననకాల ఘటికా విఘటికలను 225 చే భాగింపగా వచ్చిన శేషము 1 నుండి 15, 46 నుండి 90, 151 నుండి 225 లో నున్న పురుషజన్మ యనియు, 16 నుండి 45, 91 నుండి 150 లలో నున్న స్త్రీ జన్మ యనియు తెలియవలెను.

16. జననకాలమునకు లగ్నరాసియందు శేషించిన భాగలను, చంద్ర రాశియందు గతించిన భాగలను కలిపి వానికి 240 చేర్చవలెను. ఈ మొత్తము ఆధానమునుండి జననము వరకు గతించిన రోజుల ఘడియలను దెల్పును. జననకాలము నుండి వానిని తీసివేసిన ఆధాన కాల దిన ఘటికా విఘటికలు తెలియును. అప్పటి చంద్ర స్థిత భాగల నెరిగి ఆ స్థానమే జననకాలమని నిర్ణయింపవలెను. జనన లగ్నము ఆధాన చంద్ర స్థానము, ఆధాలనలగ్నము జనన చంద్రుని స్థానము.

17. కేంద్ర, పణపర, ఆపోక్లిమ భావములలో ఏ భావము నకు ఉభయపార్శ్వముల గ్రహము లున్నవో గుర్తించి యీ రెండు గ్రహముల మధ్య దూరము నెరిగి, వెనుక నున్న గ్రహభాగలను కలిపి, ముందున్న గ్రహభాగల నుండి తీసివేసిన నిర్ణీతమైన జననకాల లగ్నభాగలు సూచింపబడును.

18. జనన దిన పూర్వదిన దినాంతమునకు గల లగ్న నవాంశ లను తెలియవలెను. జననకాల లగ్నాధిపతికి, గత దినాంత లగ్నాధిపతి, తత్కాల నవాంశాధిపతి, తత్కాల హోరాధిపతి, పగటి జననమైన సూర్య రాశ్యాధి పతిని, రాత్రి జననమైన చంద్ర రాశ్యాధిపతిని గుర్తిం పగా వీనిలో బలవంతుడైన గ్రహరాశి జననకాల నవాంశ రాశి యైనను దానికి 10 వ నవాంశ రాశి యైనను గావలెను.

19. జననకాల ఘడియలను 4 చే హెచ్చించిన లబ్దమును, విఘడియలను 15 చే భాగించిన భాగ ఫలములను కలిపి మొత్తమును 12 చే భాగింపగా శేషము ప్రాణ పద రాశిని దెల్పును. అట్టి ప్రాణపద రాశికి కోణము లందు లగ్నముండును.

20. పై సూత్రమందలి శేషముచే మేషాదిగా లెక్కించిన లగ్నము గుర్తింపనగును. లేదా అట్టి రాశికి కోణము లగ్న మగును. 12 చే భాగింపగా వచ్చిన శేషమును 2 చే హెచ్చించి సూచింపబడు రాశిని వదలి, రాశి యందలి జననకాల సూర్యభాగలను కలిపిన జననకాల రాశియందు గతించిన భాగలను తెల్పును.

21. జననకాల చంద్రభాగలను 13°—20′ చే భాగించి శేషమును నిమిషములుగా మార్చి 9 చే భాగించిన భాగ ఫలము 9 కన్నా ఎక్కువగా నుండిన మరల దానిని 9 చే భాగింపగా వచ్చిన శేషము అశ్వని, మఖ, మూలా దిగా గణించిన సూచింపబడునది జననకాల నక్షత్ర ముగా నెరుగవలెను.

22. జనన దినమున కాలనిర్ణయమునకు (ఎ) సూర్యోదయ వేళయందలి రవి భాగల నుండి చంద్ర భాగల తీసి వేయుము. (బి) కేతు భాగల నుండి చంద్ర భాగల తీసివేయుము. (సి) చంద్ర నక్షత్ర సంఖ్య నుండి చంద్రుని వీక్షించు గ్రహనక్షత్రసంఖ్య తీసివేయగా వచ్చిన నక్షత్రమును భాగలుగామార్చును. (డి) చంద్ర స్థిత రాశ్యాధిపతి భాగల నుండి సూర్యోదయవేళ నున్న చంద్రభాగలను తీసివేసి 2 చే హెచ్చించి 360 నుండి లబ్దమును తీసివేయగా వచ్చు భాగలను గుర్తింప వలెను. (ఇ) చంద్ర భాగలనుండి తల్లి జాతక మందలి కుజ భాగలను తీసివేయగా వచ్చిన మొత్తమును 2 చే హెచ్చింపవలెను. పై సాధించిన 5 ఫలములను ఆనాటి సూర్యోదయ రవి భాగలను శిశు జనన ప్రకార ముగా 50 భాగల వంతున పూర్వ ప్రకారముగా కూడిన ... మగు నిరయన లగ్నభాగ నిమిషములు లభించును.

# శ్రీ హరినారాయణ్ ఆప్టే

గత శతాబ్దపు చివరి దశాబ్దాలలో భారత జాతి పొందిన పునర్వికాసానికి, నవజాగృతికీ కేవలం రాజకీయ వేత్తల, సంఘ సేవకుల కృషే కారణం కాదు. నిజానికి బంకిం చంద్రుడు,



రవీంద్రుడు మొదలైన సాహిత్యకారులే ఇందుకు ఎక్కువగా ప్రోది చేశారనడం సమంజసం. అభ్యుదయ భావాలను వ్యాపింప జేసి ప్రజా సామాన్యపు ఆలోచనా రీతులను తీర్చి దిద్దడంలో వీరు వహించిన పాత్ర అమోఘమైనది. ఇట్టి యుగ నిర్మాతలలో మరాఠీ నవలా రచయిత, సాంఘిక సంస్కర్త అయిన హరి నారాయణ ఆప్టే ప్రథమశ్రేణికి చెందిన మహనీయుడు. స్త్రీల హక్కుల కోసం ఎడ తెగని పోరాటం సాగిస్తూ, ఉదారమైన ఆశయాలను ప్రజలలో వ్యాపింపజేసి ఆప్టే తాను ఎన్నుకొన్న రంగంలో సాటిలేని మేటి లనిపించుకొన్నాడు. ఊరూరా మహారాష్ట్ర ప్రజలు ఆమహనీయుని శత జయంత్యుత్సవాలను ఈ మార్చి 8వ తేదీన కృతజ్ఞతా పురస్సరంగా జరుపుకుంటున్నారు.

హరి నారాయణ ఆప్టేకి హరి భావూ ఆప్టే అని మారు పేరు. కవనం, నాటికలు, కథానికలు, నవలలవంటి వివిధ సాహిత్య ప్రక్రియల లోనూ రచన సాగించినా, ఆప్టే ప్రధానంగా నవలా కారుడు. మరాఠీ నవలా సాహిత్యానికి పితామహుడుగా ఆప్టే గణుతికెక్కాడు. చారిత్రిక దృష్ట్యా మొట్ట మొదిటి మరాఠీ నవలను రచించిన వ్యక్తి ఈయనే అనడానికి వీలు లేక పోయినా, మరాఠీ నవలా సాహిత్యానికి దృఢమైన పునాదులు నిర్మించిన ప్రథమ సాహితీ వేత్త ఆప్టేయే అనడానికి అనుమానం లేదు. మరాఠీ నవలకు విశిష్టమైన రూపు రేఖలు తీర్చిదిద్ది, దాని అభివృద్ధికి ఆప్టే మార్గ దర్శకుడు అయినాడు. ఆప్టేకి పూర్వం వెలువడిన నవలలు చాల వరకు ప్రేమాయణాలుగా లేదా అన్యాపదిష్టమైనవిగా ఉండేవి. అట్టి ఊహా లోకాల నుండి నవలను భూమి మీదికి దింపి, సామాజిక లక్ష్య సాధనకు దానినొక ఆయుధంగా ఆప్టే తీర్చి దిద్దారు. ఈ సాహిత్య ప్రక్రియను బహు జనాకర్షకంగా మలచి, తన తరం వారి దృక్పథాన్నీ, నవజీవన విధానాన్నీ తద్వారా మార్చి వేయ గలిగారు. స్త్రీలకు కూడా పురుషులతో సమానమైన హక్కులు ఉండాలని ఆప్టే ప్రాజ్ఞత తెలిసిననాటినుంచే వాదించటం మొదలు పెట్టారు. అట్టి నవ సమాజాన్ని అవతరింపజేయడానికి దీక్షతో సాహిత్య రచన సాగించారు. పఠితను కేవలం వినోదింప చేసే ఉద్దేశ్యంతో ఆప్టే ఒక్క వాక్యం కూడా వ్రాయలేదనడం అతిశయోక్తి కాదు. పఠితకు మానసిక వికాసం కలిగించి ఉదార భావాలతో ఉద్దీపితుణి చేయడమే ఏకైక లక్ష్యంగా నారాయణ ఆప్టే సాహిత్య వ్యాసంగం నడచింది. మహిళలను జాగృత పరచి వారికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కల్పించడం, ఆయన సాంఘిక నవలలకు పరమావధి. మహారాష్ట్రం లోని సమ కాలీన మధ్యమతరగతి కుటుంబాల సమస్యలను తన సాంఘిక నవలల్లో ఇతి వృత్తాలుగా తీసుకునేవారు. ఆప్టేలోని కళాకారుడు ఆప్టేలోని సాంఘిక సంస్కర్తకు ఎప్పుడూ ఒదిగి ఉండేవాడు. ఆప్టే కళా దృష్టి తో మాత్రమే వ్రాసిన నవలలంటూ బహుశా ఏవీ లేవనే చెప్ప వచ్చును. కళ అనేదిఏదీ కేవలం వినోదాత్మకం కాజాలదనీ, ప్రబోధాత్మకమైనప్పుడే కళ కళ అనిపించుకుంటుందనీ ఆయన ఒక సారి స్పష్టం చేశారు. ప్రజల అంతఃకరణను మేలుకొలిపి తద్వారా సమాజాన్ని సంస్క

రించడానికి నవలను ఒక పటిష్ఠమైన సాధనంగా ఆయన ప్రయోగించారు. ఈ కృషిలో ఆప్టే చాలా వరకు కృతకృత్యులు కాగలిగారని కూడా చెప్పవచ్చును. మూఢ విశ్వాసాలనూ, దురాచారాలను ఛిన్నాభిన్నం చేసి ప్రజల దృక్పథాన్ని విస్తృత పరచడానికి ఆప్టే నవలలు అపారంగా తోడ్పడ్డాయి. ఆయన సాహిత్య కృషివల్లనేఉత్తరోత్తరా డి.కె. కార్వే వంటి సంఘ సంస్కర్తల ఉద్యమాలు ఫలించడానికి దేశంలో అనువైన వాతావరణం ఏర్పడింది.

ఆప్టే నవలలు ప్రబోధాత్మకమైనవి కావడం ఈ విధంగా చూస్తే గొప్ప సుగుణమే అయినా మరో విధంగా చూస్తే వాటి బలహీనతకు కూడా ఇదే కారణం అని తోస్తుంది. సమాజంలో ఏ చెడుగులను తాను ప్రతిఘటించ దలచాడో వాటిని ఆప్టే నిర్దాక్షిణ్యంగా చీల్చి చెండాడే వాడు. అస్పష్టతకు గానీ అన్యాపదేశానికి గానీ తన రచనలో ఆయన తావిచ్చేవాడు కాదు. తన సిద్ధాంతాలను ఢంకా మీద దెబ్బకొట్టి ప్రచారం చేయడానికే ఆయన రచనలు సాగించినప్పటికీ సాహిత్య స్థాయినుండి దిగజారకుండా మాత్రం ఆప్టే జాగ్రత్త పడేవాడు. ప్రబోధంతో పాటు కళ కూడా సమపాళంలో మేళవించి ఉంటుంది ఆయన రచనలలో. అయితే ఆప్టే దేశకాలాతీతమైనవిశ్వజనీన సాహిత్యం సృష్టించలేదు. సమకాలీన సమస్యలకు అతీతుడై, ప్రాథమిక మానసోద్వేగాలనూ, వాటి సంఘర్షణనూ వింత రూపంలో చిత్రించడానికి ప్రయత్నించ లేదు. ఆప్టే రచనలకు ''పణ్ లక్షాత్ కోణ్ ఘేతో'' అనేది మణి మకుటం వంటిది. ఒక విధంగా హార్డీ ''టెస్'' కూ దీనికీ చాలా దగ్గర పోలిక ఉంది. దుఃఖావిలమైన పాత్రలను సృష్టించడంలో నేమి, నిశిత పరిశీలనలో నేమి ఈరెండూ ఒక దానికొకటి ఏమాత్రం తీసిపోవు. కానీ టెస్‌లోని సార్వ జనీనత దీనిలో లోపించిందనేది నిజం. ఒక బ్రాహ్మణ బాలిక ''యమున'' ఆత్మ కథ ఇది. పూర్వం కొన్ని అవిభక్త మధ్యమ తరగతి కుటుంబాలలో బాలికలు కేవలం దాసీలుగా చూడ బడడం పరిపాటి. ఆ బాలికల గోడు వినే నాథుడు లేడు. అట్టి బాలికలకు ప్రతీక యమున. ఈ నవలలో పాత్ర చిత్రణ అతి వాస్తవికంగా నిర్వహించ బడింది. ఇది సమకాలీన జీవితానికి ముమ్మూర్తులా ప్రతి బింబం అనడంలో అతిశయోక్తి లేదు. నవలలోని పాత్రలు నడచి వచ్చి రోడ్డు మీద మనకు ఎదురైతే వారిని చూచి ఏమీ ఎవరమూ వింత పడము. అటువంటి వారు ఎందరో మనకు జీవితంలో తారస పడుతూ ఉంటారు.

ఆప్టే పాత్రలలోనూ, సన్నివేశాలలోనూ, గొప్ప వైవిధ్యం కనిపిస్తుంది. దురాచార దుర్గంధ పూరితమైన వాతావరణంలో అప్పుడప్పుడే బయలుదేరిన వేకువను, నవయుగోదయపు ణ కాంతులను ఆప్టే మనోహరంగా చిత్రించారు. రాతిని కూడా కరిగించ గల్గిన మృదు మధురవచోగరిమ యమున పాత్రది. కాని మామ ''శంకర్ మామంజీ'' హృదయం వజ్ర కఠోరమైనది. ఉన్నత నైతిక ప్రమాణాల పేరుతో దయా దాక్షిణ్యాలకు హృదయంలో తావులేకుండా చేసుకున్న ధర్మాంధుడు ఆయన. ఇటీవలనే భర్తను కోల్పోయిన కోడలి దుఃఖాన్ని అర్థం చేసుకోలేని పాషాణుడు. స్త్రీకి సహజమైన హక్కులను ఇవ్వడానికి నిరాకరించడమే కాకుండా ఆమె మానసిక వికాసాన్ని సైతం సహించలేని సంకుచితుడు. యమునకు ముండనం చేసి మూల కూర్చోపెట్టడమే తనకు విహితమైన నైతిక ధర్మమని ఆయన అభిప్రాయం. ఇటీవలి వరకు మన సమాజంలో ఇట్టి ధర్మాంధులకు బర్బరులకు కొరవ ఉండేది కాదు. బాల వితంతువులను వారి భర్తల చితులపై దహనం చేయడం ధర్మమని నమ్మి అట్టి క్రతువులనేకం చేజేతులా చేయించే వారు వీరు. ఇట్టి మూఢ ఛాందసులకు ''శంకర్ మామంజీ'' మరువరాని ప్రతిమూర్తి.

ఆప్టే శైలిలో ముఖ్య లక్షణాలు—ప్రసాద గుణం, ప్రవాహత. ఆప్టే ఏక కాలంలో అనేక నవలలను రచిస్తూ ఉండే వారు. ఆప్టే మరణించే నాటికి సుమారు అర డజను నవలలు ఆయన మొదలు పెట్టినవి అసంపూర్ణంగా ఉండి పోయాయి. సాహిత్యవేత్తలలో వాల్టర్ స్కాట్ ఆయనకు ఆదర్శం. ఆయనవలెనే ఆప్టేకూడా మారు పేరుతో రచనలు చేసేవారు. తన మొదటి నవలకు గొప్ప జనాదరణ లభించినప్పుడు పాఠకులకు రచయిత ఎవరో తెలియక తబ్బిబ్బు పడడం చూసి, ఆప్టే కుడుపుబ్బ నవ్వుకున్నారు. సాహిత్యరంగంలోనే గాక సమకాలీన సమాజ జీవితంలో కూడా ఆయన ప్రముఖ పాత్ర వహించే వారు. స్కాట్ వలెనే ఆప్టేకూడా తన స్వభాషలో చారిత్రిక నవలా సాహిత్యానికి అంకురార్పణ చేశారు. ''వేవర్లే'' నవలలు ఆప్టేను ఉత్తేజపరచాయి. స్కాట్ సరిహద్దు ప్రాంతాల చరిత్రను రచించడానికి పూనుకున్నట్లే, ఆప్టే కూడా మరాఠీ చరిత్రకు తన యథా శక్తిగా సేవ చేశారు. శివాజీ, తానాజీ, హైదరాలీ వంటి చారిత్రిక వీరుల, ప్రాచీన కాలపు వీరుల సాహస గాథలను గానంచేసే చారిత్రిక సంఘటనలను విరివిగా సారస్వత రచనకు వృత్తాలుగా స్వీకరించారు. ఎప్పుడో కాల గర్భంలో కలిసిపోయిన అతి పురాతన ఘట్టాలను కూడా తన సునిశిత దృష్టితో ఆవిష్కరించి, పరిశీలించి కనులకు కట్టునట్లు ఆయన వర్ణించే వారు. విజయనగర సామ్రాజ్యపు అభ్యుదయ, పతనాలను వర్ణించడంలో ఎంతటి కుశలతను, వాస్తవికతను ప్రదర్శించారో చంద్రగుప్తుని ప్రాచీన యుగాన్ని చిత్రించడంలో కూడా ఆప్టే అంతటి ప్రతిభను ప్రదర్శించ గలిగారు.

ఆప్టే నవలలు వర్ణనలతో నిండి ఉంటాయి. ఒక్కొక్క

# శ్రీ హరినారాయణ్ ఆప్టే

ప్పుడు ఇవి కథకు లవసరమే అయినా, తరచుగా వాటి ప్రయోజనం కేవలం అలంకారం మాత్రమే. అవిభక్త కుటుంబాలలో తరచుగా పొడసూపే కలహాలూ, అసూయలూ వర్ణించడంలో ఆయనకు ఆయనే సాటి. పాత్రపోషణలో ఆప్టే అందెవేసిన వాడు. ఒక మనిషిని మాట్లాడే తీరును, లేదా నడిచే పద్ధతినీ రేఖా మాత్రంగా చిత్రించి దానితోనే తన ప్రాత్రకు ఒక ప్రత్యేకతను ఆపాదించగల అద్భుత నైపుణ్యం ఆప్టేకి వెన్నతో పెట్టిన విద్య. ఆయన నవలలో ప్రతి వ్యక్తిదీ ఒక విశిష్టమైన స్వభావం, ఒక ప్రత్యేకమైన స్వరం. ఉద్వేగంగా యమున మాట్లాడే మాటలు నిద్రపోతున్నప్పుడు కూడా మనసులో మెదిలి పాఠకుణ్ణి కలవరింప చేస్తాయి. యమున సౌశీల్య సౌరభం, సాత్త్విక పరివేషం పాఠకుణ్ణి అద్భుత పరుస్తాయి. ఆమె ఇంద్రజాలంతో సమాజం కొత్త రూపు సంతరించుకున్నట్లు భాసిస్తుంది. ఎలాంటి కష్టాలనైనా కిమ్మనకుండా ఓర్చుకోగల్గిన మేరు ధీరురాలు యమున. నవలలోని ఇతర పాత్రలకు కూడా వారి వారి ప్రత్యేకమైన వ్యక్తిత్వాలు ఉన్నప్పటికీ యమున కథకంతటికీ, కొలికి పూసవంటిది. ప్రధాన ప్రాత్రతో ఇతర పాత్రలు చక్కగా కలిసి పోతాయి. నవల పొంకంగా, పుష్టిగా ఎలాంటి విరోధాభాసలూ లేకుండా సాగిపోతుంది. ఆప్టే కథల్లడంలో గొప్ప నేర్పరే అయినా, అడుగడుగునా అవి ఉప కథలతో కూడి సుదీర్ఘమై చదువరికి కొంత శ్రమ కలిగిస్తాయి. అయితే ఆయన కథలు సజీవం. మానవుల కష్టసుఖాల నిశ్వాసాలతో, అవి విసుగనిపించవు. ఇంద్రచాపం వలె శబల వర్ణాలతో మానవ ప్రపంచం నిసర్గ రమణీయంగా భాసిస్తుంది.

చారిత్రిక నవలల్లో కూడా ఆప్టే తన పాత్రలలో ఇలాగే లీనమైపోయి వాటితో అత్యంత ఆత్మీయమైన అనుబంధం ఏర్పాటు చేసుకుంటాడు. "చంద్రగుప్త" అనే నవలలో ఆప్టే ఈ తాదాత్మ్య శక్తి పరాకాష్ఠనందుకొన్నది. మౌర్యుల కాలంలో చాణుక్యుని చుట్టూ రాజకీయాలు ఏ విధంగా క్షణ క్షణ పరిణామాలతో పరిభ్రమిస్తూ వచ్చిందీ ఈ నవలలో చిత్రించబడింది. చారిత్రిక నవలలు వ్రాయడంలో ఏ విధమైన ప్రబోధం గాని, సంఘ సంస్కరణ గాని ఆయన లక్ష్యంగా పెట్టుకోలేదు. "చంద్రగుప్తలో" అద్భుతమైన ఊహా శక్తి ద్యోతకం అవుతుంది. చారిత్రక పరిశోధన ఇంకా అప్పటికి బాగా శైశవ దశలోనే ఉన్నా ఆప్టే గొప్ప "ద్రష్ట" కావడం వల్ల పూర్వకాలం నాటి పరిస్థితులను కూడా ఆప్టే తన మనో నేత్రంతో యథాతథంగా అవలోకించి తను నవలల్లో ప్రతిబింబింప చేయగలిగాడు. ఉత్తరోత్తర జరిగిన చారిత్రిక పరిశోధనల వల్ల, ఆయన ఊహాశక్తి ఎంత బలీయమైనదో బుజువైనది. "చంద్రగుప్త" చదువుతూ ఉన్నంత సేపూ నందరాజుల రాజధాని పాటలీపుత్ర పుర వీధులలో సంచరిస్తూ, రాజులనూ, రాణులనూ పలకరిస్తున్నట్టూ, మంత్రులతో, బౌద్ధ సన్యాసులతో ముచ్చటిస్తునట్టూ, ప్రజలను ఆప్యాయంగా తానై పలుకరిస్తున్నట్టూ పాఠకుడికి అనిపిస్తుంది. ఎడతెగని కుట్రలతో, కుటిల రాజనీతితో నిండిన నాటి సమాజం పాఠకునికి కళ్ళముందు కనిపిస్తుంది. రాజ కుటుంబం చేత పరిత్యక్తుడైన అనాథుడు చంద్రగుప్తుడికి మగధ సామ్రాజ్యాధినేతగా పట్టం కడతానని శపథం పట్టిన చాణుక్యుడు ఆప్టే నవలలో అచ్చంగా ఆ చారిత్రిక మహాపురుషుని వలెనే రూపు తాల్చుతాడు. అద్భుతమైన మేధ, ఎనలేని కార్య శూరత, నయగారపు దుర్వినయంలో ఉట్టిపడుతూ ఈ పాత్ర పాఠకుని అభిమానాన్ని చూరగొంటుంది. చంద్రగుప్తుని వంటి చారిత్రిక వ్యక్తులను స్పందింపజేసిన ప్రేరణలేవో అద్భుతంగా నిదానంచేసి పాఠకునికి వారిని అద్దంలో వలె ఆప్టే పట్టి చూపుతారు. మరాఠాల చరిత్ర ఇతివృత్తంగా రచించిన "ఉషః కాల్"లో ఆప్టే ఇదివరకు వలె కేవలం తన ఊహాశక్తి పైననే ఆధారపడ వలసిన అవసరం లేక పోయింది. "బఖర్"లనే చారిత్రిక పత్రాలు (ఇవి కూడా తరచు కల్పనలతో నిండినవే) "పొవాడా" లనే కథాగేయాలు కొంతవరకు ఈ నవలా రచనలో ఆయనకు తోడ్పడ్డాయి. అదీగాక మరాఠాల చరిత్రకు పరిశోధకులు పూర్తిగా అప్పటికి ఆవిష్కరించలేకపోయినా, దాని స్వరూపం రేఖామాత్రంగానైనా ఆప్టే కాలం నాటికి దృగ్గోచరం అయిందని చెప్పవచ్చును. అయినా తనకు లభించిన స్వల్పమైన చారిత్రిక ఆధారాలతోనే ఒక గొప్ప శకానికి శకాన్నే ఆప్టే పూసగుచ్చినట్లుగా చిత్రించాడు. శివాజీ జనన కాలమందు నుండి దేశ కాల పరిస్థితులను "ఉషఃకాల్" చిత్రిస్తుంది. మరాఠాల శౌర్య ప్రతాపాలను హృద్యంగా ఉత్తేజకరంగా ఈ నవలలో రూపచిత్రణ చేశారు. శివాజీ జీవిత చరిత్రతో నవలలు వ్రాయడము పూర్తి అయిన తరువాత "మైసూర్ చావాగ్" అనే పేరుతో హైదరాలీని గురించి అద్భుతమైన నవల సృష్టించారు. తరువాత "వజ్రాఘాత్"లో విజయనగర సామ్రాజ్యపతనాన్ని వర్ణించారు. సొరంగాలు, గారడీలు అద్భుత సాహస కృత్యాలతో నిండిన ఈ నవలలు పాఠకుడికి మోతాదు మించి ఉన్నట్లు కనిపించవచ్చును. ఆప్టే చివరి దశలో వ్రాసిన నవలలు మరీ కాల్పనికంగా ఉండి, పాఠకునికి అస్తి నాస్తి విచికిత్సను కల్గిస్తాయి. "చంద్రగుప్త" లో కనుపించిన మంత్రశక్తి తరువాతి నవలలో సన్నగిలిపోయింది. "గడ్ ఆలా పర్ సింహ్ గేలా" (కోట చేజిక్కింది. కాని, వీరుడు మరణించాడు.) అనే మరో నవల పేర్కొనదగింది. ఆప్టే వ్రాసిన నవలల్లో కల్లా ఇది చిన్నది. చిక్కని కూర్పుతో, చక్కని సన్నివేశాలతో ఈ నవల ఉత్కంఠను రేకెత్తిస్తూ చివరిదాకా ఏక బిగిని చదివించే

స్తుంది. దీర్ఘ వర్ణనలతో, ఉప కథలతో పాఠకుని దృష్టిని మళ్లించకుండా కథా నిర్మాణ శిల్పానికి ప్రమాణం అనదగినట్లు ఈ నవల వ్రాయబడింది. ఉదయభాన్ అనే దుష్టుడు ఇద్దరు రాజపుత్ర కన్యలను చేరపట్టడం ఇందులో ఒక ఉప కథగా చేర్చబడినప్పటికీ, తానాజీమాలుసరే, కొంకణను జయించడం అనే ప్రధాన కథతో ఇది చక్కగా మేళవించబడింది. ఒక గొప్ప సాహసగాథ, రమణీయమైన ప్రేమ కథ జమిలిగా పెనవేసుకునిపోయిన అద్భుత నవల యిది. శరవేగంతో దూసుకుపోయే శైలి, ఉద్వేగంతో కదిలిపోయే కథ. పాఠకుడికి చివరిదాకా గుండె గొంతుకలో కొట్లాడుతూ ఉంటుంది. తీక్ష్ణమైన ప్రతిభతో నిండిన ఈ నవలిక ఆప్టే వ్రాసిన దీర్ఘమయిన యితర నవలలను త్రోసిరాజంటుంది.

ఆప్టే నవలలు సాహిత్య ప్రపంచంలో అజరామరంగా నిలిచిపోతాయని ఆయన తరంవారే అనేకమంది గ్రహించగలిగారు. ఒకసారి ఎన్నికలలో ఓడిపోయిన సందర్భాన్ని పురస్కరించుకొని ఆయనను గోఖలే సోదరుస్తూ, శాసనసభలోనూ, సలహా మండలులలోనూ తమవంటి రాజకీయవేత్తలు చేసే కృషి ఆప్టే చేస్తున్న కృషి ముందు కొరగానిదనీ, లోకం తమను మరచిపోయినా నవలా రచయిత ఆప్టేను ఎన్నటికీ మరువదనీ అన్నారు. ఆప్టే కృతులలో ఇతివృత్తం కేవలం చారిత్రకమే అయినా సమకాలీన సమస్యలే అయినా, వాటికి అతీతమైన ఏదో అనశ్వర శక్తి వాటిలో పుంజీభవించినట్లుంటుంది. కారణం, ఆయన పాత్రలను కదిలించే ప్రేరణలు గంగానదివలె మానవ జీవితంలో అనాది నుంచీ ప్రవహిస్తున్నవే. భారతదేశంలోని ఇతర ప్రాంతాల ప్రజలు కూడా ఆప్టేను గురించీ, ఆయన రచనలను గురించీ తెలుసుకోవడం అవసరం. ఆప్టే రచనలు పూర్వ మహా కావ్యాలవలె ప్రామాణికమైనవి. వాటి వలెనే ఇవి కూడా ఇప్పుడు గ్రంథాలయాల భూషణాలుగా మాత్రమే మిగిలిపోయాయి. వీటిని చదివే పాఠకులు చాలా నక్షత్తుగానే కనుపిస్తారు. ఆధునిక పాఠకులకు ఆయన నవలలు అది అంతంలేని పద్మవ్యూహాలుగా తోచడంలో ఆశ్చర్యంలేదు శాఖోపశాఖలుగా విస్తరించే అలాంటి నవలలను చదివే ఓపిక గానీ, తీరిక గానీ నేటి పాఠకులకు లేవు. కాని, తీరిక చేసుకుని, ఓపిక తెచ్చుకొని చదువగలిగితే ఆప్టే నవలలు అమూల్యమైన పెన్నిధులు. ఆప్టే నవలలలో కళ్లు మిరిమిట్లు గొలిపే తళుకు బెళుకులు గాని, చెణుకులు గాని కనుపించవు రచయిత అపారమైన మేధాసంపదకు చెక్కు చెదరని స్మారక చిహ్నాలు అవి. ఒక పురాతన యుగపు చిత్ జ్యోతికి కట్టిన సాహిత్య చైత్యాలు అవి.

(మహారాష్ట్ర ప్రభుత్వ సమాచార కేంద్ర ప్రచురణ.)



# కవిత్వము - ఛందము
# ఒక పరిశీలన

శ్రీ వి. రాజగోపాలరావు

ఫిబ్రవరి నెల భారతిలో మిత్రులు శ్రీ రాఘవాచార్య గారి 'కవిత్వము—ఛందము' అను వ్యాసమును పరిశీలించిన తర్వాత ఆ విషయమును గూర్చి మరికొంత వ్రాయ కోర్కె కల్గినది. కవిత్వ ఛందముల సంబంధమును, కవిత్వమునకు ఛందోలంకారముల ఆవశ్యకతనుగూర్చి వారు చర్చించిరి. 'కవిత్వమునకు ఛందస్సుతో, అలంకారలతో, శ్లేషతో, ప్రాసతో, సమాసంతో పనిలేదు' అనిన శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారి పలుకులను పూర్వ పక్షము చేయుటకై ఆచార్యగారు చాలవరకు ప్రయత్నించిరి. ఆ వ్యాసములోని కొన్ని దృక్పథములను పరికించుటయె ప్రస్తుత వ్యాస లక్ష్యము.

రసాత్మకమగు భావము కవిత్వము. ఈ యభిప్రాయము ఎవ్వరైనను యొప్పుకొనదగినది. తద్భావమును వ్యక్తీకరించునది భాష. కవి మనోఫలకమున నర్తించు దృశ్యమునకు భాషయొక రూపము నొసగును. పాఠకులు దానిని చదివినప్పుడా దృశ్యము మరల వారి మనో నయనముల యెదుట సాక్షాత్కరించి యానంద మొనగూర్చును. కావున కవిత్వమునకు భావము ప్రాణము, భాష శరీరము. కాని భాషలో పొదగబడిన భావమును గ్రహించి యనుభవించుట కందరు పాఠకులు సమర్థులు కారు. తద్రసగ్రహణపారీణులే తగినవారు. అందుకే అల్లసానివారు 'ఊహ తెలియంగల లేక పాఠకోత్తముల్ దొరికినగాక యూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే' అనిరి. కావున కవి తన మనోగత భావములను వ్యక్తీకరించుటకు భాష తప్పనిసరి, కాని, భాషలో పొదగబడిన భావ మందరికిని, లేక అందరికిని యొకే విధముగను భావ సంచలనము కల్గించు ననుకొనుట సరికాదు. కవికి కవితా గ్రథన మెంత యావశ్యకమో పాఠకునికి కవితా మథనమును అంత యావశ్యకమే. అందుచే భావము భాష పరస్పర ప్రతికూలములు కావనవచ్చును. అవి యన్యోన్యాశ్రయము లనుటలో పాఠకుని 'ఊహ తెలియంగల స్వభావము' ను మాత్రము మరచిపోరాదు.

రసాత్మకమైన భావ మేదియైనను కవిత్వమే. అది ఛందోబద్ధమే కావలయునని లేదు. వచన రచనలోనైన యట్టి లక్షణమున్న దానిని కవిత్వ మనవలయును. కాని 'ఉద్విగ్న మానసుడగు కవి వ్యక్తీకరించు భావావేశము ఛందోబద్ధమైన భాషలో వెలువడుననియు అట్టిదే కవిత్వ మనబడుననియు విదితము' అని ఆచార్య గారనిరి. ఛందశ్శాస్త్రజ్ఞుల మతము ప్రకారము వృత్తముల సంఖ్యయే 13 కోట్ల 42 లక్షల 17 వేలను దాటును. ఇక ఇతరములగు జాతులన్నియు గలసి యసంఖ్యాకములగునను యుద్దేశముతో వారటులని యుండి రేని దానిని గూర్చి వ్రాయబని లేదు. అట్టియెడ మానవుడొనరించు ప్రతి రచనయు నేదియో నొక ఛందమునకు సన్నిహితమే యని సరిపెట్టవచ్చును. అట్టిచో రసాత్మకమైన భావముగల వచనము సైతము కవిత్వమగును గదా! కవి విశిష్ట ప్రయోజన మగు రసానందమును పొందించు శక్తి ఛందోరచన యందున్నది. కాని వచన రచన యందు లేదని ఆచార్య గారు విలక్షణమైన యభిప్రాయమును వెలిబుచ్చిరి. అందుచే వారి యూహ ప్రాచీన కాలమునుండియు కవులు గతానుగతికముగా నవలంభించు ఛందో నియమములనియే వ్యక్తముగుచున్నది. వారు దహరించిన నన్నయ వసంత ఋతువర్ణన లయగ్రాహిలో గాకుండా మరొక ఛందములోనో నుండి యుండిన రసగ్రహణమున కంతరాయము కల్గియుండునా యను విషయమును యోచింపవలయును. ఇప్పట్టున ఎర్రా ప్రెగ్గడ రచన నొకింత పరికింతము.

కమనీయ కమలినీ కల్లోల వీథుల
గదలు రాయంచల గతుల యొప్పు,
బహు పుష్ప పల్లవ ప్రకర చిత్రితములై
తనరారు తరులతా తరుల సొంపు,
మకరంద రస పాన మద విలోలంబులై
క్రాలెడి యెల దేటి గముల యులివు
పరి పక్వ మంజుల ఫల రసోద్ధతములై
పలుకురా చిలుకల పటురవంబు.........
(భారతము. అర. 7వ పద్యము)

పరిశీలనకై వారుదహరించిన లయగ్రాహిని సైతమిట నుద హరించెదను.

కమ్మని లతాంతముల కుమ్మొనసి వచ్చు మధు
పమ్ముల సుగీతనిన దమ్ము లెసగెం, జూ
తమ్ముల లసత్కిసల యమ్ముల సుగంధి ముకు
ళమ్ములను నానుచు ముదమ్మొనర వాచా
లమ్ములగు కోకిల కులమ్ముల రవమ్ము మధు
రమ్మగుచు విన్పెసనిశమ్ము సుమనోభా
రమ్ముల నశోక నికరమ్ములును జంపక చ
యమ్ములును గింశుక వనమ్ములును నొప్పెన్.

ఎర్రా ప్రెగ్గడ శబ్ద చిత్రమునకును, నన్నయ శబ్ద చిత్రమునకును భేదమున్నది. ఇరువురొనరించినది వసంత ఋతువర్ణనమే యైనను, శబ్ద చిత్రముల యందలి భేదముల వలన పాఠకుల మనోనయనముల యెదట గోచరించు వసంత కాల దృశ్యము వేరు వేరుగనే కన్పట్టును. ఒక దానియందు మకరందరసపాన మదవిలోలంబులై క్రాలెడి యెలదేటి గముల యులివు— వేరొక దానియందు కమ్మని లతాంతములకుమ్మొనసి వచ్చు మధు పమ్ముల సుగీతనినదమ్ము— విన్పించును.

కవిత్వము రసాత్మకమైనది, కనుక సరసభావము ఏ రూప మున నున్నను రసికుని భావోద్విగ్నమానసునొనరించియే తీరును. ఒకే కవి గాని, అనేక మంది కవులు గాని ఒకే భావముననేక రూప ములలో, అనేక శబ్దముల మూలమున వెలిబుచ్చ వచ్చును. వానికి రసానందమును కల్గించు శక్తియున్న, వానిని కవిత్వ మనుట కభ్యంతరమేమి? కావున వచన రచన కట్టి శక్తి లేదనుట ఆమోద యోగ్యము గాదు. పానుగంటి వారి మాటలు, "పద్య మున గవిత్వముండి వచనమున లేకుండునా? ఎచ్చట రసముండునో అచ్చటనే కవిత్వమున్నది. కవిత్వము గుణములోనున్నది. గాని గణములో నున్నదా? అభిప్రాయ ప్రకటనమే కావలసినది" గ్రహణీయములు. రవీంద్రుని గీతాంజలి అనిబద్ధ కవిత్వ మయ్యు, సకల పండిత శ్రేష్ఠుల ప్రసంశా పాత్రము కాలేదా? నిర్వచనమనియు, నిరోష్ఠ్యమనియు, అచ్చ తెలుగనియు, కవిత్వము చెప్పుటలో తమ కౌశలమును చూపించుటకే వ్రాసిన ప్రచండ ఛందోబద్ధ గ్రంథములెందరి డెందములకు రసానంద సంధాయ కములగు చున్నవి? పాండిత్య గరిమను, పద్య రచనా నైపుణ్యమును వెల్లడించుటకై కవులుచెప్పిన ఆశుకవిత్వములు, చాటుకవిత్వములు, చిత్ర కవిత్వములు మొదలగు వానిలో రసానందమును కలిగించు శక్తి అన్నిటికున్నదా? కావున కవిత్వము గుణము నందే గలదు. కవిత్వ నియమములను గూర్చిన చర్చ ప్రయోజన కరము గాదు కూడ.

'దుర్యోధనుం డట్లు సభా ప్రలంభంబునకు లజ్జితుండయి పాండవుల వీడ్కొని గజపురంబున కరిగి ధర్మ రాజు రాజసూయంబు దనకసూయ జనకంబగుటయు సకల జన మనోనయనోత్సవంబున తత్సభా లక్ష్మి తన మనో నయనంబుల కగ్ని జ్వాలయుంబోలె మహా దాహంబు సేయుటయు, సంతప్తుండై నిదాఘ దాహంబున నింకి తరుగు నల్ప జలాశయంబు నుంబోలె దద్దయు తరిగి' అనిన నన్నయ వచ నములో కవిత్వము లేదంటారా? 'ప్రళయ సమయ పర్జన్య గర్జాను కారియైన సంజీవకము భీషణ ఘోష విని' 'లోకులు భక్తిం దెచ్చి యెదురనిడిన విత్తంబుల ననాదర సూచక మందహాస హాస రోచి రుదంచిత సుందర వదనుండగుచు గాంచి' ఇత్యాది రమణీయ శబ్ద చిత్రములతో నొప్పారు చిన్నయసూరి నీతి చంద్రిక వచన రచనయే కదా? ఇక పానుగంటి వారి సాక్షి వ్యాసముల సంగతి యేమి? భావ కవి మాత్రమే కాదు నేనహం భావ కవిని యని పరిచయం చేసుకొనిన శ్రీ పఠాభి గారి ఫిడేల్ రాగాల డజన్‌లో "క్రాస్వర్డ్ పజిల్స్ లాగున్న నీ కన్నులను సాల్వు చేసే మహా భాగ్యం ఏ మానవునిదో గదా! ఓ బోగం చానా! నీవు సంఘానికి వేస్ట్ పేపరు బాస్కట్టువా?" అను వాక్యములలో నెంతయో భావోద్వేగము అలౌకికమగు ఆవేదన ద్యోతకమగుట లేదా? కావున వచన రచనతో రసానందమును కల్గించు శక్తి కవికి చాలదనుట సరికాదు.

ఈ సందర్భమున హిందీ కవుల యభిప్రాయము నొకింత పరికింతము:—

అంతఃకరణ్ కే వృత్తియోంకె చిత్ర్ కానామ్, కవితాహై, చాహే వహ్ పద్యాత్మక్ హో, చాహే గద్యాత్మక్.

రసజ్ఞ రంజన్. పుట. 62 ఆచార్య మహావీర ప్రసాద ద్వివేది—

"అంతఃకరణముయొక్క భావముల చిత్రణమే కవి త్వము. అది పద్యాత్మకము కావచ్చును. లేక గద్యాత్మకము కావచ్చును."

రూప మేదైనను కవిత్వము పాఠకులపై తన ప్రభావమును ప్రసరింపజేయవలెను. కవికి కల్గిన భవ్యావేశముచే నేర్పడిన శబ్ద స్వరూప మెదుటివారి యందు సైత మట్టి హృదయాంతర్గత భావములను జాగృత మొనర్ప వలయును. అట్టి రస పరిపక్వతయే కవిత. ఈ గుణము లేనపుడు పద్యమైనను, గద్య మైనను కవిత్వము కాదు. ఈ గుణము కల్గియున్నపుడు వచనము సైతము కవిత్వమే యగును.

పాశ్చాత్యులు కవిత్వమునకు విశాలమగు నిర్వచనం యిచ్చియుండిరి.

"2 In the Sense in which poetry is best understood, all literature is poetry or at any rate poetical in Quality" A. Benett.

"గద్యం కవీనాం నికషంవదన్తి" అని ప్రాచ్యులును "3 Verse is apparalled only being but an Ornament and no cause to poetry, since there have been many poets that have never versified." అని పాశ్చాత్యులు నన్నపుడు కవిత్వ మనగా కేవల ఛందోబద్ధమైన రచనయే కాదని యరయ గల్గుదుము."

సాహిత్య సమీక్ష. పుట. 6
పిల్లలమర్రి వేంకట హనుమంతరావు.

పై యభిప్రాయములను గమనించిన, "కవి పొందిన భావావేశమును పాఠకునియందు కల్గించుటకు ఛందము తోడ్పడును. ఇదే కవియొక్క ప్రకాశక సామర్థ్యమును తెలియజేయును. ఛందము సహాయము లేకుండ కవి భావావేశమును పాఠకునియందు కలుగజేసి ఆనందింపజేయలేడు" అను ఆచార్యగారి యభిప్రాయముతో నేకీభవించుట-కష్టమే.

ఇక లయ సంగతి. లయ యనునది ఒక ఛందోబద్ధ మగు పద్యములలోననే కాదు, వచన రచనలో సైతము ఉండవచ్చును. 4Rhythem=Metrical effect produced in verse, prose, music or motion by the relations in Quality, strees, time or energy between the syllables, words, notes or movements that succeed each other—oxford Dictionary. అయిన పద్యములోని, లయకు గద్యములోని లయకు భేద మిది.

'In prose each phrase creates for itslef the law of its rhythm, whilst in verse eaeh phrase creates for itself a personal reason for submitting to a law which already existed'.

M Albert thibaudet.

(గద్యములో ప్రతి సమాసమును తనకు తానుగ, తన లయకు సంబంధించిన నియమమును సృజించికొనును. ఇక పద్యమున ప్రతి సమాసమును, అంతకు మునుపే ఏర్పడి యుండిన నియమమునకు లోబడి యుండుటకై తనకు తానుగ నొక యాత్మగత కారణమును సృజించికొనును.)

ఇక అలంకారముల సంగతి. అలంకారముల నడుమ చిక్కి, భావము యొక్క గొంతుక బిగిసికొనిపోయి, భాష ఆ భారముతో క్రుంగి, నడక కుంటుబడునటు లుండినచో నట్టి యలంకారముల ప్రయోజనము లేదు. భావమునకు శక్తి నొసగి, శోభను కల్గించునట్టివి యైన, వానిని వాంఛింప వలసినదే. కాని, అవి ఇనుపసంకెళ్లగునో, బంగారునగ లగునో, స్వేచ్ఛా ప్రతిబంధకము లగునో, కావో గమనింపవలయును. ఆ బాధ్యత ఋషితుల్యుడైన కవిది. అందుకే 'నా నృషిః కురుతే కావ్యమ్' అను మహావాక్యము. ఋషులు మంత్రద్రష్టలు. అట్టి వారలు రసభావానుగుణముగ రచన మొనర్తురు. అది కేవల మప్రయత్న సిద్ధమయినట్లుండును.

'సర్వ ఉద్రిక్త భావములు భవ్యావేశములు లయాన్వితమగు ఛందోబద్ధమైన భాషలో వెలువడుట సహజమని' వచియించి ఆచార్యగారు అట్టి కవిత్వము రాకుండుటకు పరిశీ

---

2. కవిత్వ మనునది బాగుగ నవగాహనము చేసికొనబడిన యెడల వాఙ్మయ మంతయును కవిత్వమే, లేక కవిత్వ లక్షణ మును కల్గియుండును.

3. పద్యరూప మనునది యొక యలంకారము మాత్రమే. కాని కవిత్వమునకు హేతువు కాదు. ఏలనన యెన్నడును పద్యరూపమున కవిత జెప్పనట్టి కవులు పెక్కుర్రు కలరు.

4 పద్యమున, గద్యమున, సంగీతమున లేక చలన మున—లక్షణము, నొక్కి పలుకుట, కాలము లేక శక్తుల సంబంధము వలన నొకదాని నొకటి వెంబడించు అక్షర సమూహము, పదములు, స్వరములు లేక కదలికల వలన నుత్పన్నమగు నొక కొలత.

లింపవలసిన కారణము లనేకము పేర్కొనిరి. కవులందరు దేశ కాల పాత్రమగు నియమములతో కవిత చెప్పినవారే. ఎవరో కొలదిమంది మాత్రము ప్రత్యేకత గల్గియుండిన కల్గి యుండవచ్చును. ప్రబంధయుగమున అల్లసాని పెద్దన మొదలు అసలు చెల్లుబడిలేని కవి వరకూ ప్రబంధ మున వీలుండినను, లేకపోయినను వీలు కల్పించుకొని, అష్టాదశ వర్ణనల చొప్పించి, చాంద్రాళ్ళవంటి సమాసముల గుప్పించి వదలినవారే కదా ! స్వప్న వృత్తాంతము, ఇష్టదేవతాస్తుతి, షష్ఠ్యంతములు రచియించుట నాటి పరిపాటి. మరి నేడో ! కావున కవిత్వము దేశ కాల పాత్రమగు నియమముల ననుస రించును.

'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' అని శ్రీ కృష్ణభగవాను డనినట్లు, రసానందమును కల్గించుటకు కవిత్వము సైతము యుగ యుగమున మారు రూపు లెత్త వలసి యున్నది. ఎత్తుచున్నది కూడ. భగవంతునికే మారుట తప్పలేదు, తప్పలేదని ఆయన గ్రహించెను కూడ. ఇక కవిత్వ రూపము నంతియే. కాని కవిత్వముయొక్క స్వభావ నిర్వ చన లక్ష్యములు నాడును, నేడును మరియు రేపును ఒకటే— రసాత్మకమగు భావమును కల్గియుండుట, రసానందమును కల్గించుట. రసానంద మనిన యుదాత్త యుత్కృష్ట రసా నందమని పునరుక్తి పనిలేదు. అట్టి రసానందమయ చిత్తు లగు పాఠకులును యుదాత్తముగను, యుత్కృష్టముగను ప్రవర్తించెద రనుటలో విప్రతిపత్తి లేదు. అట్టి ప్రవర్తనయే జగత్తున ధర్మసంస్థాపనకు దోహద మొసంగును. అట్లు కవిత్వ మది తన పని గాకపోయినను, పరోక్షముగ నైన భగవత్కార్యమును సాధించుచున్నదన్నమాట. ప్రజాకవి యన దగిన వేమన్న ఈ దినములలో నుండి యుండి, ఆటవెలది కన్నను, అచ్చపు వచన రచనయే ప్రయోజనమును సాధించు టకు శక్తివంతమైనదని ఆతని హృదయం స్పందించి యుండిన, ఆయన నీతులు వచన రూపముననే వెలువడి యుండెడివేమో !

సాహిత్యరంగమున ప్రయోజనాత్మకమైన నవ్యతను, ఆనందదాయకమైన నవ్యతను కోరవలసినదే. అయిన నవ్యత యెటుల లభించును ? (Trail and error) ద్వారా. మానవజాతి సృష్ట్యాది నుండియు పురోగమించిన బాట కూడ అదియే. అన్ని రంగములలో ప్రయోగములు జరిగి నట్లు సాహిత్యరంగములోనను, ప్రయోగములు జరుగవలసినదే. కాని, వాని లక్ష్యము నవ్యతను, ప్రగతిని సాధించుటయే యను సత్యమును జ్ఞప్తియందుంచికొని, సాలోచనా పథము లో సక్రమముగ సాగిపోయినపుడే సత్ఫలితము సాధ్యమగును. అటుగాక ఏ విలువలను ఆదర్శముగ గ్రహించక, ఇచ్చ వచ్చిన గతి విశృంఖలముగ వర్తించిన నవ్యతకు మారు అపనవ్యత ప్రగ తికి బదులు ప్రబల కల్లోలము ప్రాప్తమగును. ప్రయోగ మొనర్చుటకు అర్హత తమకు గలదా లేదా యని ఆత్మ విమ ర్శన చేసికొనక, ప్రయోగము లొనర్చుట, కవిత్వ మనగ నేమియో మరచి, తాము వ్రాసిన దంతయు కవిత్వ మను కొనుచు, అవ్విధమున సమర్థించుకొనుచు, తంటాలుపడుట నేడు మనము చూచుచుంటిమి కదా !

క్రొత్త పద్ధతుల నన్వేషించుటయందు, మొదట ప్రాత వానిని బాగుగ నవలోకన మొనర్చి, ఆకళించుకొని వానిలో లోపములున్న, వానిని గుర్తించి సరిదిద్దగలిగిన సరిదిద్ది, లేక పోయిన నూతన మార్గముల నన్వేషింప వలయునే గాని, ప్రాతది ప్రాత యని, దానియందు చేవ లేదని వదలుటయు, క్రొత్తది యేది యైనను మంచిదియే నని గ్రహించుటయు, అభి వృద్ధికి దోహదము కానేరదు. ఏ విషయమున నైనను ప్రాత క్రొత్తల మేలు కలయికలోననే కలదు యింపగు పరిమళముల విశిష్టత.

కావున, రసాత్మకమైన భావము కవిత్వము. అది పద్యరూప మున నైనను, గద్యరూపమున నైనను యుండవచ్చును. భవ్యా వేశము గల భావము, ఔచిత్యము గల భాష, రసానందమును కల్గించు శక్తి గల శబ్ద స్వరూపమును దేనినైనను కవిత్వ మనవచ్చును.

కవిత్వము చెప్పుటకు గద్యమైనను అనుకూలమగు విధానమే. కాని, కవిత్వ లక్షణమున్న గద్యమునే కవిత యనవలెను. వ్రాసిన వచన మంతయు కవిత్వము కానేరదు. ఈ యభిప్రాయము పద్యరచనకు సైతము వర్తించును. లయ యనునది పద్యముననే కాదు. గద్యమున కూడ నుండు టకు వీలున్నది.

కవిత్వమన నేమియో బాగుగ గ్రహించినపుడు కవిత్వ నియమములను గూర్చిన చర్చ మిక్కిలి ప్రయోజనకరమని గోచరింపదు.

సహృదయుల నీ క్రింది వాక్యములను పరిశీలింపుడని కోరుట సమంజసమని తలచెదను.

5 "Many of our Modern works take shape in our wits, not in our souls. They have technical skills, Intellectual power, but do not have that Inspiration, that rare Adequacy of mind which is essential for great art."

Dr. S. Radhakrishnan.

---

5. మన ఆధునిక రచన లనేకములు మన ఆత్మ లందు గాక మన బుద్ధి విశేషములయం దాకృతి గాంచు చున్నవి. అవి సాంకేతిక చాతుర్యములను, బుద్ధికుశలతను కల్గియున్నవే కాని ఉదాత్తమగు కళ కవశ్యమగునా భవ్యా వేశము, ఆ యపూర్వమగు మేధా పరిపూర్ణతను కల్గియుండ కున్నవి.

# 'గెల్చిన' జోదా? 'కాల్చిన' జోదా?

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

ఈ క్రింది పద్యము శృంగారనైషధములోనిది—

"కనకక్షోణిధరంబు కార్ముకముగాఁ గద్రూతనూజుండుశిం
జినిగా మాధవుఁ డమ్ముగాఁ బురము లక్షిణ్యైకదోశ్శక్తి గె
ల్చిన జో దీశ్వరుఁ డిచ్చుఁగాత జయలక్ష్మీసుస్థిరైశ్వర్య శో
భనముల్ పెద్దయ సింగ మంత్రికి." (1—2)

ఇది పూర్వ ముద్రణపాఠము. 1913 లో, శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు పరిష్కరించి, వ్యాఖ్యానించి ముద్రించిన ప్రతిలో "కాల్చిన జోదు" అని పాఠము. ఆ పాఠము వేదంవారి సొంతము. 'గెల్చిన' అను పూ. ము. పాఠము తప్పని, 'కాల్చిన' అని వారు సవరించినారు. ఈవిషయమును వారే గ్రంథాంతమున తెల్పియున్నారు.

1963 నవంబరు భారతిలో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు, వేదంవారి ప్రతిలోని పాఠములను గూర్చి చర్చించుచు, 'గెల్చిన' అను పాఠమే సరియైనదనియు, దానిని 'కాల్చిన' అని సవరించుట పొరపాటనియు తెలిపి, అందు కీ క్రింది యుపపత్తులను చూపినారు.

(1) పూర్వ ముద్రణములోనే కాక, వ్రాత ప్రతులలోను, కూచిమంచి తిమ్మకవి స. సా. సంగ్రహములోను గూడా— పద్యము, 'గెల్చిన' అను పాఠముతోనే యున్నది. బహు ప్రతులలో నున్నది గావున, ఆ పాఠమసాధువు కాదన్నారు.

(2) ఈశ్వరుఁడు త్రిపురములను కాల్చిన మాట వాస్తవమే యైనను, పద్యార్థము ననుసరించి 'గెల్చిన జోదు' అనుట యుచితముగాని, 'కాల్చిన జోదు' అనుట ప్రకరణోచితము కాదన్నారు.

(3) దోశ్శక్తి, గెల్చుట కవసరముగాని, కాల్చుట కవసరము కాదు. కనుక—'అక్షీణ దోశ్శక్తితో కాల్చిన జో' దనుటలో ఔచిత్యము లేదన్నారు.

(4) కవులు పలువురు—శ్రీనాథునకు పూర్వులు, నవ్యులు కూడా ఈశ్వరుఁడు త్రిపురములను గెల్చినట్లు రచనలు చేసియున్నారని తెలిపి, అట్టి రచనలు కొన్ని యెత్తి చూపించి, "పురము లక్షిణ్యైకదోశ్శక్తి గెల్చిన జో దీశ్వరు" డనుటలో విప్రతిపత్తి లేదని స్పష్టపరిచి, 'కాల్చినజో' దనుట యనుచితమని సిద్ధాంతము చేసినారు.

వా రన్ని యుపపత్తులతో, అంత వివరముగా తెలిపినను, అసలు విషయ మవగతము చేసికొనక,—నిడుదవోలు వారి తీర్పు తప్పనియు, వేదంవారి సవరణయే ఒప్పనియు— శ్రీ మంగిపూడి కృష్ణమూర్తిగారు—1964 ఫిబ్రవరి భారతిలో—ఒక వ్యాసము ప్రచురించినారు. అది భాషా సంప్రదాయాభిజ్ఞులు పాటింపదగినదిగా లేదు. 'వేదంవారు గొప్ప పండితులు గదా! వారు చేసిన సవరణకు తిరు గుండునా' అన్న నమ్మకముతో మంగిపూడివా రా యాక్షేప వ్యాసమును వెలువరించిన ట్లున్నది. భాషా పరిశోధనలో అట్టి నమ్మకము లపై నాధారపడి యధిక్షేపములకు దిగుట మంచి పద్ధతి కాదు. వేదంవారు పూర్వ పాఠము తప్పనుటకును, దానిని సవరించుటకును గల కారణ మేమో, ఆ సవరణ ఒప్పదగియున్నదో—లేదో మంగిపూడివారు విచారింపలేదు. విచారించియున్నచో ఆ వ్యాసమును రచించియే యుండరు.

(1) వేదంవా రావిధముగా పాఠమును మార్చుటకు కారణ మేమనగా : హరుఁడు పురములను కాల్చినాఁడు గాని, గెల్వలేదని వారి యభిప్రాయము. అందువలన 'గెల్చిన' అనుట తప్పను కొని, 'కాల్చిన' అని సవరించినారు. కాని, వారి యభిప్రాయము సరియైనది కాదు.

హరుఁడు పురములను కాల్చిన మాట నిజమే కాని, ఆ 'కాల్పు' ను కవులు సందర్భము ననుసరించి, 'గెల్పు' గా కీర్తించియు నున్నారు. కాళిదాసు మేఘసందేశములో,—"త్రిపుర విజయో గీయతే కిన్నరీభిః" అన్నాడు. (1—60)

ఆ వేదంవారే (1902—లో) "కిన్నరీభిః = కిన్నరాంగ నల చేత, త్రిపుర = మూఁడు పురముల మొత్తముయొక్క, విజయః = గెలుపు, గీయతే = పాడుబడుచున్నది." అని టీక వ్రాసియున్నారు. (వా రా విషయమును విస్మరించియుందురు).

ఈశ్వరుఁడు త్రిపురములను గెల్చినట్లు చెప్పు సంప్ర దాయము కలదనియు, 'గెల్చిన' అను పూ. ము. పాఠము తప్పు కాదనియు వేదంవారి వ్రాతను బట్టియే తేలినది గదా ! మఱి వారు పూర్వ పాఠమును తప్పనుటయును క్రొత్త పాఠమును కల్పించి శ్రీనాథుని పద్యమున చొప్పించుటయును ఒ ప్పెట్ల గును ?

ఇంకొకమాట—త్రిపురములను—పురములుగానే గ్రహించి నప్పుడు, (వాటిని) కాల్చినట్లును, పురరూప రాక్షసులుగా గ్రహించినప్పుడు, (వారిని) గెల్చినట్లును చెప్పుట యుచి తము. మహాకవుల రచన లట్లే కనుబడుచున్నవి.

ప్రకృత పద్యమున 'పురములను గెల్చిన జో' దనగా, 'పురరూప రాక్షసులను గెల్చిన జో' దని యర్థము. కనుక 'కాల్చిన జో' దనుట సరిపడదు. వేదంవారి పాఠమంగీకార్యము కాదు.

(2) 'జోదు' అనఁగా యోధుఁడు, యుద్ధవీరుఁడు. బలవంతు నెదిరి గెల్చిన వానిని 'జో' దనుట కలదు గాని, పురములను కాల్చినను, పూరికొంపలను కాల్చినను వానిని 'జో' దనుట లోకమున లేదు. కనుక 'కాల్చిన జోదు' అనునది వ్యవహార విరుద్ధమైన భాష. అట్టి భాషను మహాకవి శ్రీనాథుఁ డుపయోగించినట్లు చెప్పుట యొప్పదు.

(3) వేదం పండితులు పద్య భావమును సరిగా మన సుకు తెచ్చుకొని యున్నచో 'కాల్చిన జోదు' అను పాఠమును పద్యమున చేర్చి యుండరు. అది ఆశీర్వచన పద్యము. 'లోక కంటకులును, ఇతరాజయ్య పరాక్రములును నైన త్రిపురా సురులను జయించిన మహాజేత—ఈశ్వరుఁడు—కృతిభర్తకు జయము నను గ్రహించుగాత' అని ఆశీస్సు.

"జేత యైనవాఁడు జయము నిచ్చుగాక" అనుటలో ఔచిత్య మున్నది గాని, 'పురములను కాల్చినవాఁడు జయము నిచ్చుఁగాక' అనుటలో ఔచిత్యము లేదు. ఔచిత్యము మాలిన పాఠమును శ్రీనాథున కంటగట్టుట ఆ మహాకవికి అపచారము చేయుట యగును.

'త్రిపురములను దగ్ధము చేసిన యీశ్వరుఁడు కృతి పతిని రక్షించుఁగాక' యనుట,—'భస్మీభూత పంచాస్త్రుఁడు వీక్షించు నేత్రత్రయిన్' అన్నట్లు తిట్టగునే గాని, దీవెన కాదు. కావున 'కాల్చిన జోదు' అను పాఠము, పద్యము నుండి అవ శ్యము తీసివేయవలసినది. అది శ్రీనాథుని రచనకు కళంకా పాదకము.

విమర్శ విస్తర మెందుకు ? వేదంవారు చేసిన మార్పు తప్పు. నిడుదవోలువారు చేసిన తీర్పే—ఒప్పు.

మంగిపూడి వారిది తప్పొప్పు లెఱుఁగని వ్రాత. కావున నది ఉపేక్షార్హమే గాని సమీక్షార్హము కాదు.

# వివేకానంద యతిగీతము

## శ్రీ ఎ. రామమోహనరావు

ఫిబ్రవరి 64 భారతిలో శ్రీ దేవరరెడ్డి వెంకటరెడ్డి గారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి "యతి గీతము" అను పద్య సంపుటిలో గల యతి దోషములు చూపించిరి. శ్రీ రామ కృష్ణ మఠమువారు ప్రచురించిన ఆ పేరున్న చిన్న పుస్తక మును నేను పరిశీలించితిని. ఆశ్చర్యమేమనగా—వారు చూపించిన దోషములలో రెండు మాత్రమే నిజమైన దోషములు. మిగిలి నవి ముద్రాదోషములే. అవి ఈ క్రింద తెల్పుచున్నాను.

1. ఆ పర్వతోగ్రద రీ ప్రాంతములయందు— ఇది యిట్లే ఉన్నది.

2 అచటఁ బుట్టిన దీశాంతి విమలగీతి—ఇదియు నిట్లే ఉన్నది.

3. ఆత్మనిగ్రహమె త ద్సనశీలి—ఇది యిట్లు లేదు. "ఆత్మ నిగ్రహమె త ద్ధనశీలి" అని యున్నది. 'ఆ' కును 'హ' కును యతి చెల్లినది.

4. పడక తాతాచార్య పంటవారి ముద్ర—ఇది ఇట్లు లేదు. "పడక తాతాచార్లవారి ముద్ర"—అని యున్నది. గణ యతిభంగ మేదియు లేదు.

5. "ఈ కర్మసూత్రమ్ము నింతింత తుంపుగాఁ
గజ్ఞానాసిచే ఖండనంబు."—

ఇదియును ఇట్లు లేదు.

"ఈ కర్మ సూత్రము నింతింత తుంపులు
గాఁగ జ్ఞానాసిచే ఖండనంబు" అని యున్నది.

ఇందెట్టి దోషమును లేదు.

6. " .... నిరాశ—కును సుదూరస్థుఁడేను నే నగుచు నీవు—ఇది యిట్లే గలదు,

7. " .... ముదుచుక—పడుకొనుటయు నెల్లయును సమానంబు గాగ." ఇది యిట్లు లేదు.

"మూలంబు లెల్లండి—ముడుచుక పండుకొం
టయు నెల్లయును సమానంబుగాగ."—

అని యున్నది. ఇందే దొసగును లేదు.

ఫలితార్థ మేమనగా, ఆయన చెప్పినవానిలో 1, 2, 6 మాత్రమే నిజము. అందునను ఒకటవది సమర్థనీయముగనే తోచును. శ్రీ టేకుమళ్ల రాజగోపాలరావుగారు తమ "చందశ్శాస్త్రము" న 18 వ పుటలో "శ్రీకర—ఈ క్రియ ఈరీతి పదములలోని రకారమును పాటింపక గొప్ప కవులు ప్రాసమును గూర్చి యున్నారు" అని విశేష విధులలో మూడవదిగా నిచ్చియున్నారు. కాన, కవి ఆ ప్రయోగమును బుద్ధిపూర్వకముగా వేసియుండునని యూహింపనగును. కాగా, స్పష్టమైన జాఱుపాట్లు 2, 6—ఇవి రెండే.

మూల గ్రంథము పరిశీలింపకయే "ఇత్యాది దోషాలు కవి సామ్రాట్టుల లేఖిని నుండి వెలువడవలసినవి కావు. 'యతి గీతము' లో ఇన్ని యతిభంగములు దొరలుట శోచనీయము" అని వ్రాయుట సాహసము.

నిజ మారసినచో ఒకటో, రెండో యతి దోషములు కవిసమ్రాట్టులకు గాక, గణ యతి ప్రాసైక బుద్ధులగు అల్ప కవులకు పడవు గదా! అసలు యతిదోష మెందువలన కల్గునో ఆలోచింపవలయును. ఒకసారి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి దగ్గరకు వెళ్లితిని. యతిప్రాస దోషముల్ చూచి, ఎగిరి గంతులువేసి, రత్నద్వీపము గాంచినంత సంతోష పడు అమాయకపురోజు లవి. ఆయన "రామాయణ కల్పవృక్షము" అరణ్యకాండములో ఒక ప్రాస దోషము చూచితిని. అది శబరీ ఖండము నందలి 339 వ పద్యము—శార్దూలము (3, 4 పాదములు)

"నా కింతప్పటినుండి గాగముని సంతానంబునందున్ స ప
ర్యా నిష్ఠామతి సాజపీవృశముగా నైతిన్ క్షమింపంగదే!"

ఇందు ప్రాస దోష మున్నదిగదా అని ఆయన నడిగితిని. ఆయన చూచి "ఔను. ఉంది. ఆ పద్యం రాస్తున్న ఆవేశంలో అట్లా జరిగింది. "నాకిం తప్పటి" అన్న దాంట్లోని నా అన్న దానిమీదే దృష్టి ఉండి సకారమే ప్రాసలో పడింది. వచ్చే ఎడిషన్‌లో దిద్దుకుంటాను" అన్నారు. అనగా, కవి మహావేశములో వ్రాయుచున్నప్పుడు ఎక్కడో ఒకచోట, తన దృష్టి అర్థవశాత్తుగా ఏదో అక్షరముపై నిల్చినపుడు, ఇటి పొరపాటు సంభవించును.



# లేఖలు

# జైచరాజకవి - అతికృతికన్య

శ్రీ దేవారపల్లి వెంకటకృష్ణారెడ్డి

భారతి సంపాదకులకు,

ఆర్యా,

జైచరాజ వెంకటనాథకవి రచించిన—హరిహరనాథాంకిత మైన—పంచతంత్రములోని యీ క్రింది పద్యములు :

వర్ణనలో 'అతి కృతి కన్య నందిన మురారి' శుక్రపక్ష ములో నె ట్లన్వయ మగునో బోధపడలేదు. కవి పక్షములో సుగమము. ఉషః కాలవర్ణనలో సమన్వయ మెట్లు ?

భారతిలో సమాధానము ప్రకటించి, నాబోటివారి జిజ్ఞాసను సఫలము చేయుదురు గాక. తూష్ణీంభావము బాధాకరమని విన్నపము.

కథా ఘట్టము : లబ్ధనాశం :

'..... దీప్తు ల్దిశ
ల్పొందుల్ గూడఁ ద్రిభంగి
భంగి మొరసెంబుం గుక్కుట వ్రాతముల్.

'అతి కృతికన్య నందిన మురారి విరాజదనం త భోగసం
స్థితి ప్రతివారముం బొదల శిష్యులొ పుణ్యజను ల్దయ
క్రియో
న్నతులు దురంత శాస్త్ర కలనం బ్రతివాదులనోర్వసర్వతో
గత మతికుండు నిల్చెఁ గవి కౌశికదిక్కట కాగ్రపీఠికన్.
'వర వసులక్ష్మి నుల్లసిలువానికి నేమి గొఱంత యీ విభా
కరునకు సంజ నిచ్చి తిరుగంబడి లక్ష్మి హరింప నెట్టిచో
నెరవుల సొమ్ము సత్యమగునే యని వెల్లనయ్యె వహ్నినాఁ
బరిగళిత ద్యుతిన్వెలకు బాఱు నిశాంత నిశాంత దీపముల్.
—(పంచ. 4—304, 305, 306 ప.)

ఇందలి 'కవి' ప్రయోగము శుక్రపరమా ? (కవి) రవి పరమా ? శ్లేషలో ఇరుపక్షములో సమన్వయ మగునేమో ! ఇది జిజ్ఞాస. క్రింది పద్యములో, 'విభాకరు—వసు' వర్ణన వాచ్యముగా కలదు. పై పద్యములో తొలి జాము కోళ్ల కూతలుఁ అరుణోదయఁ దీప్తులు వాచ్యముగా కలవు. మధ్య కాలములో సంధి కాల వర్ణన కాబో లనిపించుచున్నది.

సమన్వయ మెట్లో బోధపడలేదు. ఇది జిజ్ఞాస.

# మొల్లకాల నిర్ణయ సమస్య

ఆర్యా,

కడచిన భారతిలో (పుటలు 72—73) పై కాల నిర్ణయమును పురస్కరించుకొని 'శ్రీ ఆరుద్ర'గారు వ్రాసిన వ్యాసమునం దిట్లు గలదు—

"ఇంకే రామాయణంలోనూ కనబడకుండా, ఒక మొల్ల రామాయణంలోనే ఉన్న ఘట్టం కూడా ఒకటి మొల్ల కాలనిర్ణయానికి పనికొస్తుందేమో. తెలుగు దేశంలో ప్రచారంలో ఉన్న కొన్ని అవాల్మీకమైన కథలను మన కవులు తమ రామాయణాలలో చొప్పించినారు. మొల్ల కూడా అలాగే చేసింది. ఈ క్రింది ఘట్టం చూడండి—

చనుచు రాఘవుండు స్వర్ణది యొడ్డున
గుహుని గాంచి యతని గుస్తరించి
తడయకోడ దెట్టి దాటింపు మనవుడు
నట్ల చేయదలచి యాత్మలోన.

సుడిగొని రాము పాదములు సోకిన ధూళి వహించి రాయియే
ర్పడ నొక కాంత యయ్యెనట పన్నుగ నీతని పాదరేణు వి
య్యెడ నొక నోడ సోఁక నిది యేనగునో యని
సంశయాత్ముడై
కడిగె గుహుండు రాము పదకంజయుగంబు భయంబు
పెంపునన్. 2—31—32.

ఈ విషయం రంగనాథ రామాయణంలో గాని, భాస్కర రామాయణంలో గాని లేదు. పోనీ కూచిమంచి తిమ్మకవి రచించిన

అచ్చ తెనుగు రామాయణంలో నైతం లేదు. తిమ్మ కవి కాలం క్రీ. శ. 1960—1700 అని చరిత్రకారులు చెప్తున్నారు.

గుహుడు కాళ్ళు కడిగి శ్రీరాముడిని పడవ యెక్కించుకొన్నట్లు మొల్ల కల్పించడానికి కారణం ఏమిటి ? ఆమె కాలం నాటికి అటువంటి ఊహకి ప్రచారం ఎలా వచ్చింది? వసు చరిత్ర అవతారికలోని మొట్టమొదటి పద్యంలో కూడ ఇటువంటి కల్పనే ఉంది ....'' అని

వసు చరిత్ర ''శ్రీ భూపుత్రి'' పద్య మిచ్చి ''వసు చరిత్ర 1569—70 ప్రాంతమున రచితమైనది,'' అన్నారు.

కాని వ్యాసకర్త ఊహించినట్లుగా నీ కల్పన వసు చరిత్ర ననుసరించి రచించినది కాదు. ఇది తెలుగున నే రామాయణములందు నుండదు. ఈ కల్పన—జగద్వంద్యమై తుల లేని కీర్తి గడించిన తులసీదాసకృత రామచరిత మానస మను పేరు గల హిందీ రామాయణమునందలిది — పై పద్యమునకు సంబంధించిన భాగము నిట యుదాహరించుచున్నాను.

### అయోధ్యా కాండము

చౌపాయి : మాంగీనావ న కేవట ఆనా
కహయి తుంహార మరముమై జానా
చరణ కమల రజ కహసచుకహయి
మానుష కరని మూరికఛు అహయి

చౌపాయి : ఛువత సిలాభయి నారి సుహాయీ
పాహనతే న కాత కఠినాయీ
తరని ఉ మని ఘరనీ హెయి జాయీ
బాట పరయి మోరి నావ ఉడాయీ

చౌపాయి : ఏహిప్రతిపాలఉ సబు పరివారూ
నహిజానే కఛు అఉర కవారూ
జౌప్రభు పార అవసిగా చహహూ
మోహి పద పదుమ పఖారన కహహూ.

ఈ తులసీ రామాయణము తొలి తెలుగుసేత* నుండి యీ భాగమునకు తెలుగు అనువాదము నుదాహరించుచున్నాను.

చౌపాయి : కనియోడదెమ్మొ గడచెద మనగన్
విని యతడు వివేకి వేడుక లెసగన్
జనవర నీ పద జలజ యుగంబున్
గనియె మానుషీకరణ రజంబున్

చౌపాయి : శిలనారి యవుట జెప్పగ వింటిన్
నిల నావ నెక్క నెరి కాదంటిన్
పలు కాంకించు పరమేశ సనుం
గలవారి కెల్ల కులవృత్తి జనన్

చౌపాయి : బదలింపకు మిది పదతి యగు నేడన్
ఏడి నెగిరి దరిని బడిన నెరిజడన్
బడలెద పాదము గడిగెద సామీ
తడయక వాకెడు తలంపావేమీ.

పై యనువాదము చూచిన మొల్ల—తులసీ రామాయణమునే యనుసరించినట్లు స్పష్టమగుచున్నది. తులసీదాసు కాలము క్రీ. శ. 1532—1623 అని హిందీ వాఙ్మయ చరిత్రకారులు—

ఈ యనుసరణమును బట్టి మొల్ల కాలనిర్ణయ సమస్య పరిష్కరణ మగునా ?

హైదరాబాదు—నిడదవోలు వేంకటరావు.

## మధుర శాకుంతలము

ఆర్యా,

చర్ల గణపతిశాస్త్రిగారి ''మధుర శాకుంతలము'' పై సమీక్ష వ్రాయుచు ఈ క్రింది విధముగా చరమ ఘట్టమునందు వ్రాసితిని.

''పశున్ బుర్కిక్రియ వధింతు'' నని శాస్త్రిగారి ప్రయోగము. పు వర్ణకేతర విభక్తి పరమయినచో గో శబ్దమునకు నిత్యముగా ఉకారాంతములకు బహుళముగా పుగాగమ మగునని చిన్నయ సూరి వాక్కు. బహుళపదమును బట్టి ఉకారాంతములకు నైతము ద్వితీయా ద్యేకవచనము పరమయినపుడు పుగామము నిత్యముగా నగునని యనుకొనుచున్నాడను. దూసివారు బాల వ్యాకరణ వ్యాఖ్యలో ''తరువుచేత—తరుచేత'' అని యున్నారు. ఆ పక్షమున ''పశువును—పశును'' అను వైకల్పిక రూపములు సిద్ధించుట కవకాశ మున్నది. దీని విషయము ప్రాజ్ఞులింకను బాగుగా నాలోచింతురుగాక.''

ద్వితీయా ద్యేకవచనము పరమగునపుడు ఉకారాంతములకు పుగాగమము నిత్యము గావచ్చునను ఊహ పై వాక్యములలో నున్నది. కాని, యది పొరబాటు. అట్టి యూహ కేమాత్రము వీలు కలుగని పూర్వకవి ప్రయోగము లొకటి రెండు లభించినవి. అవి యివి. ''కుంజ మంటపకుటీ క్రోడ మధ్యంబున, నాఖుతోఁ జెలులాడు నడవిపిల్లి'' యని శ్రీనాథుడు. ''మీఁదం దార ధరాధరంబు గల యా మేరున్ నగం జాలి'' యని రామకృష్ణుడు. సాధాంశ మేమన ద్వితీయా ద్యేకవచనము పరమగునపుడు ఉకారాంతములకు పుగామము వైకల్పికముగా నగును.

శాక్యసింహ.

* ఇది విజయనగర సంస్థానమున నిప్పటికి తొంబ దేండ్ల క్రిందట రచితమైనది. మండ కామేశ్వర కవికృతము—అయోధ్యాకాండ భాగము శిష్టుకృష్ణమూర్తిశాస్త్రి రచితము. చూ. పరిశోధన. జూలై 1956—పుటలు 17—9

# గ్రంథ విమర్శలు

## గోపీచందు స్మారక సంచిక

వెల : 6.00, ప్రాప్తి స్థానము — ఆవుల సాంబశివరావు, కార్యదర్శి. గోపీచంద్ సంస్మరణ కార్యక్రమ సంఘము. హైదరాబాదు.

సుప్రసిద్ధాంధ్ర రచయితలలో త్రిపురనేని గోపీచంద్ గారొకరు. ఆయన జీవితము విభిన్న తత్త్వముల సంఘర్షణము. ఆర్థిక నియతి వాదముతో మార్క్సు ప్రతిపాదించిన దానిలో, అన్వేషణము ప్రారంభించిన గోపీచందు గారు చరమ జీవితములో అరవింద మహర్షి అనుయాయులైరి. పలువురకీ పరిణామము వింతగా గోచరించినది. అనేకులనేక విధములుగా ఈ పరిణామమునకు భాష్యములు— వక్రములు లేక ఋజువులు నయినవి— చేసిరి. గోపీచందు శుష్కతత్త్వ వేత్తగాడు. ఆయనలో భావయిత్రీ కారయిత్రీ శక్తులు మేళగించినవి. ఆయన ఎంతటి ద్రష్టయో అంతటి స్రష్ట. తాత్త్విక జిజ్ఞాస, భావుకత, రచనా కౌశల్యముగల మనీషి. అందుచే గోపీచందు గారేది వ్రాసినను, దానిలో తత్త్వము ప్రధానమై యుండును. కావ్య శిల్పము ఎడనెడ మందగించినను, ఈ తత్త్వమనునది బలీయముగా నుండుట చేతనే, ఆయన వ్రాసిన ప్రక్రియలను కన్నుల కొత్తుకొని, పఠించి, పాఠకులు పరవశించిరి. ఏ మూల తత్త్వము లేక రచనలు సాగించు వారు పెక్కురైన నాడు, ఆంధ్ర మేధావుల దృష్టి ఆయనపై ప్రసరించుటకు, అంతగా అబ్బుర పడవలసిన పనిలేదు. ఐన నొకటి, గోపీచందు గారు ఉన్న తత్త్వములను వ్యాఖ్యానించు వారేకాని నూతన తత్త్వములను సృజించు వారు గారు. ఆయన జిజ్ఞాస అనంతము.

నవల, కథ, కథానిక, గల్పిక, వ్యాసము, లేఖలు, నాటిక, నాటకము— ఈప్రక్రియా రచనలలో గోపీచందు గారు సిద్ధహస్తులు. కథానికను అల్ప కథానికగా చేసిన ఖ్యాతి ఆయనది. గోపీచందు గారి జీవితము రాజకీయ సాంఘిక సమస్యలతో, సాహిత్యముతో, తత్త్వ శాస్త్రముతో ముడివడినట్టిది. అందుచే ఆయన కథావస్తువు ఈ మూటికి చెందినదై యుండును. ఆయన స్వానుభవమును ఇతర అనుభవములను స్వేచ్ఛగా నుపయోగించుకొని పాత్ర సృష్టి చేసెను. దీనికి తోడు ఎంతటి గంభీర సూక్ష్మమనస్తత్త్వరహస్యములనైననుసరళముగా,సుకుమారముగా వ్యక్తీకరించు శక్తి ఆయనలో అపారముగా నున్నది. ఈ గడ్డలో ఇట్టివారు చాలా తక్కువ. ఆద్యంత నిర్వహణము బహువిధములుగా నుండు సాహితీ ప్రక్రియలను ప్రయోజన దృష్టితో గోపీచందు గారు రచించిరి. కతిపయ విచిత్ర మనస్తత్త్వములను చూపుటయో ఒక సమస్యను గూర్చి విచారధారను ప్రేరేపించుటయో, సంస్కార మార్గమును కనుగొనుటయో ఆయన రచనల లక్ష్యమై యున్నది.

వీని యన్నిటితో సమముగా తూగునట్టిది గోపీచందుగారి గ్రామీణ జీవన పరిశీలనము. ఆయనవలె ఆంధ్ర గ్రామీణ జీవనము నర్థము చేసుకొన్న వారెందరో లేరు. కృషికులను, వారి ఆర్థిక సాంఘిక సమస్యలను, వారి ఆవేశోద్వేగములను, వారి వేష భాషాచార వ్యవహారములను వారిపై నగర జీవన ప్రభావమును గోపీచందు గారు చక్కగా వర్ణించిరి. అనగా ఆయన వాడిన పలుకుబడి వలెనే, స్వీకరించిన కథావస్తువు సెరము తెనుగుదనముతో నిండిపోయినది. కాలక్రమమున విద్యావంతుల, నాగరికుల — ఉదారుల, సజ్జనుల, వంచకుల— సమస్యలను గోపీచందు గారు సానుభూతితో అర్థము చేసికొనుట మొదలిడిరి. సువిశాలమైన జీవనానుభవమును గడించిన వారౌటచే, ఆయన రచనలలో వైవిధ్య మెక్కువ. ఒక మహోద్యమమును వర్ణించుచు వారు అకాల మరణము పొందిరి.

గోపీచందు గారి అకాల మరణము ఆంధ్ర మేధావులను నిశ్చేష్టులను జేసినది. ఆ గ్రమాన్పాటునుండి తేరుకొనిన పిదప వారికి వారు హృదయ పూర్వకముగా అక్షరాంజలిని సమర్పించిరి. గోపీచందు గారి యేడూరు నాడు వెలువడిన అక్షరాంజలియే ఈ స్మారక సంచిక. హైదరాబాదులో గోపీచందు స్మారక కార్యక్రమ సంఘమొకటి యేర్పడినది. దానికి కార్యదర్శి ఆవుల సాంబ శివరావు గారు. వారే ఈ స్మారక సంచిక సంచాలకులు.

ఈ స్మారక సంచిక గోపీచందు గారి జీవిత చరిత్ర చిత్రణముతో మొదలగును. వారి అర్ధాంగితో పాటు, బంధువులు, ఆత్మీయులు సహ రచయితలు, అభిమానులు, శిష్యులు, ప్రశిష్యులు వ్రాసిన వ్యాసము లిందుగలవు. ఒక కొన్ని పద్య గేయ ఖండము లున్నవి. ఈ వ్యాసములను స్థూలముగా కొన్ని వర్గములుగా విభజింప వచ్చును. వ్యక్తిగా, రచయితగా, మిత్రునిగా, గోపీచందు

# గ్రంథ విమర్శలు

గారిని సమీక్షించిన వ్యాసములు కొన్ని తెనాలి, మద్రాసు, హైదరాబాదు— ఈ మూడు నగరములలో నివసించిన గోపీచందు గారిని పరిశీలించిన వ్యాసములు ఇంకొక కొన్ని. గోపీచందు గారి ఆయా ప్రక్రియలను గూర్చి, తద్విశేషములను గూర్చి, వాని యందలి పాత్రలను గూర్చి చర్చించిన వ్యాసములు వేరొక కొన్ని. కేవలము గోపీచందుగారి జీవితము తఱచి చూచి నిగ్గుదేల్చిన వ్యాసములు మఱియొక కొన్ని. ఆయా చోట్ల చమత్కారముతో భాసించు గోపీచందుగారి రచనాఖండము లున్నవి. ఒక్కొక్క ప్రక్రియను గూర్చి వ్రాయుట ఎంతో ముచ్చట గొల్పినది. ఈ స్మారక సంచికను ఆద్యంతము పఠించిన పిదప గోపీచందుగారి సర్వతోముఖ జీవనము సాక్షాత్కరించును. దానికి ఫలము పాఠకునకు తృప్తి కలుగుట. అత డొక యుత్తమ ప్రయత్నము సఫలమైనది గదా యని సంతోషింపగలడు.

ఈ స్మారక సంచికలో పద్య గేయ ఖండము లెక్కువగా లేని యందులకు సంపాదకులను తప్పక యభినందించవలసినదే. ఆ యున్నవానిలో కూడ కొన్నిటిని—మోమాటమునకు లోపడక—తొలగించి నప్పటికిని, సంచిక వన్నెవాసులకు వచ్చెడు లోటేమియు నుండెడిది గాదు. "మరియును నా వెంబడి బడి యూహ కలిగియుంట గొప్ప గోపీచంద్" అని యొకరు వ్రాసిరి. వా రిట్లేల వ్రాసిరో తెలియదు. ఇది గోపీచందు గారిని ప్రశంసించుటయా ? లేక తనను దాను ప్రశంసించుకొనుటయా ? ఇందలి అనంత ముఖ శిల్ప మెట్టిదో వ్రాసిన వారికే తెలియును. కొందరు వ్రాసిన పద్య గేయ ఖండములు నీరసముగా నున్నవి. ఏదో యొకటి వ్రాయవలయునని వ్రాసినట్లున్నవే తప్ప, వానిలో చిత్తశుద్ధి శూన్యము. వ్యాసములలో ఎక్కువపాలు చిత్తశుద్ధితో ముచికుంభతతో కూడినట్టివే. గోపీచందుగారి తాత్త్వక పరిణామమును కథానికా శిల్పమును విడమఱిచి చెప్పుట ఎక్కువగా నున్నది. అట్లే "అసమర్థుని జీవయాత్ర" ను గూర్చియు, తత్కథానాయకుడగు సీతారామారావును గూర్చియు బహుళముగా ప్రపంచించుట సంభవించినది. మిగిలిన నవలల పరామర్శయు లేకపోలేదు. కథానికలయందు వలెనే నవలలయందును గోపీచందుగా రి'రీతి' యొకటి యున్నది. ఆ రీతిని గూర్చి వ్రాసినవా రెవరును లేరు. మఱియు గోపీచందుగారు నాటికలు, నాటకములు వ్రాసిరి గదా ? వాని సమీక్ష లేదేమి ? నాస్తికుడైన గోపీచందు ఆస్తికు డగుటను గూర్చియే అధికముగా వ్రాయబడినది. అందుచే పునరుక్తి దోషము లేకపోలేదు. పలువురు వ్రాసిన యప్పు డీ దోషము తప్పదు.. గోపీచందుగారి తత్త్వధారను గూర్చి సాకల్యముగా వర్ణించిన వ్యాసములు లేవు. అక్కడక్కడ తత్త్వధారయు, నాటికలయు ప్రస్తావనమున్న సరిపోదు గదా ? "మానసిక పరిణామం", "భావ పరిణామం" అను వ్యాసములు ఆయన తాత్త్వక చింతనమును కూలంకషముగా వివరింపలేకపోయినవి. విశేష మేమనగా గోపీచందుగారి "తత్త్వవేత్తలు" గ్రంథ గత విశేషములు వ్రాయకుండుట ప్రముఖ దోషముగా చూపట్టకపోదు.

ఒకానొక రచయితను గూర్చి గాని, ఆయన రచనలను గూర్చి గాని విమర్శ వ్రాయునపుడు విమర్శకుని ఇష్టానిష్టములు దూరముగా నుండుటలేదు. లిఖితమైన స్వరమునకు వ్యాసకర్త అనుభవమే ప్రమాణము. ఈ యనుభవమునందలి మంచిసెబ్బరలను వింగడించి చెప్పునప్పుడు అవి సహేతుకములై యుండవలయును. ఈ హేతువులను వివరించునపుడే విమర్శకుని ఇష్టానిష్టములు పెడ్రకంతలు పట్టించును. ఈ హేతు వివరణము కత్తిమీది సాము. రచయిత వ్యక్తిత్వమును గాని రచన కళాసౌందర్యమును గాని వివరించునపుడు సంయమనము ప్రధానము. అదియునుగాక యున్న దానిని గూర్చి వ్రాయుట విమర్శకుని ధర్మము. తనకు మెచ్చిన దానిని గూర్చి యత్యుక్తులు పలుకుట, తన నచ్చినదాని కొఱకు ప్రాకులాడుట తగదు. ఈ స్మారకసంచిక యందలి కొన్ని యభిప్రాయములతో ఏకీభవించుట సహృదయులకు సాధ్యము గాని పని. వానిని జూడుడు. "భౌతిక ఆధ్యాత్మిక వాదాలను సమన్వయపరుస్తూ "పోస్టు చెయ్యని యుత్తరాలు రచించారు. ఈ లేఖలు తాత్త్వికరంగంలో గొప్ప సంచలనాన్ని కలిగించాయి. భౌతిక ఆధ్యాత్మిక సమన్వయ తత్వవేత్తగా ప్రపంచ తత్వవేత్తల కోవలో చేరారు." అరవింద మహర్షి గొప్పదనమును గోపీచందుగారి కంటగట్టుట తగదు. 'ఆయన నిజంగా ఒక సంస్థే. ఒక సంస్థ అనడం కూడా ఆయనకు అన్యాయం చేయడమే. ఆయన అనేక సంస్థల కలయిక — ఒక అంతర్జాతీయ సంస్థ". "ఆచంద్రార్కం ఆయన అమరుడే. ఆంధ్రసాహితీమతల్లికే కాదు—విశ్వసాహిత్య మాతకే ఆయన అస్తమయ వార్త అశనిపాతంలాంటి..ంటే అత్యుక్తి అణుమాత్రం కాదు."

"ఈ మొదటి నవల అసమర్థుని జీవయాత్ర ఒక్కటి చాలు గోపీచందును ఉత్తమ భావనాబలం గల భారతీయ రచయితలలో ఒకరుగా ప్రపంచ నవలాకారులలో ఒకరుగా చూపడానికి." "సత్య జిజ్ఞాసే ప్రధాన ప్రేరణగా, మూలతత్త్వంగా ఉన్నంతవఱకు, ఎవరే విధంగా ఎక్కడనుంచి బయలుదేరినా చేరవలసిన చోటుకే చేరుతారు అనే పరమ సత్యాన్ని నిరూపించిన టాల్‌స్టాయిలాంటి వారిలో గోపీచందుగా రొకరు." 'ఆధునిక తాత్వికవేత్తలు ..... ..... ఆలోచనకు సాయంగా, సంఘసాన్నిహిత్యంలోని అనుభూతుల ఆధారంగా లోకం గురించి నిష్పాక్షికంగా ఆలోచించేవారు. జాన్‌డ్యూయీ, విలియంజేమ్సు, జీన్‌పాల్‌సాత్రే, బ్రెట్రండ్ రస్సెల్, ఇత్యాది తాత్వికులు ఈ కోవకు చెందినవారే. గోపీచంద్ తెలుగుదేశంలో వారి ప్రభావంతో ఉత్తేజితులై అంత ఔన్నత్యం సంపాదించుకున్న తాత్వికవేత్త అనడంలో సందేహంలేదు." ఇట్టి వాక్యములు అపరిపక్వ పరిశీలనముతో గూడినట్టివి. గోపీచందుగారి గొప్పతనము నేమాత్రము పెంచనట్టివి. రచయితలకు గోపీచందుగారి పట్ల గల భక్తి ప్రపత్తులను తెలియజేయునట్టివి. "సినిమాలో ఇమడలేదు. కొన్నాళ్ళు కానట బీనటగా ఉంది. హేతువాదిగా ఉన్న గోపీచందు దిగజారి మతవాదిగా

మారిపోయాడు. రాయ్‌ని వదలి అరవిందుని ఆశ్రయించాడు. కవిరాజులో నాస్తికతకు బదులు ఆస్తికత చూడ నారంభించాడు. రచనలో పూర్వం ఉన్న బిగువు పోయి పలచబడింది. గోపీచందులో అపూర్వ పరిణామం వచ్చింది. పోస్టు చెయ్యని ఉత్తరాల్లో పడింది వరవడి .... ......" ఈ వాక్యము ఈ సంచికలో యుండుట సంపాదకవర్గము సమచిత్తమును చాటును. ఈ యభిప్రాయములు రచయితను రచయితగా చూచినట్టివి గావు. తనకు నచ్చినది, తనకు కావలసినది లేదే యనుట సహృదయ విమర్శనము గాదు. తాను వలచినది రంభయును, తాను మునిగినది గంగయునా ? "దిగజారి" పోయినది గోపీచందుగారా ?

"నే నెఱిగిన గోపీచంద్", "ప్రతిభావంతుడు", "కథానికా రచయిత" "కథాకథన చాతురి", "భావోపజీవి", "పీలు నామా", "లేఖలు", "సినీ సీమలో", "గ్రామీణ జీవితము", "స్వగతాలు", " నా స్నేహితుడు", "తండ్రీ కొడుకులు", "బహుధా" సంపాదకులను సార్థక శ్రమలను జేసినవి. సంచిక స్వరూపము ముచ్చటగా నున్నది. గోపీచందుగారిని తెలుగు మాగాణమునకు స్పష్టముగా ఎఱుకపఱచిన సంస్మరణ కార్యక్రమ సంఘము అభినందనీయము.

## కా మ రా జు

గ్రంథకర్త : పరిశీలకుడు. వెల : 1.00. ప్రాప్తిస్థానము : ప్రజా ప్రచురణలు. ఏలూరు. ఆంధ్రప్రదేశ్.

చిత్తశుద్ధి, కార్యశూరత, అపరిగ్రహము, నిష్కళంక దేశభక్తి యున్ననాడు నాయంకరమును పూనుటకు, పట్టములతో, పాండిత్యముతో పనిలేదు. ఇది యౌనని ఋజువు చేయు వ్యక్తులు ప్రాచీన కాలమున నున్నారు. నవీన కాలమున నున్నారు. ఈ కాలమున అట్టి వారిలో కామరాజ నాడారుగా రొకరు. ఆయన యుత్తమ నిర్మాణ కార్యకర్త. ఊర్ధ్వరేతస్కుడు. అక్షరజ్ఞాన గ్రంథ మెఱుగని అతి సామాన్య కుటుంబములో అవిర్భవించియు ఒక ముఖ్య రాష్ట్రమునకు ప్రధాన సచివుడై, తదభ్యుదయమునకు హేతువయ్యెను. అవినీతి, అధర్మము, అల్పదృష్టి, అరిషడ్వర్గము గూడుకట్టిన రాజకీయ పక్షములో పూర్వౌన్నత్యమును పాదుకొల్పుటకై, ప్రముఖ పథకమును రూపొందించిన ధర్మశీలి యయ్యెను. పదవీ వ్యామోహము జీవన తత్త్వముగా సాక్షాత్కరించు ఈ రోజులలో ప్రధాన సాచివ్యమును నిస్సంగబుద్ధితో, ఆర్జవముతో త్యజించిన ధీరోదాత్తుడయ్యెను. ప్రముఖ రాజకీయపక్ష సారథి యయ్యెను.

నిష్కామియగు కామరాజు జీవనగాథను "పరిశీలకుడు" అనువారు స్థూలముగా పరిశీలించిరి. ఇది అరువది పుటల లఘు గ్రంథము. ఇది ప్రధానముగా కామరాజు రాజకీయ జీవన గాథను వర్ణించును. ఉత్తమ కార్యకర్తగా, గాంధేయ ధర్మోపాసకుడుగా, త్యాగమూర్తిగా, ముఖ్యమంత్రిగా కామరాజు ఆర్జించిన అనుభవము లిందు గలవు. చక్రవర్తి రాజగోపాలాచారిగారు కామరాజునకు ప్రత్యర్థి. ఇరువురి తత్త్వములకు పోలికయే లేదు. ఇరువురకు సర్వ స్థాయిలలో విభేదములు జనించినవి. ఆ విభేదములు ప్రజ్ఞాచాతుర్యమునకు, నిష్కామ సేవకు కలిగిన సంగ్రామమునకు ఛాయలు. తుదకు నిష్కామ సేవయే విజయము గాంచినది. ఈ గ్రంథమునం దెక్కువ పాలీ సమరగాథయే. ఆచార్యులవారి, కామరాజుగారి స్పర్థ రాక్షస చాణక్యుల గాథను జ్ఞప్తికి తెచ్చును. ఈ భాగము ముద్రారాక్షసము వలె నున్నది. రచనము ధారాళమైనట్టిది. కామరాజునందలి రాజకీయమూర్తిని చూచినట్లుగా గ్రంథకర్త యితర మూర్తులను చూడలేదు.

—శాక్యసింహ.

## ము క్తా వ ళి

కర్త : శ్రీ ముదివర్తి కొండమాచార్యులు. ప్రతులకు : విద్యార్థి పబ్లికేషన్సు, ప్రగడవరం (వయా) చింతలపూడి, పశ్చిమ గోదావరి జిల్లా. వెల : 1.25. పుటలు : క్రౌను 60.

ఈ ఖండకావ్యమున భిన్న శీర్షికలతో పది ఖండిక లున్నవి. చిట్టచివర నున్న "శక్తి రథోత్సవము" ఖండిక పన్నెండు మాత్రల పాదములతోడి గేయము. మిగిలిన వన్నియు మామూలు పద్యములతో నున్నవి. ఇందు "నారాయణమ్మ పేరంటాలు" అనునది ఉత్పలమాలిక.

శ్రీమాన్ కొండమాచార్యులవారి యందు పద్య రచన విషయమున చేయి తిరిగిన తనము స్ఫుటముగా కనిపించు చున్నది. అనగా 'ధార' బాగున్నదని. మరియు నాచార్యులవారి యూహా పథము సాంప్రదాయికమైన జిగి లక్షణము కలిగి రమ్యముగా నున్నది.

"ధారుణీదేవ పరికల్పిత ప్రశస్త
సవనహవిరన్న భుక్తి హర్షమ్ము నేసి
స్తవ వచ స్సైంధవములపై స్వారి వోవు
హూతవహుడు దురితేంధన తతి దహించి
శోభన పరంపరలను గూర్చుత భృశంబు."

ఇది ఈ ఖండకావ్యమునకు నాంది. ఈ కృతియందు గల ఖండికలలో "కణాదుని త్యాగ నిరతి" "దీక్షాదానము" అన్నవి రెండును కొద్దిపాటి కథతో నున్నవి. కల్హణుని రాజ తరంగిణి యాధారముగా కణాదుని కథ వ్రాయబడినది. కణాదుడు పంచముడు. వాని ఇల్లున్నచోట తనకు నాలయము కట్టింపుమని కలలో కనిపించి రాజునకు శ్రీ మహావిష్ణువు చెప్పినాడు. రాజు చంద్రాపీడుడు. చంద్రాపీడుడా పనికి తన పరివారము నంపినాడు. కణాదు డచట నుండి తొలగించుట వారివలన కాలేదు. రాజే స్వయముగా వానికి దర్శన మిచ్చి మాటాడినాడు. చివరకు రాజు తనకు వచ్చిన కల విషయము చెప్పినాడు. కణాదుడు తన యింటి స్థలమును భగవంతుని కొరకుగా రాజుగారి కిచ్చినాడు. ఇది కథ. ఇందు కణాదుని ఆత్మాభిమానము—రాజ భక్తి—భగవదాసక్తి సమచితముగా 'శ్రీమాన్ ఆచార్యులవార,

చిత్రించిరి. మొత్తము కథ ముప్పది పద్యములలో ముచ్చటగా నిముడ్చబడినది. ఇట్టిదే రెండవదైన ''దీక్షాదానము''. జినదేవుడొక 'సఫాయి' వానిని కరుణించి వానికి బౌద్ధధర్మ దీక్ష నిచ్చుట అందు వర్ణింప బడినది. శ్రీమాన్ ఆచార్యులవారు గౌతమబుద్ధుడును జిన మౌనియు నొకరన్నట్లే వ్రాసిరి. ఒకరు కానిచో నా విషయము స్పష్టముగా వ్రాసియుండ వలసినది. అదియును గాక బౌద్ధ ధర్మ దీక్షాదాన కథలో జినమౌని ప్రసక్తి యేల ?

''నారాయణమ్మ పేరంటాలు''—కాపురమునకు రాక మునుపే పతి గతించగా సహగమనము చేసిన రెడ్డి కుల స్త్రీ. గూడూరువద్ద నేటికిని ఆమె పేర నొక గుడి యున్నదట. ఆమెను గూర్చి వ్రాయబడిన ఖండిక యది. ''అస్పృత పాథేయము''—ఆత్మాశ్రయ కవిత్వము. తన తల్లి మరణించగా నామెను గూర్చి కవి పడిన వేదన యది. నెల్లూరులోని శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారిని కీర్తించు పద్యము లొక పన్నెండు గలవు. ''ప్లవ', ''దుర్ముఖి'' అన్నవి సాంవత్సరిక కవితలు. శ్రీ ద్వారము వేంకటస్వామి నాయుడుగారి ప్రతిభా విశేషములను కీర్తించు ఖండిక ''ఫిడేలు నాయుడు''. చైనా వారు మన మీదకు వచ్చినారు గదా ! వారి నెదుర్కొనుటకు సర్వ భారతశక్తి రథము సన్నద్ధమై ముందడుగు వేయుటను ప్రేరేపించుచు, శ్లాఘించుచు, ప్రబోధించుచు. వ్రాయబడిన గేయము 'శక్తి రథోత్సవము'' 'నవకాళి' దురంతమును గూర్చిన వేదన ''ప్రాణభిక్ష'' గా వ్రాయబడినది.

—క్షేమేంద్ర.

## పూలబాల

రచన : చెఱుకుమిల్లి భాస్కరరావు బి. ఎ., బి. ఇడి., ప్రచురణ : విజయ భారతి, పబ్లికేషన్స్. 1—8—95 చిక్కడపల్లి, హైదరాబాదు—20. వెల : 0.60.

'పువ్వులు' గేయం బావుంది. ఆ వెనుక 'ఏమన్నాడు ?' అన్న గేయంలో

''బళ్లో పంతులు ఏ మన్నాడు ?
వళ్లు వంచి పనిచేయన్నాడు''

అని ఉంది. ఇదీ బాగానే ఉంది. చివరి గేయంలో అబ్బాయి,

''కేక్కొరో కోయని
కూయును సార్
కోయిల అంటే
కాకే నండి''

అని అంటే—,

''చదువును చెప్పే
విధి మార్చాలి
పిల్లల మనసులు
ఆకట్టాలి''

అని ఇనస్పెక్టరు గారి రిమార్కు— పిల్లలంతా నవ్వుతారట.

''మాస్టరు మాత్రం
అవమానంతో
ముఖం ముడుచుకొని
పోయాడు''

అయ్యవార్లను గూర్చి ఈ గేయకథ చదివే పిల్లలేమనుకొంటారో— ఇది బాలసాహిత్యం క్రింద చెలామణి కాదగినదని ''రేడియో అన్నయ్య'' గారి ఉవాచ. ప్రత్యేకించి బాలసాహిత్యంలో తల్లి తండ్రి గురువు దైవం యొక్క స్థానాలను కించ పరచే విషయాలకు చోటుండడం అభిలషణీయం కాదు.

ఉపాధ్యాయుని గురు స్థానాన్ని కించ పరచే గేయం ''పరీక్ష''. ఇది బాల సాహిత్యంలో ఉండ దగనిది.

''ఒంటి పిల్లి రాకాసి'' ''ఏడు చేపలు'' పాత కథలే. క్రొత్తదనం లేదు. అర్థంలేని పదాలు,

''మినమిన దెన
మనలు పలుకు
కని మసగిన
పసిడి పలుకు'' వంటివి ఉన్నవి.

కాగా పిల్లల సారస్వతంలో—,

''అధర సుధల'' ప్రస్తావన ఎందుకో అనావశ్యంగా ఉన్నది.

హారతివ్వడం కర్పూరంతో. పూలను హారతిగా ఇవ్వడం ఎట్లా అన్వయిస్తుందో—,

పూల హారతీ
గులాబీల హారతీ—,

అన్నారు రచయిత. కొన్ని పదాల స్వరూపమే మారింది. ఉదా :

పశువులు ఏవీ—,
మెసగనిదే మరి ! వంటివి.

''రేడియో అన్నయ్య'' అన్నట్లు 'మిత్రులు భాస్కరరావుగారు బాలల కొరకు గేయాలు వ్రాయడానికి అన్ని విధాలా అర్హత కలిగి ఉన్నారు.,

కానీ ఆ వ్రాయడంలో కొంత శ్రద్ధా, జాగ్రత్తా ఉంటే ఎంతో బాగుండెడిది గదా !

కె. సభా.

## సూక్తి ముక్తావళి

సంకలనకర్త : మనోధర జగన్మోహనరావు. ప్రకాశకులు : కాలచక్రం ప్రచురణలు, నత్తా రామేశ్వరము (వయా) పెనుమంట్ర (ప. గో. జిల్లా). వెల రు 6.50. పేజీలు : 432. క్రౌను 1/8 హాఫ్ కాలికో బైండు.

వేదములు ఉపనిషత్తులు, స్మృతులు, సూత్ర గ్రంథములు పురాణేతిహాస కావ్యముల నుండియే కాక సుశ్రుతాది వైద్య గ్రంథముల నుండి కూడ ఈ సంకలనములో సంస్కృత భాషా సూక్తులు సంగ్రహించ బడినవి. పూర్వ పండితులు సందర్భములలో ఉపయోగించుటకు కంఠస్థము చేయుచుండెడి ప్రస్తావ శ్లోకముల వలె ఉపయోగ పడుటకు అనువుగా ఈ సంకలనము చేయబడినది.

నీతి శాస్త్రము మొదలు పరిశిష్టము వరకు II శీర్షికల క్రింద శ్లోకములు సంగ్రహింప బడినవి. సంగ్రహింప బడిన ప్రతి శ్లోకములోను ఏదో విశేష ముండునట్లు కూర్చబడి ఉండుటచేత ఈ సంకలనము విశేష ప్రయోజనకారిగా నున్నది.

ఈ సూక్తి ముక్తావళిలో నొక విశిష్టత కూడ కలదు. ప్రస్తావ శ్లోకములు ఎక్కువ భాగము చమత్కార ప్రధానములు. అట్లయినను ఈ సంకలనము చదివిన వారికి ఆర్య ధర్మముల స్వరూపము చక్కగా గోచరించును. భక్తి భావమే కాక భారతీయ జీవితములో ఉదాత్తములు, ఉదారములు నగు నాశయము లెంతగా ఉండెడివో, లోకజ్ఞత ఎంత యుండెడిదో, వేష భాషలందు ఆచార వ్యవహారములలో సౌమ్యత, సౌజన్యము లెంతగా పాటింప బడుచుండెనో, ఈ గ్రంథము చదివిన వారికి స్పష్టపడును. ఆర్య ధర్మములను గూర్చి వివరించెడి ఎన్నో గ్రంథముల కంటె, ఇందులోని సూక్తులలో ఆర్య ధర్మము స్వరూప ప్రకాశనము చేసికొనగలిగినది. సూక్తి ముక్తావళి తన నామము సార్థకము చేసికొన్న ఉత్తమ సంకలన గ్రంథము.

ప్రతి శ్లోకము క్రిందను సులభమైన భాషలో ఆంధ్ర వివరణ మున్నది. వివరణములో మూలార్థము సూటిగా చెప్పుటకు కంటె విస్తరించి కూడ వివరించు ప్రయత్నము జరిగినది. విపరీతార్థము లిచ్చినపట్లు లేవు. గ్రంథాంతమందు 56 పేజీలలో శ్లోకాను క్రమణిక, దాని కెదురుగా శ్లోక మూల గ్రంథ నామములు ఇచ్చియున్నారు. అది గ్రంథ ప్రయోజనమును ద్విగుణీకృత మొనర్చినది.

ఎన్నో విషయములకు సంబంధించినవి 11 శీర్షికల క్రింద కూర్చుట కష్టతరమైన ప్రయత్నము. అందుచే వర్గీకరణము స్థూలముగా చేయ బడినది. 'కిమస్థిమూలాం' 'మహేశ్వరేవా జగతా మధీశ్వరే' మొదలైన దేవతా ప్రార్థన శ్లోకములు నీతి శాస్త్రము అను శీర్షిక క్రిందికి చేర్చుట వంటి అసంగతములు దొరలినవి. 'యదాకించిజ్ఞోఽహం గజ ఇవ' అని ప్రసిద్ధమైన భర్తృహరి శ్లోకము శ్లోకానుక్రమణికలో భర్తృహరిదని వ్రాయలేదు. శీర్షికలకు పూర్వము దేవతా ప్రార్థన క్రింద ఇచ్చిన వానిలో చివర చేర్చిన 'స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం' ఇత్యాది శ్లోకములు గ్రంథాంతమందు కూర్చినచో యుక్తతరముగా నుండెడిది. ఇట్టి స్వల్ప లోపములు శ్రద్ధగా పరిశీలించి పునర్ముద్రణములో సవరింప దగినవి.

ప్రకటనకర్తలు 'స్వవిషయములో' చెప్పినట్లు ముద్రారాక్షసములు లేకుండుటలో ప్రకటించిన శ్రద్ధ గ్రంథ ముద్రణములో గూడ చూపి యున్నచో శ్లాఘ్యతరముగా నుండెడిది.

ఈ సూక్తి ముక్తావళిలోని సూక్తులు బుద్ధిమంతు లందరు పఠించి గ్రహింప దగిన వనుటకు ఏ మాత్రము సందేహము లేదు.

—నోరి నరసింహశాస్త్రి.

## పోతన : విమర్శగ్రంథము

రచయిత: శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు. ప్రచురణ: నేషనల్ బుక్ ట్రస్టువారు. వెల 2.75 న. పై.

ఈనాటి పరిశోధకులలో నిడుదవోలు వారికి గల వస్తు భాండార మంతటిది ఇంకొకరికి లేదు. తెలుగువారికి ప్రీతిపాత్రుడైన భక్త కవి పోతన వంటి వా రింకొకరు లేరు. అలాటి నిడుదవోలు వారు అలాటి పోతనమీద వ్రాసిన గ్రంథమిది. చిన్న అచ్చులో డిమ్మీ సైజులో 230 పుట లున్నది. పోతనతోనూ ఆయన రచనతోనూ ఏలాటి సంబంధమున్న వస్తువైననూ పూర్తిగా ఇందులో లభ్యమౌతుంది. పరిశోధకులకీ వస్తువు అమూల్యము. చదువరుల సౌకర్యము కోసము ఒకచోట ఇచ్చినదైనా, తిరిగి ఆ పద్య ప్రశంస వచ్చినప్పుడు మళ్లీ యిచ్చారు ఆ పద్యాన్ని. మూల శ్లోకాలూ సంబంధ పద్యాలూ, మేన మామ పోలిక వాక్యాలూ, పోతనను గురించి ఎవరు ఎక్కడ ప్రశంసించినా ఆ ప్రశంసా వాక్యాలూ, భాగవత పద్యములను ఉదాహరించిన సంకలన గ్రంథములూ, భారతీయ భాషలలోని భాగవత రచయితల విశేషాలూ, భాగవతంలోని మంచి పద్యాలన్నీనూ, సేకరించి పెట్టారు ఇందులో వేంకటరావు గారు. ఈ గ్రంథం చూస్తే పోతన గారి ప్రసిద్ధ వనవర్ణన "మాతులుంగ లవంగలుంగ చూత కేతకీ భల్లాత కామ్రాతక——" వచనము జ్ఞప్తికి వస్తుంది. పుస్తకము బరువౌతుందని జంకినారేమో గాని ఉదాహృత పద్యముల నకారాదిగా ఇచ్చియుంటే ఎత్తి చూచుకోడానికి పనికి వచ్చియుండును.

ఈ గ్రంథము తొమ్మిది భారతీయ భాషల లోనికి అనువదింప బడునట. అది చూచి ఆనందించగల అవకాశము తెలుగ వారికి కలుగును గాక.

—శ్రీపాద గోపాలకృష్ణమూర్తి.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at The AndhraPatrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor : S. Sambhu Prasad.